## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని ఆర్కైవ్ వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ఆర్కైవ్ వారి వెబ్ సైట్: https://archive.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వేమనయోగి

# అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము

సవ్యాఖ్యాత

డా॥ శ్రీ బ్రహ్మనంద శ్రీధర స్వామి




ప్రచురణ

శ్రీ శివరామదీక్షితీయ అచల పరిపూర్ణ గురూపపీఠ రాజయోగాశ్రమం

మండల కేంద్రము: బచ్చన్నపేట -506 221

జిల్లా: వరంగల్ , ఆంధ్రప్రదేశ్

Tel:08710-54262

E-Mail: srapelli@rediff.com

# వేమనయోగి

## అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము

సవ్యాఖ్యాత

డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధర స్వామి M.A(Philosophy), M.Sc(Physics), Ph.D(Philosophy)

ప్రథమ ప్రచురణ ... క్రీ.శ. 6 నవంబర్ 2000 ... ప్రతులు ... 500

Cover designed by: **Monika Giri**

ప్రతులకు

1) శ్రీమతి పొన్నాల అనసూయాంబగారు, ఇం.నెం. 4-1-96, రాజయోగాశ్రమము, పాతబోయిగూడ, సికింద్రాబాద్ - 500 008.

2) శ్రీ బోధానంద రాపెల్లి రామచంద్ర రాజయోగి, ఉప కార్యదర్శి, రాజయోగాశ్రమము, బచ్చన్నపేట-506 221, జిల్లా: వరంగల్, ఫోన్: 08710-54262

వెల: రూ॥ 50/-



లేజర్ టైప్ సెటింగ్

యం. సీతారాములు, ఇం.నెం. 1-6-564/1, దాయర మార్కెట్, ముషీరాబాద్,

హైద్రాబాద్ ఫోన్:7624923

## అంకితం

పది పదులు నిండిననూ
అచలయోగ ప్రచారమును
అమిత ప్రేమతో చేయుచున్న
సద్గురువర్యులు

అచలర్షి
శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగీశ్వరుల
పాదపద్మములకు

ఈ గ్రంథము అంకితం చేయుబడినది.

# కృతజ్ఞతలు

దాదాపు రెండు వందల సంవత్సరాల పూర్వము వేమన పద్యాల తాటాకు ప్రతులను సేకరించి, వాటిలోని పద్యాలకు శుద్ధ ప్రతులను వ్రాయించి, పాఠనిర్ణయాలను చేసి, నిర్దుష్టమైన పద్ధతిలో మొట్టమొదటి సారిగా వేమన పద్యాలను వెలుగులోనికి తీసుక వచ్చిన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌కు మరియు వేమన గూర్చి పరిశోధించి, వేమనను చరిత్రలో నిలిపిన 20 వ శతాబ్ది ప్రముఖులు వంగూరి సుబ్బారావు, శేషాద్రి వెంకట రమణ కవులు, వేదం వేంకట కృష్ణ శర్మ, వేటూరి ప్రభాకర శాస్త్రి, బండారు తమ్మయ్య, రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ, నార్ల, ఆరుద్ర,. డా॥ ఎన్. గోపి మొదలగు వారందరికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

అయిదు సంవత్సరాల కిందట డా॥ ఎన్. గోపి, ప్రొఫెసర్, తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం (పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటి యొక్క ప్రస్తుత వైస్ ఛాన్సలర్) గారిని వారి ఇంటిలో కలసి వేమన గూర్చి మాట్లాడిన క్షణాలు మరువలేనివి. దాదాపు వారితో మూడు గంటలు ముచ్చటించుట జరిగెను. వేమన యోగి అద్వైతాది మతాలకు అతీతుడని కొన్ని వేమన పద్యాలను తీసుకొని వారికి వివరించుట జరిగెను. అందులకు వారు అంగీకరించి, ''నీకు నిజమైన వేమన దొరుక గలడు. పరిశోధింపుము'' అని చెప్పి ఆశీర్వదించిరి. ఆనాడు మొదలుకొని మద్గురువర్యుల మరియు నా నాన్నగారగు శ్రీ బోధానంద రాపెల్లి రామచంద్ర రాజయోగి యొక్క సలహాలను గైకొనుచు ఈ గ్రంథ రచనకు పూనుకొంటిని. ఇందులకు గురువర్యుల ప్రేరణ బీజము కాగా, శ్రీ దయానంద పొన్నాల సాందీపిని రాజయోగీశ్వరుల వారిచ్చిన సూచనలు ఆ బీజమునకు శక్తియై, అమ్మానాన్నలు అందించిన ఆర్థిక సహకారముచే ఆ బీజము వృక్షమాయెను. నా పూర్వ కళాశాల ఆచార్యులు మరియు నా పిహెచ్.డి పర్యవేక్షకులు డా॥ ఆర్. వెంకట్ రెడ్డి గారు నా రచన పూర్తియగు వరకు నా వెన్నంటి ప్రోత్సహించి, తొలిపలుకును ఆ సమయంలో అమెరికాలోనున్ననూ వ్రాసి పంపించిరి. ఇక ఆత్మీయ సోదరుడు శ్రీ చిన్మయానంద బెజుగం చంద్రయాఖ్య రాజయోగి గారు ఈ గ్రంథమును ముద్రింపించి ప్రచారమునకు ఊతమయ్యిరి. ఇదంతా మద్గురుని కటాక్షమని తలుస్తూ, ఈ గ్రంథ రచనకు తోడ్పడిన వారందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నాను.

*డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధర స్వామి*

# విషయ సూచిక

అధ్యాయాలు - పేజీ సంఖ్యలు



★★★

## ప్రశంస

ఈ గ్రంథము శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగీశ్వరుల కరకమలములచే క్రీ. శ. 11 - 11 - 2000 (కార్తీక శుద్ధ పౌర్ణమి) రోజున రాజయోగాశ్రమము, బచ్చన్నపేట, జిల్లా॥ వరంగల్లు లో ఆవిష్కరించబడిన శుభ సందర్భమున అ। ప ॥ శ్రీ చెన్నూరి లక్ష్మయ్య గారు ప్రశంసాపూర్వకముగా చెప్పిన పద్యములు:

కృతి కర్త:

తే॥ చిరుత ప్రాయము నుండియే శ్రీధరుండు
గురుని దరిజేరి యెరిగి యీ గుహ్యమకట
గ్రథిత మొనరించినాడు యీ గ్రంథమిపుడు
సంగయార్యుని కరుణచే సాక్షరముల ॥

కృతి భర్త:

ఆ॥ శ్రీ దయాంతరంగ శ్రీ సంగమేశుండు
కృతికి భర్తయగు సుకృతము కలుగ
గ్రంథ ప్రాభవమును గణియించ వలెగాని
పట్టి మాటలన్ని మట్టి గరచు ॥

కృతి ప్రచురణ దాత:

తే॥ గ్రంథ ప్రచురణకయ్యెడి ఖర్చు నెరిగి
ద్రవ్యదాతగ నిల్చిన ధర్మపరుడు
చిన్మయానందరూపుండు చిరయశుండు
చంద్రయాఖ్యుండు వెలుగునాచంద్రమకట ॥

# ఆశీస్సులు

శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠ రాజయోగాశ్రమ సాంప్రదాయకులకే గాక ప్రతి ఒక్కరికి వేమనయోగి యొక్క 'అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము' సులభంగా అర్థమగునటుల డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధర స్వామి రచించి ప్రకటించిన ఈ గ్రంథము తత్వ జిజ్ఞాసుల ఆదరణ పొంది, ఆదర్శనీయమౌగాక! వీరు చేసిన కృషి ప్రశంసనీయము. శుభాశీస్సులు.

ఇట్లు
పీఠాధిపతి
శ్రీ దయానంద పొన్నాల సాందీపిని
రాజయోగీశ్వరులు

శ్రీ శివరామదీక్షిత
అచల గురు పీఠ రాజయోగాశ్రమం,
పాతబోయిగుడ,
సికింద్రాబాద్,
**6-10-2000.**

డా॥ ఆర్. వెంకట్ రెడ్డి
తత్వశాస్త్ర విభాగాధిపతి
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాద్



## తొలి పలుకు

డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధరస్వామి కృతమగు 'వేమన యోగి అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము' అను యీ గ్రంథమును ఆమూలాగ్రము చదివితిని. ఇది చక్కని ఉదాహరణములతో, ధారాశుద్ధితో నొప్పారుచున్నది. వేమన వేదాంతాన్ని 'అచల బోధ' యనీ, 'అచల సిద్ధాంతము' నీ వీరు పేర్కొంటారు. ఐతే కొంతమందికి యీ అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతం పట్ల సరియైన అవగాహన లేక పోవుటయే కాక, కొన్ని దురభిప్రాయాలున్నట్లు శ్రీ శ్రీధర స్వామి గారి క్రింది కవిత వల్ల తెలుస్తూ వుంది:

''అచల బోధ నీచమనుట
అభాగ్యుల నోటి దురద
అచల మనగ అర్థమేదొ?
అచల యోగి జేరి కనుము''

ఇట్టివారు అభాగ్యులనీ, వీరి విమర్శలు కువిమర్శలనీ, బాధ్యతారహితమైనవనీ మనం ఊహించుకోవచ్చు. ఇటువంటి కువిమర్శకులకు ఈ పుస్తక పఠనం కనువిప్పు కలిగించగలదు.

ఏ అభిప్రాయము యొక్క, లేదా ఆ అభిప్రాయాన్ని పొందుపరచే యే గ్రంథం యొక్క సార్థకతయైనా ఆ అభిప్రాయాన్ని విజయవంతంగా వ్యక్త పరచటంలో ఉంటుంది. ఈ విధంగా ఆలోచిస్తే శ్రీ శ్రీధరస్వామి గారి కృషి సార్థకమైనదని చెప్పటానికి ఏమీ సందేహం లేదు.

యోగి వేమన పేరు వినని తెలుగు వారు లేకపోయినప్పటికీ ఆయన జీవిత విశేషాలు ఇదమిత్థమని చెప్పటానికి వీలు లేకుండ ఉన్నాయి. వేమన దిగంబర యోగి అనీ, అభిరామయ్య, విశ్వద అనే వారిని తన పద్యాల మకుటంలో సంబోధించాడనీ చాలమందికున్న అస్పష్టమైన

అభిప్రాయాలను రచయిత ఖండించి, మకుటంలోని మర్మాలను విప్పి చెప్పారు. వేమన భావాల ప్రాశస్త్యాన్ని చాలమంది పాశ్చాత్యులు కూడ అంగీకరించిన విషయాన్ని రచయిత సోదాహరణంగా నిరూపించారు.

వేమన యోగి పేరు అష్టదిక్కులలో వ్యాపించేటట్లు అష్టాధ్యాయాలుగా సాగిన ఈ రచన వేమన వేదాంతాన్ని సుబోధక మయ్యేటట్లు ప్రకాశ పరచినదనటానికి ఏమీ సందేహం లేదు. అయితే వేమన వేదాంతం ఏమిటి? ఆయన పద్యాలలో అసలు వేదాంతం ఉన్నదా? అనే విషయాలను రచయితయే సమగ్రంగా చర్చించటం చేత ఈవిషయమై ఆయన భావాలను ఆయన మాటలలోనే సంగ్రహంగా చెప్పితే బాగుంటుందనుకొంటున్నాను.

''వేమన కావ్యాలు వ్రాయునికవి ... సమాజంలో ఉన్న మూఢ నమ్మకాలపై, మూఢాచారాలపై, కులవ్యవస్థపై, మత సిద్ధాంతాలపై ఒక్కటేమిటి ప్రతి విషయంపై తన ఆటవెలదులను ఈటెలుగా విసరిన మహోఋషి.''

''వేమన తర్వాత వేమన పద్యాలు ప్రజల నాలుకలలో మాత్రమే వుండి పోయాయి. హృదయాలు మాత్రం మూఢాచారాల ముసుగులో పడి వేమనను మఱచిపోయాయి.''

''... మనకు దొరికిన దాదాపు **4000** (వేమన) పద్యాలు నీతి, భక్తి, యోగ, వైరాగ్య, జ్ఞానసంబంధమై వుండి కలగా పులగంగా వుండుటచే వేమనయోగి తత్వశాస్త్రము ఎవరికీ అంతు పట్టలేదు... కొందరు అద్వైతియని, మరి కొందరు శివాద్వైతి యని ఇంకొందరు నాస్తికుడనీ తమ తమ ఇష్టానుసారం వేమనను త్రిప్పుకొన్నారు...

ఆ॥ వెర్రి నక్కల వలె వేదముల్ జదివేరు
యాశయంబు లెరుగ రయ్యవార్లు
వేదసారమంత వేమన యెరుగును
విశ్వదాభిరామ వినుర వేమ ॥

వేదముల ప్రధాన లక్ష్యమును తెలుసుకోక పోవడం వల్లే క్రమేణా వేదమతం క్షీణించి, అనేక మతాలు ఏర్పడినాయి. కనుక సారం తెలియని పఠనం వృథా అనియు, వేదాంతసారమంతా

తనకు తెలియుననీ వేమన తెలియజేశాడు. అయితే వేమన స్వయంగా ఈ సారాన్ని తెలిసికొన్నాడా? లేదు. వేమన తన గురువు ద్వారా సర్వ శాస్త్రాల సారాన్ని గ్రోలినట్లున్నాడు. అందువల్లే అంత నిర్భయంగా నొక్కి చెప్పుచున్నాడు.''

1) వేమన – అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము – ఒక పరిశీలన, 2) విశ్వదాభిరామ వినుర వేమ, 3) గురువు, 4) దైవము, 5) అచల పరిపూర్ణ బ్రహ్మము, 6) ఎరుక, 7) ఎరుకను విడిచే విధానము, 8) గురు ద్వయ మంత్రార్థ నిర్ణయము అనే ఎనిమిది అధ్యాయాలలో గ్రంథకర్త వేమన నొక వ్యక్తిగా, కవిగా, తాత్వికునిగా పరిశీలించి మన యెదుట నిలిపారు.

స్థూలముగా వీరు పూర్ణ బ్రహ్మములు రెండనియు, ఇందొకటి శబ్దబ్రహ్మమనీ, రెండవది పరబ్రహ్మమనీ, శబ్దబ్రహ్మమును గూర్చి చక్కగా తెలిసికొన్నవాడు పరబ్రహ్మము (అచలము)ను సులభంగా తెలిసికోగలడంటారు. తత్వ విచారణచేసిన వాడికి సర్వద్వంద్వములకు, సర్వ త్రిపుటులకు నిలయమైన బ్రహ్మము మాయా స్వరూపమైనదని తెలియబడును. కనుక పరిపూర్ణ బ్రహ్మము నందు 'లేని బ్రహ్మము' ను తీసివేయగా పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే శేషించును అంటారు. దీనికి ప్రమాణంగా బృహదారణ్యకోపనిషత్తునుండి:

శ్లో॥ పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

అనే శ్లోకాన్ని పేర్కొన్నారు.

''ఈ జగత్తుకు మూల కారణం బ్రహ్మము (ఎరుక). ఈ బ్రహ్మమే స్వయం ప్రకాశమై సర్వమాయలకు సర్వ భ్రాంతులకు కూకటి వేరై వున్నది. పరిపూర్ణ బ్రహ్మము నిరతం బెడతెగకుండి, సర్వ లక్షణ విలక్షణమైయుంది. బ్రహ్మము సర్వ లక్షణమై జగద్రూపముగా వుంది.'' అయితే జీవుడు తనను బ్రహ్మముగా నెఱింగి, యీ ఎరుకను కూడ విడిచి ద్వంద్వాతీతుడై, పరబ్రహ్మోస్థితుడై యుండుటయే ముక్తి యంటారు. వేమన సిద్ధాంతం స్థూలంగా నిదియే.

యోగి వేమన పై కారణం చొప్పున విగ్రహారాధనను నిరసించాడు. ఆత్మ విచారమును ప్రోత్సహించినాడు. అయితే ఆత్మ జ్ఞానము, అచల స్థితి (ద్వంద్వాతీతము,

భావాభావాతీతమునైనది) సద్గురు కటాక్షము వలననే సిద్ధిస్తుందంటారు. అచల స్థితినందుటయే గురుత్వమునకు గీటురాయి. ''పరిపూర్ణమును, లేని ఎరుక (బ్రహ్మము)ను ఎరిగి, ఎరుకను విడువ వలెనని'' వేమన సిద్ధాంతము . పైన పేర్కొన్న విషయాన్నే రచయిత సమర్థవంతంగా సంగ్రహంగా చెప్పారు.

''ఎప్పుడైతే ఆత్మ లేకుండ శూన్యమైపోతుందో, అప్పుడే జగత్తు లేదు, ఆత్మయూ లేదు. ఉండేది ఆ పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే అని వేమన ఆత్మ తత్వాన్ని సోదాహరణంగా వచించుచున్నాడు.''

ఆ॥ తానె తత్వమనుచు తన్నెరుంగగ లేక
మాయ తత్వమనుచు మరుగు చుండు
ధర్మ కర్మములను తగరోయ తత్వమౌ
విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఈ రచయిత కలం నుండి ముందు ముందు ఇటువంటి ఉత్తమ రచనలే, ముఖ్యంగా అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతమును గూర్చి, వెలువడతాయని ఆశిస్తూ, ఇంతవరకు చేసిన కృషిని ప్రశంసిస్తూ యీ తొలిపలుకులను ముగిస్తున్నాను.

(డా॥ ఆర్. వెంకట్ రెడ్డి)

# ప్రస్తావన

మానవుడు పుట్టినప్పటి నుండి సృష్టి యొక్క పరిశోధన చేస్తూ పురాతన సిద్ధాంతాలను పక్కకు నెడుతూ, నూతన సిద్ధాంతాలను సిద్ధాంతీకరిస్తూనే ఉన్నాడు. నేటివరకు ప్రపంచంలో తాత్వికచింతనకు సంబంధించిన అనేక మతాలు, సిద్ధాంతాలు, దర్శనాలు, అభిప్రాయాలు వెలసినవి. అవి వివిధ కాలాలలో వున్న ఎందరో మహానుభావుల కృషి ఫలితాలే. ఆ కోవలోనే పురాతన వాఙ్మయాలైన వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, షడ్దర్శనాలు, అనేక మతాలు వెలిశాయి.

వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ వున్న పరస్పర విరుద్ధాలైన శ్రుతుల వల్లనో, లేక ఆయా మహానుభావుల విభిన్న ఆలోచనా దృక్పథాల వల్లనో, లేక ఆయా దేశ కాల పరిస్థితులను అనుసరించో విభిన్నాలైన మతాభిప్రాయాలు, సిద్ధాంతాలు ఏర్పడ్డాయి.

భారతదేశ తాత్విక చరిత్రను తరచి చూస్తే వేదాలు, ఉపనిషత్తులు, ఇతిహాస పురాణాలు, బ్రహ్మ సూత్రాలు, భగవద్గీత మొదలగు వేద శాస్త్రాలు మరియు చార్వాకం, జైనం, బౌద్ధం, అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం, శైవం, శాక్తేయం, సౌరం, గాణాపత్యం, కుటీచక, కాపాలిక, మహమ్మదీయ, క్రైస్తవ మొదలగు మతాలు కనిపిస్తాయి.

వేదాల ప్రధాన ఆశయం అపార్థం చేసుకొని, వైదిక కర్మలైన యజ్ఞ యాగ క్రతు విధానాలు (జీవబలులు) మొదలైన దురాచారాలు సంఘంలో వేళ్లానుకొనిపోయి, మానవ విలువలు నశించిపోయే తరుణంలో మానవుని నైతిక వికాసానికి, సంఘ సముద్ధరణకు తోడ్పడినదే జైనమతం. తాత్విక చింతన దీని పరిధిలోనే లేదు.

బుద్ధుడు ప్రవృత్తి, నివృత్తి మార్గాలను పరిహరించి మధ్యేమార్గం అనబడే అష్టాంగ మార్గమును ప్రతిపాదించాడు. సాంఘిక సమస్యలను నివారించి సామాన్య మానవుల జీవితాల్ని సక్రమ పంథాలో నడిపించటానికి బుద్ధుడు నాలుగు ఆర్యసత్యాలను బోధించాడు. ఈ అష్టాంగ మార్గం ఆర్య సత్యాలలో చివరిది. ఇదే నిర్వాణానికి దోహదం చేస్తుందని బుద్ధుడు భావించాడు. బౌద్ధంలో బుద్ధీంద్రియాన్ని సద్వినియోగం చేసి పరిశుద్ధ జీవిత విధానం

నిర్ణయించబడింది. కాని బుద్ధుడు పారమార్థిక తత్వ జిజ్ఞాస చేయలేదు. కనుకనే ఆయన ప్రతిపాదించిన అష్టాంగ మార్గంలో తత్వవివేచన కానరాదు.

బుద్ధుడు మానవులకు సోదర భావం, స్వేచ్ఛాలోచన, నైతిక ప్రధానమైన పరిశుద్ధ జీవనం బోధిస్తే, ఆయన శిష్యులు తమకు ఇష్టమైన మార్గాలనే అనుసరిస్తూ మూల సిద్ధాంతాలను తలక్రిందులు చేశారు. బుద్ధుని తర్వాత బౌద్ధం వివిధ శాఖలుగా చీలిపోయింది. ఈ శాఖలలో దురాచారాలు పెచ్చు పెరిగి వజ్రయానం అభివృద్ధితో బౌద్ధమతం భారతదేశంలో పతనమయింది.

బౌద్ధధర్మం క్షీణదశలో శంకరాచార్యులు అద్వైతమతాన్ని పునరుద్ధరించారు. అద్వైత సారం శంకరుని మాటల్లో 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవనాపరః' అంటే ప్రపంచం బ్రహ్మము యొక్క ఆభాస మాత్రమే. బ్రహ్మము అధిష్ఠానముగా ఉండగా దానిలో ప్రపంచం ఉన్నట్లు తోస్తుంది. కాని వాస్తవంగా లేదు. జీవుడు బ్రహ్మము కంటే వేరుకాడు. మానవుడు మాయ లేదా అజ్ఞానం ద్వారా నిర్గుణ నిరాకార బ్రహ్మమును సగుణ సాకారంగా భావిస్తున్నాడు. అంతేగాక ఏకమైన బ్రహ్మమును నానావిధ దృశ్య ప్రపంచరూపంగా చూస్తున్నాడు. ఇదే మాయా ప్రభావం. మాయ అనిర్వచనీయమని శంకరులు అభిప్రాయపడ్డారు.

శంకరుల తర్వాత వచ్చిన విశిష్టాద్వైత స్థాపకులు రామానుజాచార్యులు, ఆ తర్వాత వచ్చిన ద్వైతమత స్థాపకులు మధ్వాచార్యులు శంకరుల అద్వైత సిద్ధాంతాన్ని పూర్తిగా ఖండిస్తూ, అందుకు తగిన కొన్ని వేదశాస్త్ర పురాణాల ప్రమాణాలను సూచించారు.

రామానుజాచార్యుల విశిష్టాద్వైత మతంలో బ్రహ్మము సగుణ సాకార స్వరూపమని నిర్ణయం. బ్రహ్మము విశేష లక్షణాలతో కూడిన విశిష్ట పదార్థం. ఈ మతంలో సగుణ బ్రహ్మము ( ఈశ్వరుడు), నిత్యజీవులు (చిత్), అచేతన ప్రకృతి (అచిత్) – మూడు సత్యాలే. వీటిలో బ్రహ్మము సర్వస్వతంత్రమైన పరమ సత్యం. తక్కినవి రెండూ పరతంత్రాలు. చిత్, అచిత్‌లు బ్రహ్మముకు భిన్నం గాక బ్రహ్మమునకు విశిష్ట లక్షణాలుగా అవయవరూపంగా ఉంటాయి. కనుక చిద చిద్విశిష్టుడు బ్రహ్మము. రామానుజులు శంకరుని మాయావాదాన్ని అంగీకరించలేదు. ప్రపంచం ఆభాస మాత్రమైన మిథ్య కాదు. ఇది యదార్థం. సృష్టి కారకుడైన ఈశ్వరుని వలె ప్రపంచం కూడా సత్యమే. ఈ జగత్తుకు అభిన్న నిమిత్తోపాదాన కారణము ఆ బ్రహ్మమే. భక్తి ద్వారా భగవంతుని సాన్నిధ్యంలో ఉండటమే దేహ విముక్తి. ఇదే విశిష్టాద్వైత మత సిద్ధాంతం.

మధ్వాచార్యులు జీవ బ్రహ్మములకు అత్యంత విభిన్నత్వం ప్రతిపాదించి, అందుకు తగిన తార్కిక వాదనలతో స్థిర పరచిన వేదాంత శాఖయే ద్వైతం. రెండు సత్తాల భేదంపైనే ఈ మతం ప్రతిష్ఠితమైంది. 1) భగవంతునికి - జీవునికి 2) భగవంతునికీ - జడ ప్రకృతికి 3) జీవునికి - జీవునికి 4) జీవునికి - జడ ప్రకృతికి 5) జడపదార్థానికి - జడపదార్థానికి మధ్య భేదం ఉన్నదని ఐదు విధాలుగా భేదాన్ని నిరూపించాడు మధ్వాచార్యుడు. ఈ మతంలో ముక్తి అంటే జీవుడు అన్యరూపాన్ని వదలి తన స్వరూప స్థితిలో ఉండటం. కాని, భగవతునిలో ఐక్యం పొందటం ఉండదు. ద్వైతంలో మూడు పదార్థాలు సత్యాలు - బ్రహ్మము, జీవుడు, ప్రకృతి. ఇవి మూలంలోనే పరస్పర భేదాలున్న శాశ్వత ద్రవ్యాలు. అయితే బ్రహ్మము స్వతంత్ర సత్త. మిగిలిన రెండూ బ్రహ్మము మీద ఆధారపడే పరతంత్ర సత్తాలు. ఈ విధంగా ద్వైతమవుతుంది. ద్వైతులు బ్రహ్మమును జగత్తునకు నిమిత్త కారణమనియు, ప్రకృతిని జగత్తునకు ఉపాదాన కారణమనియు అందురు. వేద విహిత కర్మాచరణ ద్వారా జీవుడు పరిశుద్ధి చెంది శరీరాన్ని వదలి పూర్తిగా బంధవిముక్తుడు కాగలడని వీరి మతం.

పైన తెలిపిన విధంగా భారతదేశంలో వైదిక మతం, జైన మతం, బౌద్ధమతం, అద్వైతం, విశిష్ఠాద్వైతం, ద్వైతమతాలు ఆయా కాలాల్లో ఎక్కువగా ప్రాచుర్యం పొందాయి. వీటిలో జైన, బౌద్ధాలు మానవుని నైతిక వికాసానికి, సంఘ సముద్ధరణకు తోడ్పడ్డాయి. అంతేకాని వీటిలో తాత్విక చింతన జరుగలేదు. ఇక అద్వైత, విశిష్ఠాద్వైత, ద్వైత మతకర్తలు వేదోపనిషత్తులను ప్రమాణాలుగా సూచిస్తూ తమ తమ మతాలను సిద్ధాంతం చేశారు. అయితే ఇందులో అద్వైతం బ్రహ్మమును నిర్గుణ నిరాకారంగానూ, ద్వైత విశిష్ఠాద్వైతాలు బ్రహ్మమును సగుణ సాకారంగానూ వేదోపనిషత్తుల ప్రమాణంగానే నిర్ణయించాయి.

పైన వివరించిన ఆయా మతాలు ఆయా కాలాలో సంఘ సముద్ధరణకు ఏర్పడినవి. కాని మతాలయందు పరిపూర్ణ సత్యము తెలియబడకపోగా, వాటియందు దురాచారాలు పెరిగి పోవుట వల్ల, వేమన కాలము నాటికి పైన వివరించిన మతాలన్నియు దుస్థితికి చేరుకున్నాయి. ఆనాటి మతాల శిథిల సంధ్య యందు వేమన యోగి యను భానుడు ఉదయించినాడు. ఈతడు గురుశిష్య సాంప్రదాయంగా వచ్చుచున్న అచల తత్వమును ఉద్ధరించి లోకమునకు అందించినాడు.

అయితే అన్ని మతాలు కూడా వేమన వివరించిన ఎరుకలోనివే నని ఈ ప్రస్తావనలో తెలియబడగలదు. క్రీ.శ. 15వ శతాబ్దములో వేమన యోగి అచల తత్వము ( అచల పరిపూర్ణ

రాజయోగము)ను పద్యాల రూపములో ప్రచారము చేసియున్నారు. అదే యోగమునకు క్రీ.శ. **18** వ శతాబ్దములో శ్రీ శివరామదీక్షితులవారు నిర్దుష్టమైన స్వరూపమును నిర్ణయించుచు 'బృహద్వాశిష్ఠము' అను గ్రంథమును వ్రాసి ప్రచారమునకు తీసుక వచ్చిరి. అట్టి అచల తత్త్వము ఇచట ప్రస్తావించబడుచున్నది. ఈ అచల తత్త్వము వేదాలు ఎంత పురాతనమో అంత పురాతనమే. ఈ తత్త్వము యొక్క మూలబీజాలు వేదోపనిషత్తులయందు వున్నాయి.

వేమన యోగికి పూర్వం ఈ సిద్ధాంతం సంస్కృత భాషలోనే ఉండింది. బౌద్ధులు పాళీభాషలోను, వీరశైవులు తెలుగు కన్నడాలలోను, శ్రీరామానుజులు ద్రావిడంలోను, వారి వారి మత సిద్ధాంతాలను వ్రాసిపెట్టినట్లె, వేమన యోగి, శివరామదీక్షితులవారు కూడా సంస్కృత భాషలో నిగూఢంగా నిక్షిప్తమైన ఉండి సామాన్యులకు అందుబాటులో లేకుండా పోయిన ఈ పరమ సత్య సిద్ధాంతం, తెలుగువారందరికీ తెలియాలనే విశాల హృదయంతో తేట తెలుగులో ప్రచారం చేశారు. కాని, వేమన యోగి ఆశువుగా చెప్పిన పద్యాలలో అచల పరిపూర్ణ భావమే గాక, నీతి, భక్తి, యోగ, వైరాగ్యాలు మొదలైన విషయాలెన్నో కలగాపులగంగా వుండుట వల్ల అచల పరిపూర్ణ భావమంతగా తెలుగు ప్రజల దృష్టిని ఆకర్షించలేదు. శ్రీ శివరామదీక్షితులు అట్లాగాక, కేవలం అచల పరిపూర్ణ యోగ భావాన్ని మాత్రమే సిద్ధాంతం చేసి, 'బృహద్వాశిష్ఠము' అను గ్రంథాన్ని అచ్చ తెలుగులో వ్రాసి, క్రీ.శ. **18**వ శతాబ్దంలో ఆంధ్రలోకంలో ప్రచారం చేశారు. అందువల్ల దీక్షితులవారికి బృహద్వాశిష్ఠ సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యులని పేరు కూడా వచ్చింది.

'వేదోఖిలోధర్మమూలం' అనీ, 'సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి' అనీ చెప్పబడుతోంది. ఎందువల్లనంటే వేదం ఒక్క వ్యక్తి మాత్రమే రచించింది కాకపోవడమే. అనేక ఋషుల అనుభవాల ఫలితాలను లేక విమర్శనా ఫలితాలను వెల్లడించడంలో వేదాలలో వివిధత్వం కానవస్తూ వుంది. కనుకనే శూన్యవాదం మొదలైన అన్ని వాదాలకు సంబంధించిన మూలసూత్రాలు వేదాలలో కనిపిస్తున్నాయి. వేదాలలో మనోవాక్కులకు అందు భావాలు సూటిగానే చెప్పబడ్డాయి. కాని మనోవాగగోచరమైన 'కేవల పరిపూర్ణ బ్రహ్మము' సూటిగా చెప్పబడలేదు. కాని లక్ష్యార్థంగా చెప్పిన అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు కూడా లక్ష్యార్థంగా మాత్రమే ఈ అచల పరిపూర్ణ భావం చెప్పబడింది. అచల ఋషులు జనన మరణ రహిత విధానం ఈ సిద్ధాంతంలోనే ఉందని తెలిసికొని, దీనిని పరమ గోప్యంగా ఉంచి తమను ఆశ్రయించిన లక్షణ యుతులకు మాత్రమే ప్రబోధిస్తూ లోకంలో సుప్రతిష్ఠితం చేశారు.

ఈ సిద్ధాంత పీఠాధికారుల్లో ఒకరైన శ్రీ భాగవత కృష్ణదేశికులు పరిపూర్ణమును, లేనెరుకను, ఎరిగి, ఎరుకను మానుము అని క్లుప్తంగా వారి కందార్థ పద్యములలో తెలియజేశారు. ఇదే భావం:

శ్లో॥ అశరీరం సర్వదాఽస్తి, శరీరం రహితం సదా
అయమేవ సద్యో ముక్తి రన్యథా భ్రమ కారణం ॥

అనే శ్లోకం వల్ల వ్యక్తమవుతుంది. దీనిలో తాత్విక నిర్ణయంతోపాటు కర్తవ్యం కూడా ఉపదేశించబడింది. అచల పరిపూర్ణ బ్రహ్మము, లేనెరుకను ఈ రెండింటిని గురువు సమక్షంలో విచారించి తెలుసుకోవడం తాత్విక పరిశోధనకు సంబంధించినది. తరువాత ఆ రెండింటినీ ఏ ఎరుకచేత గ్రహించితివో, ఆ ఎరుకను వదిలి వేయుమని కర్తవ్యం ఉపదేశం చేయబడింది. కనుక ఈ సిద్ధాంతంలో ముఖ్యంగా మూడు వాక్యాలున్నాయి. ఇవే సిద్ధాంత వాక్యాలు. 1) అచల పరిపూర్ణ పరబ్రహ్మము 2) లేని ఎరుక (సగుణ నిర్గుణ రూపమైన అధిష్ఠాన చేతన బ్రహ్మము) 3) ఎరుకను విడిచే విధానం. వీటి వివరణ ఈ క్రింద ఇవ్వబడినది.

**1) అచల పరిపూర్ణ బ్రహ్మము:** దీనినే అచలమనీ, పరిపూర్ణమనీ, బయలనీ, బట్టబయలనీ, ఉత్త బయలనీ, పరమ పదమనీ, గురుగుహ్యామనీ, అనంతమనీ, స్థిరమనీ, నిరపేక్షకేవల బ్రహ్మమనీ, పరిపూర్ణ బ్రహ్మమనీ మొదలైన పేర్లతో వ్యవహారం కోసం పిలుస్తున్నారు.

నామరూపాలు మిథ్య అనీ, కల్పితాలనీ కేవల బ్రహ్మమొక్కటే సత్యమనీ సర్వ శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. కనుక ఏ నామమూ ఈ కేవల బ్రహ్మమునకు పనికిరాదు. అయినా వ్యవహారార్థము కేవల బ్రహ్మమును, పైన తెలిపిన పేర్లతో ఈ సాంప్రదాయం వారు సూచిస్తున్నారు.

వేమనయోగి యొక్క సిద్ధాంతాన్ని ఉద్ధరించిన శ్రీ శివరామదీక్షితులవారి మాటలలో అచల పరిపూర్ణబ్రహ్మము అంటే పుట్టనిదీ, చావనిదీ, రాకడ – పోకడ లేనిదీ, సకల దేశాలలో, సర్వ కాలాలలో, సమస్త వస్తువులలో, మొదలు కొనలేక, చలించక, ఒక్క తీరుగా (మార్పులు చెందక), తనకు తానే స్వతస్సిద్ధమై ఉన్నది.

'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అంటే వాక్కు, మనస్సులు దేనిని తెలియలేక వెనుకకు మరలినవో ఆ పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి ఇంతకంటే సమగ్రంగా చెప్పడం కష్టం. ఈ వాక్యం కూడా శిష్య ప్రబోధార్థం చెప్పిందే. ఇది ఒక నిర్వచనం మాత్రం కాదు. ఎందుకంటే ఇందలి శబ్దాలు సాపేక్షిక శబ్దాలు మాత్రమే. అచల పరిపూర్ణ బ్రహ్మము కేవలం నిరపేక్షకమైనది. అట్టి దానిని సాపేక్షక శబ్దాలతో వర్ణించడం తప్పు. అయినా, చెప్పటం అవసరమై ఏదో రీతిగా చెప్పారు. ఎట్లా చెప్పారంటే 'నేతి నేతి నేతీతి హోవాచ' అంటే ఇది కాదు. ఇది కాదు అంటూ, కాని దానిని వివరించి చూపి, ఇతి అని చెప్పడానికి వీలులేదనీ, ఇతి అనే ఏ వస్తువునూ తనలో ఉండదనీ, అచల పరిపూర్ణ బ్రహ్మము యొక్క ఉనికిని తెలియజేశారు.

అచల పరిపూర్ణ పరబ్రహ్మము పలుకున పలుకగ రానిది. తలపులకు అందనిది. సర్వ నిరపేక్షమైనది అంటే సర్వ లక్షణ విలక్షణత్వమే దాని లక్షణమనవచ్చు. అది భావ పదార్థమా అంటే భావించే వస్తువు యొక్క రహితమందే అది స్వతస్సిద్ధం. అభావ పదార్థమా అంటే భావ పదార్థమొకటుండి దాని లేని స్థితిని చెప్పదలచినపుడు దాని అభావమును నిర్ణయిస్తారు. భావాభావములు ఒకదానిపై ఒకటి ఆధారపడిన శబ్దాలు. కనుక ఆ రెంటి రహితంలోనే పరిపూర్ణ బ్రహ్మము నిశ్చయం. అయితే అది శూన్యమా? అంటే శూన్యమని గుర్తించడానికి గుర్తించేవాడు, వాని గుర్తూ కూడా లేని స్థితి అది. కనుక అది శూన్యమూ కాదు. ఏమని అందామని అన్నా, అనే వ్యక్తి, అతని వాక్కు రెండూ లేని స్థితి అది. కనుకనే అది ఏమనీ అనరానిదని పూరుకొన్నారు. చివరకు 'అస్తీత్యే వోప లబ్ధవ్యః' అని దానిని అస్తి పదార్థమని అందామా? అంటే అస్తి అనే పదం నాస్తి అనే పదాన్ని అపేక్షిస్తుంది. కనుక అది అస్తినాస్తులు కానిది. అయినా, 'అస్తీతిబ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే' అంటే అస్తి అని చెప్పడంకంటే, అంటే అది వున్నదని చెప్పడంకంటే, మరొక విధంగా దానిని ఎట్లా తెలియపరచాలి? కనుక సాపేక్షిక పదమైనా, మరొక విధానం లేక అస్తి అని దానిని వాడారు.

పరిపూర్ణ బ్రహ్మము సదసత్తులు, విద్యావిద్యలు, అవ్యుత వ్యుత్యువులు, ప్రకాశాప్రకాశములు, జ్ఞానాజ్ఞానాలు, దృక్దృశ్యాలు, చిజ్జడాలు మొదలైన సర్వ ద్వంద్వాలు కానిది. అట్లాగే జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయాలు అనే అంతర త్రిపుటి, ద్రష్టా దృక్దృశ్యములనే మధ్యమ త్రిపుటి, కర్త కర్మ క్రియలనే బాహ్య త్రిపుటి ఏమీ లేనిది పరిపూర్ణ బ్రహ్మము. దీనినే గీతాచార్యుడు 'న సత్తన్నా సదుచ్యతే' అని బోధించాడు.

అదే విధంగా పరిపూర్ణ బ్రహ్మము సచ్చిదానంద వస్తువు కాదు. ఇది స్థూలమూ కాదు. సూక్ష్మమూ కాదు. ప్రజ్ఞాన ఘనమూ కాదు, చిన్మాత్రమూ కాదు. చిజ్జడాలలో ఏదీ కాదు. ఆ రెండింటి ఏక రూపమూ కాదు. దీనిలో తెలివి, జ్ఞానం, గుర్తు లేనేలేవు. ఇది తప్ప మరొకటి లేదు (బ్రహ్మణోన్యం నకించిన). పరిపూర్ణంలో తెలివిగాని, దాని పరిణామ రూపమైన మరుపుగాని లేదు.

**2)** లేని ఎరుక (సగుణ నిర్గుణ రూపమైన అధిష్ఠాన చేతన బ్రహ్మము) అంటే పరిపూర్ణ బ్రహ్మము తప్ప మిగిలినదంతా లేని ఎరుకగా నిర్ణయించబడింది. పరిపూర్ణ బ్రహ్మము దృష్ట్యా అసలు ఉనికి అనేది దేనికి కూడా ఉండటానికి వీలు లేదు. అందువల్ల ఎరుకను 'లేని ఎరుక ' అని వాడటం సాంప్రదాయం.

కార్యరూపమైన జీవేశ్వర జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకు అత్యంత మూలకారణం అయినదే ఎరుక. సృష్టిలో ఉన్న సకల పదార్థాలకు ఈ ఎరుకే ఆధారమూ, అధిష్ఠానమూ అయి వున్నది. ప్రళయంలో ఈ జీవేశ్వర జగత్తు బీజరూపం దాల్చి ఈ ఎరుకలో గర్భీకృతమై ఉండి పునస్సృష్టిలో తిరిగి ఆవిర్భావం చెందుతుంది. కనుక ప్రళయమంటే తిరోభావం మాత్రమే.

సృష్టికి పూర్వం సత్ పదార్థమే ఉందని కొందరు, అసత్ పదార్థమే ఉందని మరికొందరు, శ్రుతి యుక్తంగానే వాదిస్తున్నారు. వీని అన్నిటి సమాహారంలో తేలే సత్యమేమంటే – సృష్టికి పూర్వమున్న ఎరుక సత్తుగానూ వుంది. అసత్తుగానూ వుంది. సదసత్తుగానూ వుంది. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అణువుకంటే చిన్నదిగానూ, మహత్తు కంటే పెద్దదిగానూ ఇదే వుంది. విశ్వగతంగానూ విశ్వాతీతంగానూ ఇదే వున్నది.

పురుషప్రకృతులుగా, పంచతన్మాత్రలుగా, పంచభూతాలుగా, జీవేశ్వరులుగా, సగుణ నిర్గుణాలుగా, క్షరాక్షరాలుగా, సర్వజగద్రూపంగా, అన్నింటికి సాక్షిగా, నియామకుడుగా, కర్తగా, భోక్తగా, లోకాలుగా, లోకేశ్వరులుగా, తేజోంధకారాలుగా, ఏకవస్తువుగా, అనేక వస్తువులుగా సర్వస్వరూపంగా ఉన్నదే ఎరుక. ఇదే సంవిత్, ఇదే ప్రత్యగ్బ్రమాత్మలు. ఇదే అహం పదార్థం. ఇదే తత్, త్వం పదార్థాలు. ఇదే అసి పదార్థం. అన్నీ ఇదే. ఇదే లేకుంటే పరిపూర్ణ బ్రహ్మము తప్ప ఇంకేమీ లేదు. సర్వ నామ, రూప, క్రియ, నటనలు ఎరుకనే. ఎరుకే ఖండాఖండాలుగా,

పిండ బ్రహ్మాండాలుగా వుండి, వానిలో అహం రూపంగా వున్నదీ ఇదే. సర్వ ద్విపుటులు, సర్వ త్రిపుటులు ఇదే. సర్వశక్తులు కలదీ ఇదే.

ఎరుకకే సంకోచ వ్యాకోచాలున్నాయి. ఎరుకే కార్యకారణాలు, భావాభావాలు. చేతనమూ, భౌతికమూ రెండూ ఇదే. భౌతిక పదార్థంలో చేతనమూ, చేతనంలో భౌతిక పదార్థం ఓతప్రోతాలయ్యే ఉన్నవి. ఈ రెండూ కలిసే వస్తున్నాయి. కలిసే వుంటున్నాయి. వీటిలో ఒకటిని విడిచి ఇంకొకటి ఉండదు. ఇందులో ఒకటిపోతే, రెండోది కూడా దానితోనే పోతుంది. ఇదే వస్తు లక్షణం. ప్రపంచంలో ఉన్న వస్తువులన్నీ ఇట్టివే. ఇందులో చేతనం మిథ్య లేక పదార్థం మిథ్య అని అనరాదు. ఈ రెండూ ఎరుకే కాని ఇందులో ఏదీ పరిపూర్ణ బ్రహ్మము కాదు.

కార్యకారణ రూపంగా, నిర్గుణ సగుణ రూపంగా వున్న పదార్థం పరిపూర్ణ బ్రహ్మము కాదు. కనుక అద్వైత సిద్ధాంతంలో చెప్పబడిన బ్రహ్మము పరిపూర్ణ భావజ్ఞులు చెప్పే లేని ఎరుక యొక్క నిజ స్వరూపమై ఉంది. అయితే రెండు బ్రహ్మములు వున్నవా? వున్నవి 1) పరిపూర్ణ బ్రహ్మము 2) సగుణ నిర్గుణ రూపమైన అధిష్ఠాన చేతన బ్రహ్మము. దీనినే ఈ సాంప్రదాయంలో ఎరుక అన్నారు. కనుక వివిధ మతాలవారు, సిద్ధాంతాల వారు నిర్గుణ బ్రహ్మమునో లేక సగుణ బ్రహ్మమునో గూర్చి నిర్ణయించారు. కనుక వారందరూ ఎరుకలోనివారే. మరి పరిపూర్ణ బ్రహ్మము సగుణ నిర్గుణాతీతం.

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధం।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమం॥

అని గీతలో శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన విధంగా పై శ్లోకంలోని అయిదూ ఎరుకే.

అన్నిటికీ ఎరుకే మూలంగా వుంది. కాని దానికి మాత్రం మూలం లేదు. సృష్టికి కారణ వస్తువుగా ఏ బ్రహ్మమును ఇతరులు ప్రతిపాదించారో అదే ఎరుక.

ఏ వస్తువును తీసుకున్నా దాని కారణ పరంపరను విచారిస్తూ పోతే, చివరకు అత్యంత మూలకారణ వస్తువు ఎరుకేనని తేటతెల్లమవుతుంది. ఉదాహరణకు ఇక ఇనుపడబ్బా తీసుకుంటే

డబ్బాకు మూలం ఇనుము, ఇనుముకు మూలం పృథ్వీ, పృథ్వీకి మూలం జలం, జలానికి మూలం వాయువు, వాయువుకు మూలం ఆకాశం, ఆకాశానికి మూలం ఆత్మ ( ఎరుక), ఈ విధంగా కారణ పరంపర తెలియబడుతుంది. ఆత్మ నుంచి ఇవి వరుసగా పుట్టాయంటే, ఆత్మకు కూడా పుట్టుక తప్పకుండా ఉండాలి. ఎందుచేతనంటే, పుట్టని దాని నుంచి ఇతరం పుట్టజాలదు. కాబట్టి ఆత్మ అనే ఎరుక దేని నుంచి పుట్టుచున్నది. ఉన్నవి రెండే 1) పరిపూర్ణము 2)లేని ఎరుక. ఇందులో పుట్టని పరిపూర్ణము నుంచి ఏది పుట్టదు. ఆ పరిపూర్ణములో ఏ విధమైన కారణ బీజాలు లేవు. పుట్టించే సత్తా కలదీ. పుట్టేది కూడా ఎరుకే. కనుక ఎరుకకు ఎరుకే కారణం. అందువల్లనే స్వతః కారణమనీ, లేక స్వకారణమనీ, స్వయం ప్రకాశమనీ, స్వయం భూ అనీ ఈ లేనెరుకనే వర్ణించబడింది.

'విత్తే చెట్టుకు మూలం, చెట్టుకు మూలం విత్తు' అనీ, 'మేనెరుకల రెండింటిలో దానిని ఇది, దీనినది తగ సృజియించున్'అనీ శ్రీ భాగవత కృష్ణదేశికులు తమ కందార్థాలలో తెలిపి ఉన్నారు.

కాబట్టి విత్తనంలో చెట్టు, చెట్టులో విత్తనం కలగడం స్వకారణం. అట్లాగే మేను (శరీరం) స్థూలమైన స్వరూపం. నేను (ఆత్మ) సూక్ష్మమైన ఎరుక రూపం. నేను మేనుల ఏకైక రూపమైన ఎరుకకు వేరే మూలం ఏమీ లేదు. పరిపూర్ణ పరబ్రహ్మములో దీనికి స్థానమూ లేదు. కాబట్టి దీనిని లేనెరుక అన్నారు. ఈ లేనెరుకయే మాయ అని సిద్ధాంతం. ఈ లేనెరుక తనకు తానే తోచినది మాత్రమే.

**3)** ఇక ఎరుకను విడవడం ఎట్లా? ఎరుక యొక్క స్థాన స్వరూప స్వభావాలను గురుముఖతః గుర్తెరిగి తాను ఎరుక స్వరూపుడై నిలిచి, తనకన్యంగా వున్న పరిపూర్ణ పరబ్రహ్మములో తనకు మూలంగాని, స్థానంగాని లేనేలేదని ఆరూఢ స్థితిని చెందినవాడే ఎరుకను విడిచిన వాడు. ఆతడే సర్వభ్రాంతి రహితుడు. ఆతనికే జన్మరాహిత్యం కలుగగలదు.

ఆ॥ ఎరుక బ్రహ్మమనియె యిల శంకరార్యులు
తెలివి బ్రహ్మమనుచు తెలిపె వ్యాసు
లెరుక తెలివి రెంటి నెరుగడు వేమన
విశ్వదాభిరామ వినుర వేమ॥

అని ఎరుక, తెలివిలను రెంటిని వేమన యోగి విడిచిన విధానం తెలుపడం జరిగింది.

ప్రపంచంలో ఉన్న వివిధ మత సాంప్రదాయాల గమ్యం ఎరుక యొక్క సగుణరూపమో లేక నిర్గుణ రూపమో అయి ఉంది. కాబట్టి మేఘ మండలం నుండి పడిన వర్ష జలమంతా సముద్రాన్నే చేరునట్లుగా, అన్ని మతాలు చివరికి ఒకే గమ్యస్థానం చేరగలవు అనడంలో సంశయమేమీ లేదు. అయితే మేఘమండలం నుండి పడిన వర్షజలం చివరకు సముద్రాన్నే చేరినా, మరల ఎండకు ఆవిరియై మేఘ మండలంలో చేరి మరల వర్షాకాలంలో భూమిపైననే పడుచున్నది. అందువల్ల మతాలన్నీ తిరిగివచ్చే పద్ధతినే సూచిస్తున్నాయి.

అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతం మాత్రమే తిరిగి తీసుకొని రాని మార్గం. అధో ఊర్ధ్వ పరిణామం చెందే వస్తువునే ఇతరులు బ్రహ్మమన్నారు. పరిపూర్ణ భావజ్ఞులు దానినే ఎరుకన్నారు. కనుక సకల మతవాదాలు ఎరుకలోనివే. పరిపూర్ణ పరబ్రహ్మమును ఏవిధంగాను వర్ణించరాదు. కనుక ఇది మత సిద్ధాంతాలకు అందేది కాదు. మతాలన్నీ ఎరుక నిర్ణయంలోనే ఇమిడిపోతాయి. ఏ పదార్థమైతే స్థూల సూక్ష్మములుగా మారుచు జీవ- జగత్తు- బ్రహ్మములుగా కనబడుచున్నదో మరియు దేనినైతే బ్రహ్మమని మతవాదులు పిలుచుచున్నారో అదియే ఎరుకయని అచల సిద్ధాంతవము. ఈ ఎరుకయందు స్వజాతీయ భేదవములేదు. ఎందుకనగా జీవ- జగత్తు- బ్రహ్మములుగా నున్న సర్వమూ ఎరుకయే గనుక, కాని ఎరుకయందు స్వగత భేదమున్నది. ఎందుకనగా ఇది నానానత్వము చెందుచున్నది. పరిపూర్ణబ్రహ్మమునకు, ఎరుకకు అత్యంత విభిన్నత్వమున్నది. అది ఇది కాదు. ఇది అది కాదు. కనుక ఇచట విజాతీయ భేదము కనిపించుచ్నుది.

జగత్తు మిథ్యకాదు. జగత్తు బ్రహ్మమయమే. కనుక ఇది అద్వైతము కాదు. ఎరుకయందు స్వగత భేదమున్నది గనుక అచలతత్వము స్వగత భేదమునంగీకరించిన విశిష్టాద్వైతము కాదు. ఎందుకనగా విశిష్టాద్వైతాతీతమైన పరిపూర్ణ బ్రహ్మమును ఈ అచలతత్వము బోధించును. మరియు పరిపూర్ణ బ్రహ్మముకన్న అన్యమేదియూ లేదు. కనుక ఇది ద్వైతమూ కాదు. కనుక ఈ అచలతత్వము సర్వమతాభిప్రాయములకు విభిన్నముగా వున్నది. కాని అన్ని మతాలయొక్క సారము అచల సిద్ధాంతులయొక్క 'ఎరుక' యందే ఇమిడిపోవును. ఎట్లులనగా? జీవ- ఈశ్వర- జగత్తు- బ్రహ్మము అనేవి ఒకే పదార్థము. అదే ఎరుక. అందువల్ల ఇది అద్వైతము.

ఎరుకయొక్క స్థూలరూపమే జగత్తు. ఈ స్థూలరూప ఆవరణము సూక్ష్మరూప ఎరుకకు శరీరముగా వున్నది. కనుక ఇది దేహి-దేహ సంబంధమును గుర్తించిన విశిష్టాద్వైతమగును. ఇక సంసారబంధములో మిశ్రమ ఎరుక రూపముగా నున్న జీవుని కన్న, పరా ఎరుక రూపముగా బ్రహ్మము అన్యముగా కనిపించుచున్నది. కనుక ఇది ద్వైతమగును. ఇలా సర్వమతసారములు ఎరుకయందే ఇమిడి పోవును. అందుకే దీనిని పరిపూర్ణ భావమని చెప్పినారు. కనుక ఈ భావాన్ని మతమనడమే కూడదు. కాబట్టి ఏ మార్గానికైనా గమ్యం ఒక్కటే అనరాదు. పరిపూర్ణ పరబ్రహ్మము సర్వలక్షణ విలక్షణం. అందుకు మార్గం కూడా విలక్షణమే, ఆశయం కూడా విలక్షణమే.

ఈ 'అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము'ను వేమన యోగి ఏ విధంగా తన పద్యాలలో వివరించియున్నాడో వ్యాఖ్యాత డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధర స్వామి సమర్థవంతంగా ఈ గ్రంథమునందు ప్రకటపరచియున్నాడు. కనుక వేమనయోగి యొక్క నిజమైన తత్వమును తెలియగోరు ప్రతి ఒక్కరు చదువవలసిన ఉత్తమ గ్రంథమిదని నా అభిప్రాయము.

ఇట్లు
ఉపకార్యదర్శి
**శ్రీ బోధానంద రామచంద్ర రాజయోగి**

శ్రీ శివరామదీక్షిత
అచల గురూపపీఠ రాజయోగాశ్రమం,
బచ్చన్నపేట, జిల్లా॥ వరంగల్.
ఫోన్: **08710-54262**
క్రీ.శ. **26-09-2000.**

# పీఠిక

వేమన పద్యాలు తెలుగు సాహిత్యవనంలో విరబూసిన రత్నాలహారాలు. వేమనయోగి పండిత లోకానికే పరిమితమైన 'వేదాంతము'ను అతి సామాన్య మానవునికి కూడా అందుబాటులో వుండేటట్లు స్వచ్ఛమైన అచ్ఛమైన తేనెలాంటి తేట తెలుగు పద్యాలలో వివరించిన మహానుభావుడు. వేమన తన భావాలను సూటిగాను, స్పష్టముగానూ తన పద్యాల ద్వారా మృదు మధురమైన భాషలో విప్పి చెప్పినాడు. ఈ స్పష్టత ప్రాపంచిక విషయాలందు మరీ ఎక్కువ. కాని వేదాంత విషయం జటిలమైనది. కనుకనే ఈ జటిలత్వము వేమనయోగి చెప్పిన వేదాంత విషయ సంబంధమైన కందాది పద్యాలలో కూడా కనిపించుచున్నది. కొన్ని పద్యాలు ప్రపంచ విషయాలకు సంబంధించినట్టు కనిపించుచున్నప్పటికినీ, అవి వేదాంత విషయాలను ప్రకటపరచుచున్నట్టు సూక్ష్మదృష్టి కలవారికి తెలియబడును. ప్రతి పద్యానికి ఆనాటి చారిత్రక, నైసర్గిక, సాంఘిక, నైతిక, ఆర్థిక, రాజకీయ, మత వ్యవస్థలతో సంబంధం ముడిపడివుంది. అందువల్లనే ఒకే పద్యం అనేక కోణాలలో అనేక అర్థాలను ఇవ్వగలుగుతుంది. ఇందులకు ఈ క్రింది వేమన పద్యమే నిదర్శనము.

ఆ॥ వేయు విధము లమర వేమన పద్యంబు
లర్థ మిచ్చు వాని నరసి చూడ
చూడ జూడ గలుగు చోద్యమౌ జ్ఞానంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥

వేమన మొదట అన్ని రకాల సాధనలు, యోగాలు చేసి నిజం తెలియలేక చివరకు 'అంభికా శివయోగి' అను గురువును చేరుకొని సేవించి, ఆతని నుండి 'అచల పరిపూర్ణ రాజయోగము'ను సంపూర్ణముగా గ్రహించినాడు. గురువాజ్ఞ ప్రకారం తాను తెలిసికొన్న యోగాన్ని ప్రజలందరకు తెలియజేయుటకు వేమన ఉద్యుక్తుడయ్యాడు. అందుకు సాధనంగా వేమన పద్యాన్ని ఎన్నుకున్నాడు. కనుక వేమన మొదట వేదాంతి. తదుపరి కవి. కనుక ఎవరైతే వేమన యొక్క సంపూర్ణ వేదాంత వైఖరిని తెలిసికోగలరో, వారే వేమనయోగి పద్యాలకు సరియైన వ్యాఖ్యానాన్ని అందించగలరు. ప్రతి పద్యానికి శబ్ద, శబ్దార్థ, లక్ష్య, లక్ష్యార్థాలు వుంటాయి. సంపూర్ణమైన విషయాన్ని తెలుసుకోగోరువాడు మొదట శబ్దమును విని, తర్వాత దాని అర్థమును గ్రహించి, ఆ తర్వాత

లక్ష్యమును తెలిసికొని, అటు తర్వాత లక్ష్యార్థమును సాధించవలెను. ఈ గమనమును సులభతరము చేయుటకు వేమన ప్రతీ పద్యంలో ఏదో ఒక ఉపమానాన్ని చాలా అందముగా ఉపయోగించాడు. ఆ ఉపమానాలన్నియు జన జీవన స్రవంతిలో నుండి పుట్టినవే. అవి సామాన్య మానవులకు అతి చేరువలో యుండుట వల్ల ఇంకనూ వారి నాలుకల్లో నాట్యమాడుచూనే వున్నాయి.

ఇప్పటి వరకు వేమన యోగి పద్యాలకు సి.పి. బ్రౌన్ మొదలుకొని అనేక మంది వ్యాఖ్యానాలు వ్రాసారు. సి.పి.బ్రౌన్‌కు వేమన యొక్క సంపూర్ణ వేదాంత స్వరూపము తెలియబడనప్పటికినీ, ఎంతో శ్రమపడి తన సహచర పండితుల సమక్షంలో తర్జనభర్జనలు జరిపి, మూలం మీద గౌరవం వుంచి, విపరీతార్థాలకు పోకుండా వేమన పద్యాలకు లఘు వ్యాఖ్యలు ఆంగ్లంలో వ్రాసాడు. మిగతావారు ఎక్కువ వరకు వేమన చెప్పిన నీతి పద్యాలనే ఏరుకొని, వాటికి చిలుక పలుకులు పలికినట్లు వ్యాఖ్యానాలు వ్రాసినారు. కాని వేమన కేవలం నీతి సూత్రాలను తన పద్యాలయందు వల్లించిన నీతిబోధకుడే కాడు. ఆతడు మొదట 'తత్వవేత్త' అని మరువరాదు. వేమన చెప్పిన కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్వ, ముముక్షత్వ, యోగముల గూర్చి మనవారు అసలే పట్టించుకొనలేదు. ఈ విషయంలో బ్రౌనే కొంతవరకు నయం. ఈతనికి నిజాయితీ ఎక్కువ. అందువల్లే తనకు అర్థంగాని కొన్ని పద్యపాదాలను వేమునకే వదలి పెట్టినాడు. ఇక దేశీయులు నీతి ఒక్కటే ముఖ్యంకాదని తెలిసికోవాల్సివుంది. అంటే నీతి అవసరం లేదని కాదు. నీతి అనగా నడక. ఏమీ తెలిసికోకుండా తాను సంఘంలో చాలా మంచిగా నడచుకొనుచున్నాననుకోవడం భ్రమ మాత్రమే. అందువల్ల మానవుడు ప్రాపంచిక ఫలాలను మాత్రమే పొందగలడు. కాని పారమార్థికమైన పురోగతిని సాధించలేడు. కాని వేమన లక్ష్యం ప్రాపంచిక పారమార్థికములందు అభివృద్ధిని సాధించుట. అందులకు మొదట గురువుచే తత్వవిచారణ చేసి పారమార్థికంగా అభివృద్ధిని సాధించవలెను. ఇది జ్ఞాన సంబంధమైనది. తదుపరి తాను తన గురువుచే గ్రహించిన జ్ఞానాన్ని ప్రాపంచిక విషయాలయందు ప్రవేశపెట్టి ఆచరణ (కర్మ)లో చూపవలెను. ఇది వాక్కునకు మరియు శరీరమునకు సంబంధించినది. ఈ రెండు విధములందు ఏకత్వమును చూపుటే 'భక్తి' లేక 'యోగము'. ఇందులో మొదటిది తత్వజ్ఞానమునకు, రెండవది నీతికి సంబంధించినది. కనుక తత్వజ్ఞానము లేని నీతి గ్రుడ్డిది. నీతిలేని తత్వజ్ఞానము కుంటిది. అందువలన ఇహపరసాధనమునకు ఈ రెండూ అత్యవసరమే. కనుక వేమన యోగి బోధించిన 'వేదాంత' తత్వజ్ఞానమును లోకమునకు ప్రకటపరచుటే ఈ నా వ్యాఖ్యానము యొక్క ప్రధానాశయము.

## వేమన కాలం:

వేమన జీవించియుండిన కాలానికి బలమైన చారిత్రక ఆధారాలేమీ లేవు. వేమన కాలన్నిర్ణయానికి వేమన పద్యాలపై ఆధారపడటం తప్ప వేరే మార్గం లేదు. ఈ క్రింది వేమన పద్యము వేమనయోగి జనన కాలాన్ని సూచిస్తుంది.

కం॥ నందన సంవత్సరమా
నందిత కార్తీక శుద్ధ పున్నమ నాడే
వింధ్యాద్రి సేతుబంధన
సందున నొక వీరుడేలు చాటర వేమా॥

పై పద్యంలో వేమన జన్మించిన తేదీ అస్పష్టముగా తెలియబడుచున్నది. ఎందుకనగా ఈ పద్యంలో తిథిని సూచించడానికి కావలసిన సాధనాలు అన్నీ వున్ననూ, వారం మాత్రం తెలియబడుటలేదు. చివరి రెండు పాదాల్లో ఏమైనా గుప్తంగా వుందో ఏమో? కనుగొనాల్సి వుంది. నందన సంవత్సరం 60 సంవత్సరాలకు ఒక సారి వస్తుంది. కనుక వారం లేకుండా, ఏ నందన సంవత్సరమో తెలుసుకోవడం కష్టం.

అయినను వేరొక విధంగా వేమన కాలాన్ని గుర్తించుటకు అవకాశం కలదు. వేమన ఆంధ్రదేశం అంతటా తిరిగి తన శిష్యులకు అచల బోధ చేసినట్లు కనపడుచున్నది. కనుక వారి శిష్యుల సాంప్రదాయం నందు ఏమైనా ఆధారం దొరకవచ్చును. పరిశోధించి చూడగా వేమన 'అచల సిద్ధాంతం'ను వ్యాప్తి చేసినట్లు తెలియబడింది. వేమన తర్వాత సుమారు 150 సం॥ ఈ అచల సిద్ధాంతం ఎక్కువగా వ్యాప్తిలో లేదు. ఆ తర్వాత క్రీ.శ. 1690 సం॥న నల్లగొండ జిల్లాలోని నారాయణపురం అను గ్రామమునందు పుట్టిన శ్రీశివరామదీక్షితులు వేమన సాంప్రదాయంనకు చెందినవాడే. కాని అప్పటికే వేమన గతించి దాదాపు 150 సం॥ లు కావడం వల్ల వేమన శిష్యప్రశిష్యులచే గురుపరంపరగా వచ్చిన ఈ సిద్ధాంతమును వీరు శ్రీధరస్వామి ద్వారా పంఢరీపురం (మహారాష్ట్ర) నందు ఆమూలాగ్రముగ గ్రహించెను. అదివరకే శ్రీ శివరామదీక్షితుల వారు శతాధిక జ్ఞానయజ్ఞములను కాశీ మొదలుకొని అనేక ప్రాంతాలయందు నిర్వహించి గొప్ప కీర్తి ప్రతిష్ఠలు పొందియుండుట వల్ల నూతనంగా గ్రహించిన ఈ అచల

సిద్ధాంతంను వ్యాప్తి చేయుటలో సఫలీకృతుడయ్యేను. క్రీ.శ 1712 నాటికి శ్రీ రాముడుగు శివరామదీక్షితుల వారు ఈ అచల సిద్ధాంతనకు నిర్దుష్టమైన స్వరూపమును న్ర్ణయించుచు 6 సిద్ధాంత గ్రంథాలను వ్రాసిపెట్టెను. ఈ గ్రంథాలలో వేమన ఉపయోగించిన బయలు, ఎరుక, పరిపూర్ణబ్రహ్మము, బట్టబయలు మొదలగు పదాలు కనిపించుచున్నవి. ఆనాటికి వేమన పద్యాల సంకలనాలు వెలువడలేదు. వేమన శిష్యులు వేమన పద్యాలను తమ వద్దే వ్రాసిపెట్టుకొని యుండుటవల్లనూ మరియు అవి వారసత్వ సంపదగా మారిపోవుటవల్లనూ శ్రీ శివరామదీక్షితులవారు వాటిని తమ గ్రంథాలలో వుటంకించుటకు దొరకకపోయి వుండవచ్చును. ఏమైననూ ఆ కాలంలో నీతి సంబంధమైన పద్యాలే ఎక్కువగా ప్రజల నాలుకల్లో ఆడుచుండవచ్చును. కాని జటిలమైన వేదాంత విషయాలను చెప్పే పద్యాలు తాళ ప్రతుల్లోనే దాగియుండెననవచ్చును. శ్రీ శివరామదీక్షితుల వారు సుమారు క్రీ.శ. 1690 నుండి క్రీ.శ. 1791 సంవత్సరాల మధ్య జీవించియున్నారు. శ్రీ డా॥ బి. రామరాజు గారు వ్రాసిన ఆంధ్రయోగులు, రెండవ భాగములో శ్రీ శివరామదీక్షితుల సంగ్రహ చరిత్ర మరియు వారి కాలము పై విధముగా తెలిపియున్నారు. దీక్షితులవారు వంద సంవత్సరాల కంటె ఎక్కువ రోజులు బ్రతికారని జనవాక్యము. కనుక ఒక వేళ వేమన క్రీ.శ. 1600–1700 సం॥ల మధ్య జీవించి వుంటే శ్రీ శివరామదీక్షితులవారు వేమనను గూర్చి తప్పనిసరిగా తమ గ్రంథాలలో వివరంగా పేర్కొనివుండే వారు. మరియు శ్రీ శివరామదీక్షితుల వారు వారి గ్రంథంలో వేమన గూర్చి ఒక ప్రార్థనా శ్లోకంతో మాత్రమే సరిపెట్టేవాడు కాదు. కనుక వేమన శివరామదీక్షితుల కంటె సుమారు రెండు వందల సంవత్సరాల ముందు పుట్టినవాడై యుండి వుండాలి. అదే నిజమైతే వేమన క్రీ.శ. 1472 (నందన సంవత్సరం)లోనైనా లేక క్రీ.శ. 1412 (నందన సంవత్సరం)లోనైనా జనించి యుండవలెను.

అదియునుగాక క్రీ.శ. 1590–1620 సం॥లకు చెందిన యెల్లనార్యుడు రచించిన 'తోభ్య చరిత్రము' నందు వేమన స్తుతించబడుటచేతనూ, వేమన తన పద్యాలలో రాయని భాస్కరుని, ముత్తయ మంత్రిని పొగుడుట చేతనూ, శివయోగీంద్రుడు, తురగా రామకవి, ప్రసన్నాంజనేయ శతక కర్త అయిన నరసింహదాసు మొదలైన కవులచే వేమన కీర్తించబడుట చేతనూ, వేమన కాలము క్రీ.శ 1412–1570 సం॥ల మధ్య కాలముగా న్ర్ణయింప వీలుంది.

కనుక వేమన ఖచ్చితంగా క్రీ.శ. 1600–1750ల మధ్య కాలంలో యున్నవాడు కాడని చెప్పవచ్చును. క్రీ.శ. 1712–1791 కాలంలో శివరామదీక్షితుల వారు అచలయోగాన్ని ఆంధ్ర

దేశంలో బాగా వ్యాప్తిలోకి తీసుక వచ్చారు. కనుక వేమన, శివరామదీక్షితులు సమకాలికులు కారని తెలియబడుచున్నది. దీనికి ఈ క్రింది శ్లోకాలే నిదర్శనం.

'శ్లో॥ అంభికా శివయోగీశం వేమనయోగి సద్గురుం।
నిరంజన వెంకయార్యం తిరువెంగళాహంభజే॥'

'శ్లో॥ శ్రీధరస్వామి యోగీంద్రం శివరామాఖ్య దీక్షితం।
కంబాలూరి అప్పబ్రహ్మం సద్గురుభ్యో నమో నమః॥'

పై శ్లోకాలు శ్రీ శివరామదీక్షితులు వ్రాసిన 'బృహద్వాశిష్ఠం' అను గ్రంథం నుండి తీసుకోబడినవి. కనుక శిష్య పరంపర ఈ విధంగా తెలియబడుచున్నది. అంభికా శివయోగి శిష్యుడు వేమన. వేమన శిష్యుడు నిరంజన వెంకయార్య. నిరంజన వెంకయార్యుని శిష్యుడు తిరువెంగళాచార్యుడు. ఈతని శిష్యుడు శ్రీధరస్వామి. ఈతని శిష్యుడు శివరామదీక్షితులు. కాని శ్రీ శివరామదీక్షితులు క్రీ.శ. **1690–1791** ల మధ్య కాలంలో జీవించి వున్నాడు. కనీసం ఒక్కొక్క తరానికి **50** సం॥ల అంతరం వుండి వుండవచ్చును. కనుక వేమన సుమారు **200** సంవత్సరాలు శివరామదీక్షితుల కంటె ముందటివాడు. నిరంతర పరిశోధనాశీలియైన బ్రౌన్ చివరిసారిగా క్రీ.శ. **1839**లో 'వేమన పద్యములు' అనే పుస్తక మలి ముద్రణకు చేర్చిన మలి పీఠికలో వేమన పద్యాలు పూర్తి నాలుగు వందల యేళ్ల ముందు నాటివైనట్లు భావింపబడుతున్నాయని వ్రాసాడు. కనుక వేమన జీవించిన కాలము క్రీ.శ. **1412 – 1570** సం॥ ల మధ్యన వుండెనని నిర్ణయించవచ్చును.

## వేమన ప్రాంతము:

వేమన దేశసంచారం చేస్తూ తన సిద్ధాంతాన్ని దక్షిణ భారతదేశం అంతటా బోధించి యున్నాడు. కాని అతని స్వగ్రామం మాత్రం ఖచ్చితంగా తెలియబడుటలేదు. అయిననూ వేమన పద్యాలలోని పదసమూహమును, మాండలికాలను పరిశీలించగా వేమన రాయలసీమ ప్రాంతంనకు చెంది వుండవచ్చునని చెప్పవచ్చును. కొందరు పరిశోధకులు వేమన నివాస స్థలమును ఈ క్రింది పద్యం సూచిస్తుందనుకొన్నారు.

ఆ॥ ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి
మూగ చింతపల్లె మొదటి వీడు
అరశి చూడ బయలు అది ముక్తి శివుడయా
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఇదే పద్యం వేరే ప్రతులలో పాఠభేదాలతో:

ఆ॥ ఊరు కొండపల్లె ఉనికి పశ్చిమ వీధి
మూక చింతపల్లె మొదల యిల్లు
ఆత్మ రాక పోక అదియె పో తత్వంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి
మూగ చింతపల్లె మొదటివీడు
అరశి చూడ బయలు ఆడనే శివుడుండు
విశ్వదాభిరామ వినుర వేమ॥

కాని ఈ పద్యం వారనుకొన్నట్టు కవియొక్క ప్రాంతంను సూచించదు. ఎందుకనగా ఈ పద్యంలో విషయం మూడవ పాదంలో వుంది. దానిని వివరించుటకు పై రెండు పాదాలు ఉపయోగపడినాయి తప్ప, కవి యొక్క ఊరు పేరు తెలిపే అవకాశం లేదక్కడ. అందువల్ల బ్రౌన్ కూడా వేదాంత సంబంధమైన వ్యాఖ్యానాన్ని మాత్రమే ఈ పద్యానికి వ్రాసియున్నాడు.

పై పద్యానికి బ్రౌన్ వ్యాఖ్యానం ఇలా వుంది. "The village of our body in which the deity dwells is Hill Town (the head); his is in back street (the spine). There in silence is the first house. We gaze and continually view it, this is the road of beatitude".

అచల సిద్ధాంతంననుసరించి ఈ పద్యానికి అర్థం: మహాకాశమే కొండ, దాని పరిణామమే పంచభూతాలు. ఈ పంచభూతాలే పశ్చిమ (స్థూల) వీధి. చింతలకెల్ల నిలయమైన సమిష్ఠి మనస్సే

మొదటి ఇల్లు. ఇది తెలిసికొన్నచో ఆత్మయొక్క రాకపోకలు తెలియబడగలవు. కనుక ఈ పద్యాన్ని బట్టి వేమన ప్రాంతాన్ని చెప్పలేము.

ఏది ఏమైనప్పటికిని వేమన పద్యాలలోని పద ప్రయోగాలను బట్టి వేమన రాయలసీమ ప్రాంతంనకు చెందియుండవచ్చునని నిర్ణయించవచ్చును.

## వేమన కుటుంబం, కులం, విద్యాభ్యాసం:

వేమన సామాన్య రైతు కుటుంబంలో జన్మించి యుండవచ్చును. వీరి వృత్తి వ్యవసాయం అయివుండవచ్చును. వీరు కాపు కులానికి చెంది యుండవచ్చును. దీనికి రుజువు ఈ క్రింది వేమన పద్యమే.

ఆ॥ కలియుగమున నున్న కాపు కులానకు
వేమన దన కీర్తి విక్రయించె
నున్న ధర్మమెల్ల నుర్విలో నరులకు
కోరు బెట్టె పరము గోరి వేమ॥

వేమనది రాజకుంటుంబం మాత్రం కాదు. కాని రాజులయొక్క అండదండలు వేమనకు వున్నట్టున్నాయి. కనుకనే వేమన తన భావాలను నిర్భయంగా ప్రజలకు బోధించుటయేగాక హిందూ సాంప్రదాయంలోని దురాచాలను ఖండించాడు. వేమనయోగి తన గ్రామమందే గురువుద్వారా అక్షరాభ్యాసం కావించినట్టున్నాడు. సంస్కృత పండితుడు కాకపోయినప్పటికినీ, వేమనయోగి ఆ భాషను అర్థము చేసికొనిన సమర్థుడని చెప్పవచ్చును.

వేమనకి చిన్నప్పటినుండే పద్యరచన అలవడినట్లుంది. అచలమును 'అంభికా శివయోగి' ద్వారా తెలిసికొన్న తర్వాత ఆ పద్యరచననే అచలయోగ ప్రచారమునకు ఆయుధముగా వాడుకొన్నాడు. వేమన కేవలం ఆటవెలదులను మాత్రమే చెప్పాడని కొందరి నమ్మకం. అది నిజం కాదు. ఎట్లనగా తాళప్రతుల యందు అక్కడక్కడ ఆటవెలదులతో ఇతర పద్యాలు కూడా ఎక్కువ సంఖ్యలోనే వుండివున్నాయి. కనుక లేఖకులు వాటిని చొప్పించారనుకోవటం

పొరపాటే. వేమన వేదాంత విషయాలను చెప్పుటకు కందాలను, తేటగీతులను ఎక్కువగా ఎన్నుకొన్నాడు. ఆటవెలదులను ఎక్కువగా లోక సంబంధమైన పద్యాలకు ఎన్నుకొన్నాడు. వేమన చెప్పిన కంద, తేటగీతి పద్యాల భావములు మతవాదుల చట్రములలో ఇమడక పోవుటవల్లనూ, వాటి నిగూఢ భావములు వారికి అంతుచిక్కక పోవుటవల్లనూ, ఆ పద్యాలు వేమన చెప్పినవి కావని వారు భావించుచున్నారు. కాని బ్రౌన్ కందాది పద్యాలు వేమనవి కావని అంగీకరించలేదు. కనుకనే వాటిని ఉన్నవున్నట్లు తన సంకలన గ్రంథంలో ప్రచురించియున్నాడు. ఎట్టులైననూ అచటచట కొన్ని పద్యములు మాత్రమే లేఖకులు స్వయంగా వ్రాసినట్లున్నారు. వాటిని తొలగించాల్సిన పని అచల సిద్ధాంతం తెలిసినవారి భుజస్కంధములపైన వున్నది. ఈ గ్రంథనందు ప్రక్షిప్తములను వదలి, వేమన స్వయంగా చెప్పిన పద్యాలనే ఏరుకోవడం జరిగింది.

వేమన యుక్త వయస్సులో వేశ్యాలోలుడని లోకములో ఒక వాడుక కలదు. ఇందులో ఎంతమాత్రం నిజం లేదు. ఎందుకనగా అసలు వేమన చరిత్ర గూర్చి రవ్వంతైననూ ఖచ్చితంగా తెలియుటలేదు. ఇక వేమన చెప్పిన కొన్ని పద్యాలు ఆ కాలంనాటి వేశ్యా లోలతను నిరసించాయి. వాటి ఆధారంగా కొందరు వేమనను వేశ్యాలోలుడిగా చిత్రీకరించారే తప్ప, వారికి నిజము తెలిసికాదు. నిజానికి వేమనయోగి తన కాలంలో ఎనలేని కీర్తి ప్రతిష్ఠలు పొందుట వల్ల, తదుపరి కాలంలో కొందరు బూటకపు వేమనలు తయారయ్యారు. ఈ వేమన వేషధారుల్లో ఎవరికైనా ఒకరికి వేశ్యాలోలత యుండి యుండవచ్చును. అదే నిజమైన వేమనకు అంట గట్టారు మతవాదులు.

## వేమన కాలమునాటికి మతాల దుస్థితి:

**అద్వైత మతము:** వేదోపనిషత్తుల ప్రధానాశయము తెలిసికోలేక మానవుడు అనేక మతవాదములను కాలక్రమంలో కల్పించుకొనినాడు. మతప్రవక్తలమని చెప్పుకొనుచు కొందరు ప్రస్థానత్రయమునకు తోచిన విధంగా భాష్యాలు వ్రాసుకొన్నారు. ఇందులో ప్రధానముగా ఆది శంకరాచార్యుల వారు (క్రీ.శ. 788-820) మరుగునపడిపోయిన అద్వైతమును భారత దేశమునందు ఉద్ధరించెను. ఆతడు ఆనాటికి బాగా వ్యాప్తిలోనున్న బౌద్ధ మతమును ఖండించుచు, అద్వైత మత వ్యాప్తికి కృషి చేసెను. ఈతని మత సారమును ఈ క్రింది శ్లోకంలో బోధించియున్నాడు.

'శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథ కోటిభిః।
జగన్మిథ్యా బ్రహ్మ సత్యం జీవో బ్రహ్మైవనాపరః॥'

దీని అర్థం: కోటి గ్రంథాల సారము ఒకే ఒక అర్ద శ్లోకంలో శ్రీ శంకరాచార్యులవారిచే అద్వైత సారముగా చెప్పబడినది. అది ఏమిటనగా 'జగత్తు మిథ్య, బ్రహ్మము సత్యము. జీవుడు ఆ బ్రహ్మమున కన్నా వేరు కాడు'. దీనిని వివరిస్తూనే శంకరాస్వాముల వారు భాష్యాది గ్రంథాలను రచించినాడు. శంకరుని దృష్టిలో జగత్తు మిథ్య. అసలు జగత్తు పుట్టనే లేదని ఆతని మతము. జగత్తు మాయ వలన కనిపించుచున్నదే గాని, బ్రహ్మము జగత్తుగా మారలేదని వారి అభిప్రాయము. వీరు దేహి సత్యము, దేహము అసత్యము అందురు. స్వస్వరూప అనుసంధానము వలన ఈ జీవుడు ఆ బ్రహ్మమే అయి మోక్షము పొందునని వీరి అభిప్రాయము. ఇందులకు సామవేదము నుండి 'తత్వమసి బ్రహ్మ', అథర్వణ వేదము నుండి 'అయమాత్మ బ్రహ్మ', యజుర్వేదము నుండి 'అహం బ్రహ్మాస్మి', ఋగ్వేదము నుండి 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను నాలుగు మహా వాక్యముల ద్వారా జీవ బ్రహ్మలకు అభేదత్వమును ప్రతిపాదించుచు, శ్రవణ,మనన, నిధి, ధ్యాసల వలన బ్రహ్మ పరోక్షానుభవము సిద్ధించునని వీరి మతము. ఈ మహా వాక్యార్థ అనుభవ ప్రాప్తికి అద్వైతులు నిర్ణయించినవి రెండే రెండు మార్గాలు. 1) సన్యాసాశ్రమ స్వీకారము, 2) శ్రీ విద్యా దీక్ష. ఈ రెండు తప్ప ఇతర మార్గములు చెప్ప బడలేదు. సన్యాసాశ్రమములోయున్న కఠిన నియమాలను, కష్ట నిష్ఠూరాలను సహించలేక భ్రష్టులై గంజాయి మొదలగు మత్తు పదార్థాలను స్వీకరించడం, అంతకంటే నీచమగు రహస్య సంసారాలు సాగించడం అందరికి తెలిసినవే. కనుకనే వేమన 'చదువు చదువ నేల సన్యాసి గానేల?' అని చెప్పియున్నాడు. ఇక శ్రీదీక్ష (పూర్ణ దీక్ష) యందలి వామాచార, దక్షిణాచారాల గూర్చి మరియు అందలి సమయాచార పద్ధతిలో అవలంబించు దుష్టాచారములగు మకార పంచకము ( మద్యము, మాంసము, మత్స్యము, ముద్ర, మైథునము) గూర్చి అనేక భిన్నాభిప్రాయములు అద్వైత మతమునందు ఏర్పడి, వీటియందు కూడా దురాచారములు పెరిగి అద్వైతము అపహాస్యము పాలైనది. చివరికి 'వేదాంతులు వచ్చినారు, చెంబూ ముంతా జాగ్రత్త' అనే స్థితికి అద్వైత మతము వేమన కాలమునాటికి దిగజారినది.

**వేమన అద్వైత మతమునకు చెందినవాడు కాడని నిరూపించుట:** వేమన దృష్టిలో బ్రహ్మము (ఎరుక) అనగా శూన్యము. కాని అద్వైతమునందు బ్రహ్మము శూన్యము కాదు. కనుక వేమన అద్వైతి కాదు.

కం॥ తలచిన శూన్య తత్వము
తలచక నుండినను శూన్య తత్వంబదియౌ
తలచిన తలపేడేరును
తలచక నుండినను తానె తత్వము వేమా॥

తరచి చూచిననూ, చూడకున్ననూ బ్రహ్మము (తత్వము) శూన్య స్వరూపమైనది. గురుని చేరి బ్రహ్మమును తరచి చూచి, గురువాజ్ఞ ప్రకారము నడచుకున్నవాడికి ఇక పుట్టుక లేదు. అలా తెలిసికోనివాడు, బ్రహ్మమునందే వుండి జనన మరణములను పొందుచుండును.

ఆ॥ తన్ను వెదకి చూడ దానె పో జీవుండు
తత్వమరసి చూడ దానె యాత్మ
మన్ను మిన్ను లేదు మాయ తా లేదయా
విశ్వదాభిరామ వినుర వేమ॥

తత్వ విచారణ చేసినవాడికి తానే జీవుడుగా, తానే పరమాత్మగా యున్నానని తెలియబడును. కాని పంచభూత సంబంధమైన జడ ప్రకృతి మాయ వలన వచ్చినదని శంకరాచార్యులు చెప్పినారు. ఆ మాయ వేరే లేదు అనియూ, అంతా బ్రహ్మమయమనియూ వేమనయోగి ఈ క్రింది పద్యములో చెప్పుచున్నాడు.

ఆ॥ మాయ జగమటనుచు మరి పల్కుచుందురు
మాయ గాదు బ్రహ్మమయము గాని
మాయయైన పరము మరియెందు నున్నదో?
విశ్వదాభిరామ వినుర వేమ ॥

వేమన యొక్క పరమ లక్ష్యము ఇహపరములు గానట్టి నిబిడమగు బట్టబయలు ( అచల పరిపూర్ణ బ్రహ్మము) ను తెలిసికోవడం. ఈ అచల పరిపూర్ణ బ్రహ్మము ఇహము (జగత్తు) మరియు పరము ( బ్రహ్మము) లు గాక వాటికి అతీతమై వున్నది. కనుక వేమన బోధించినది అద్వైతము ప్రతిపాదించిన జీవబ్రహ్మైక్యమునకు అతీతమైనదని తెలియదగును. దీనిని ఈ క్రింది పద్యములో చూడదగును.

తే॥ సహచరంబగు నెరుకను సరకుగొనక
ఇహ పరంబులు గానట్టి దెరిగి మరిగి
నిబిడమగు బట్ట బయలున నిలుచుటొప్పు
విశ్వదాభిరామ యిదియు వినుర వేమ ॥

వేమన అద్వైత మతమును (మాయా వాదమును) పూర్తిగా ఖండించెను. జగత్తు బ్రహ్మమయమని, ఇహపరములు వేరుగావని వేమనార్యుడు ప్రవచించియున్నాడు. మరియు ఇహపరములకు, బ్రహ్మజగత్తులకు వేరుగా వున్న అచల పరిపూర్ణ బ్రహ్మమే పరమ సత్యమని తన పద్యాలలో చెప్పియున్నాడు. అద్వైతమతము చెప్పుకొనుటకే పనికి వచ్చునుగాని, ఆచరణకు కాదు. జగత్తు మిథ్య అనే వాదము సంఘములో దురాచారాలు పెచ్చు పెరుగుటకు అవకాశమిచ్చినది. దురాచారాల కారణంగా శంకరాస్వాముల తర్వాత కాలంలో క్రమేణా అద్వైతమతంపైన వివరించిన విధంగా క్షీణించినది.

**విశిష్టాద్వైత మతము (వైష్ణవమతము):** శ్రీ రామానుజాచార్యులవారు (క్రీ.శ.1017-1137) ఆళ్వారుల సాంప్రదాయమునకు చెందినవారు. వీరు ప్రధానంగా శంకరాద్వైతముపై మతయుద్ధమును ప్రకటించినారు. వీరు శంకరుని యొక్క మాయా వాదమును పూర్తిగా ఖండించెను. బ్రహ్మము నిర్గుణ-సగుణ స్వరూపమైయుండి, ఏక రూపముగా వున్నదని, దానినే విశిష్ట ఐక్యమనిపేర్కొని, తన మతమును విశిష్టాద్వైతముగా వ్యాప్తిలోనికి తీసుక వచ్చెను. ఈతని మతసారము :- బ్రహ్మము సగుణ సాకారమని నిరూపిస్తూ విశిష్టాద్వైతాన్ని పునః ప్రతిపాదించినాడు. బ్రహ్మము విశేష లక్షణాలతో కూడిన విశిష్ట పదార్థము. అద్వైతమైన పరమ సత్యము విశేషణ విశిష్టం. కనుక ఈ తత్వాన్ని విశిష్టాద్వైతమన్నారు. దీనిలో సగుణ బ్రహ్మము (ఈశ్వరుడు), నిత్యజీవులు (చిత్), అచేతన ప్రకృతి (అచిత్)- మూడూ సత్యమే. వీటిలో బ్రహ్మము సర్వ స్వతంత్రమైన పరమ సత్యము, తక్కినవి రెండూ పరతంత్రాలు. చిత్, అచిత్‌లు బ్రహ్మమునకు భిన్నముకాక బ్రహ్మము యొక్క విశిష్ట లక్షణాలుగా అవయవ రూపంగా వుంటాయి. కనుక బ్రహ్మము చిదచిద్విశిష్టుడు. ఈ సాంప్రదాయంలో మోక్ష సాధనకు భక్తిని మించినది మరొకటి లేదు. భక్తికి అనుబంధంగా ప్రపత్తి, శరణాగతి వుంటాయి. మోక్షము ఈ సిద్ధాంతములో జీవునికి స్వతస్సిద్ధమైన స్థితికాదు. ఇది భగవదనుగ్రహం ద్వారానే సిద్ధించే దశ. భక్తి ప్రపత్తులతో భగవంతుని ప్రేమించి, పూజించి, ఉపాసించి, నియతకర్మలను నెరవేస్తూ వుంటే, అట్టివాని జీవితం పరిపక్వ దశను పొందుతుంది. ఆ సమయంలో భగవంతుడు ఆతనికి తన దివ్యమంగళమూర్తి దర్శన భాగ్యాన్ని ప్రసాదిస్తాడు. ఇది సాక్షాత్కారము. తరువాత భౌతిక కాయాన్ని వదలి భక్తుడు వైకుంఠ ధామాన్ని చేరతాడు. అక్కడ భక్తుడు భగవంతుని సాన్నిధ్యంలో ఆనందభరితుడై నివసిస్తాడు. తిరిగి ఈ లోకానికి రాడు. ఈ మతములో జీవన్ముక్తి లేదు. దేహ విముక్తి మాత్రమే వుంది. ఈ లోకంలో జీవించివున్నంత వరకు విద్యుక్త ధర్మాలు చేయవలెను. ముక్తికి సాక్షాత్ సాధనము భక్తియే. ఇదియే రామానుజాచార్యుని విశిష్టాద్వైతము.

ఈ విశిష్టాద్వైత మతము మానవుడికి దాసత్వమును ఆపాదించునే కాని, దైవత్వమును కాదు. అంతియేగాక ఈ మతము ఎచ్చటనో యున్న పరలోకాల భ్రాంతులయందే మానవుడిని త్రిప్పును. వేమన 'తత్వమెరిగనేని దైవసముడు' మరియు 'ఇహము విడిచి ఫలములింపుగ గలవని, మహిని బల్కువారి మతము కల్ల, ఇహములోన బరము నెసగుట గానరో ?' అని చెప్పియున్నాడు. కనుక వేమన తత్వము విశిష్టాద్వైతమును కూడా ఖండించెనని చెప్పదగును.

ఇంకనూ వైష్ణవుల గూర్చి

ఆ॥ పట్టు చీర గట్టి పట్టె తిరుమణిడి
సృష్టి వైష్ణవంబు శిఖలు మించె
చిన్నె లెన్నొ జేసి చెరచె వైష్ణవమిట్లు
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ వైష్ణవులను వొట్టి వార్త మాత్రమేకాని
భ్రష్టులంత కన్న పరులు లేరు
కష్టనరుల కెల్ల కలుగునా మోక్షంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥

శ్రీ రామానుజుడు ప్రబోధించిన విశిష్టాద్వైతము ప్రధానంగా భక్తి మార్గము. కనుక ఆ మతజనులు పూజలు పునస్కారాలతో కాలంగడుపుతూ ఎక్కడో దేవుడున్నాడని, ఆ దేవుని యొక్క దయకోసం పరతంత్రులై దాసులుగా వుండి, కష్టములను పొందుచుంటారే తప్ప మోక్షమును పొందలేరని, ఆత్మతత్వమును ఉన్నదున్నట్లుగా తెలుసుకోలేరని, తెలుపుచు వేమన వారి విపరీత పోకడలను నిర్ద్వంద్వంగా ఖండించెను. మానవ సౌభ్రాతృత్వము కొరకు నిర్ణయించిన ఈ మతమునందు క్రమంగా భోగలాలసత్వము, త్రాగుబోతు తనము, వ్యభిచారము మెల్లమెల్లగా ప్రవేశించి చోటు చేసుకొనెను. భగవంతుడైన శ్రీ మహావిష్ణువు యొక్క విగ్రహములకు బాలభోగవములు, రాజభోగవములు, పవళింపు సేవలు జరుపుచూ, తాము కూడా అట్టి భోగపరాయణులై వానిని అనుసరించుట వలన, రామానుజ మతమునగా త్రాగుబోతు, వ్యభిచారమతమని ఆనాడు వ్యాప్తిలోకి వచ్చెను. వైష్ణవాలయాలకు పెళ్లికాని ఆడపిల్లలను సేవ కొరకు మొక్కుబడిగా సమర్పించేవారు. వీరు శాస్త్ర బద్ధమైన నాట్యం చేసేవారు. వీరినే దేవదాసీలు

అనేవారు. త్వరలోనే వీరు పడుపుకత్తెల స్థాయికి దిగజార్చబడుట వల్ల ఈ మతము దుస్థితికి చేరెను. భగవంతునియందు భక్తిప్రపత్తులు పోయి, విధి నిషేధములు అడుగంటి, అధర్మము ప్రబలి సమాజ శ్రేయస్సుకు ఘోర ప్రమాదము వాటిల్లెను. వేమన కాలమునాటికి విశిష్టాద్వైతము ఈ విధంగా క్రమేణా క్షీణించి అందులో కూడా దురాచారాలు పెరిగి పోయి వుండుట వల్లనే ఆ మతమును కూడా వేమన తిట్టినాడనుటలో సందేహము లేదు.

వేమనయోగి వేదాంతము – 'ఏమికాని దాని నెరుగుట లక్ష్యంబు'. కనుక 'ఏమికాని అచల పరిపూర్ణ బ్రహ్మము' ఈ విశిష్టాద్వైత మతమునకు కూడా అందనిదై వున్నది. కనుక వేమన యోగి వేదాంతము విశిష్టాద్వైతాతీతము అని తెలియదగును.

**ద్వైత మతము :** ఇది శ్రీమధ్వాచార్యుల (క్రీ.శ. 1238 – 1317) వారి మతము. వీరు కూడా శంకరుల అద్వైతమతాన్ని పూర్తిగా ఖండిస్తూ, కొన్ని విషయాలలో విశిష్టాద్వైతమును సమర్థిస్తూ, అందుకు తగిన కొన్ని శాస్త్ర పురాణ ప్రమాణాలను ఆధారంగా తీసుకొని, జీవబ్రహ్మలకు అత్యంత విభిన్నత్వమును ప్రతిపాదించెను. ఈ మతము ప్రధానంగా రెండు సత్తాల భేదము మీదనే ప్రతిష్ఠితమైనది.

భగవంతునికి – జీవునికి మధ్య, భగవంతునికి – ప్రపంచానికి మధ్య, జీవునికి – జీవునికి మధ్య, జీవునికి – ప్రపంచానికి మధ్య, జడపదార్థానికి – జడపదార్థానికి మధ్య భేదమున్నదని అయిదు విధాలుగా భేదాన్ని నిరూపించినాడు మధ్వాచార్యుడు. ద్వైతములో మూడు పదార్థాలు సత్యాలు – 1) జీవుడు, 2) ప్రకృతి, 3) బ్రహ్మము. ఇవి మూలంలోనే పరస్పర భేదాలున్న శాశ్వత ద్రవ్యాలు. అయితే బ్రహ్మము స్వతంత్ర సత్త, మిగిలిన రెండు బ్రహ్మము మీద ఆధారపడే పరతంత్రసత్తాలు. ఈ విధంగా ఇది ద్విత్వము అవుతుంది. ఈ మతములో ముక్తి అంటే జీవుడు అన్యరూపాన్ని వదలి తన స్వరూపంలో, భగవంతుని సన్నిధిలో ఉండుటమేగాని, సారూప్యాది ముక్తులను మధ్వుడు అంగీకరించలేదు. భగవంతుడులో ఐక్యం పొందడం అసలే కాదు. జీవునికి, భగవంతునికి ఆవగింజకు పర్వతమునకున్నంత తేడా వుందని ఈ మతాభిప్రాయము. వేదవిహిత కర్మాచరణ ద్వారా జీవుడు పరిశుద్ధి చెందగలడని, కర్మకు ఈతడు ప్రాముఖ్యతనిచ్చినాడు. మానవుడెన్నడూ మాధవుడు కాలేడు. భగవంతుడు ప్రభువు. జీవుడు కింకరుడు మాత్రమే. జీవుడు దాసానుదాసుడు అని ద్వైతమతము ప్రతిపాదించుటచే మానవోపాధి యొక్క విశిష్టత కోల్పోయి, పరతంత్రము ప్రబలి, బానిసత్వ లక్షణములు ప్రబలెను.

భగవంతుని సేవలో ధ్యానము, పూజ మొదలైనవేగాక, తమ పుత్రులకు హరి అని పేరు పెట్టడం, విష్ణుచక్రము మొదలైనవి శరీరంపై ముద్రించుకోవడం ఈ మతానుయాయులకు పరిపాటి. శరీరంపై విష్ణు చక్రాలను, శంఖులను ముద్రించుటకు కాల్చుకొనే వారు. దీనిని ఖండిస్తూనే వేమన

ఆ॥ తనువునందు నగ్ని దరికొని కాల్వంగ
కాల్చు కొనుట కేమి కర్మమునకు
దాసు తప్పునకును దండన కాబోలు
విశ్వదాభిరామ వినురవేమ ॥

అని చెప్పియున్నాడు. కనుక వేమన యోగి ద్వైత మతమునందలి దాస భావమును ఖండించినాడని తెలియబడినది. అంతియేగాక వేమన స్వతంత్ర సాధనకే విలువనిచ్చాడుగాని, పరతంత్రమైన వాటిని ఖండించాడు. కాని ద్వైతమతమునందలి మోక్షము భగవంతుని అనుగ్రహము మీద ఆధారపడియుంది. అందువల్ల వేమన ద్వైత భావమును తన పద్యాలలో ఖండించాడని తెలియనగును. వేమన తత్వజ్ఞానియైన మానవుడే దైవముగాని, ఎచ్చటనో దైవములేడని అనేక పద్యాలలో చెప్పియున్నాడు. కనుక వేమన తత్వము మానవుని ఆధిక్యతను చాటుచు ద్వైతాతీతముగా వున్నదని తెలియబడుచున్నది.

**శైవ మతము** : శైవ మతములో నాలుగు సాంప్రదాయములు కలవు. అవి 1) శైవము, 2) పాశుపతము, 3) కాలగమనము (కాలముఖ), 4) కాపాలికము. పై నాలుగు భేదములు ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాద్వైతముల వల్లనూ, ఉపాసనా భేదముల వల్లనూ ఏర్పడినవే. వీటి కన్నింటికీ శైవతంత్రములే మూలముగా నున్నవి. క్రీస్తు పూర్వము నుండియే భారతదేశమునందలి వివిధ ప్రాంతాలలో ఇవి వ్యాప్తిలో నున్నవి. ఆదిశైవులు కౌశిక, కశ్యప, భరద్వాజ, అత్రి, గౌతమ ఋషి సాంప్రదాయమునకు చెందిన వారని ప్రతీతి. వీరయిదుగురు పరమశివుని అయిదు ముఖాల నుండి శాంభవ దీక్షను పొందారని వాడుక. వీరిలో కొందరు లింగధారులై మతక్రియలను జరిపించుచుండిరి. వీరికి పరమశివుడే పరమదైవము. కాగా మిశ్రమ శైవులు పరమశివునితో పాటు మరికొందరి దేవతలను పూజించేవారు. వీరికి శివునియొక్క ఆధిపత్యమునందు నమ్మకములేదు. శుద్ధశైవులు అట్లుగాక లింగధారణ చేసికొని, శివపూజను అనునిత్యము ఆరుసార్లు చేయుచు, పంచాక్షరి మంత్రమును 21,600 సార్లు జపించేవారు. వారికి లింగము మరియు శరీరముల ఏకత్వమునందు బలమైన నమ్మకము వుండేది. వీరిలో మళ్లీరెండు రకాలు 1) శ్రౌత శైవులు,

2) వీర శైవులు. శ్రౌత శైవులు కులవ్యవస్థను నమ్మేవారు. వీర శైవులు తమ ప్రాణలింగాలను పోగొట్టుకున్నప్పుడు ప్రాణత్యాగానికి సిద్ధపడేవారు. వీరిలో మళ్లీ రెండు రకాలు 1) లింగాయతులు, 2) జంగములు.

**పాశుపత శాఖకు చెందిన శ్రీకంఠుని మతము :** బ్రహ్మము సగుణము, సవిశేషము, మహామహిమము. జ్ఞానానందాది శక్తి సంపన్నము. కలంక రహితము. సృష్టి స్థిత్యాదులకు కర్త. ఆయన చిచ్ఛక్తి వలన జగత్తుగ పరిణమించినాడు. ఆయన శివుడు. ఈశ్వర పశుపత్యాది పర్యాయ శబ్దసారముచే ప్రకాశితుడు. ఆయనకు ఆకాశము శరీరము, శక్తి శివుని ఆత్మ సత్తారూపము. చిదచిత్ప్రపంచ రూపకమగు శక్తిచే బ్రహ్మము స్వాభావికముగానే విశిష్టము. శివుడనబడు పరబ్రహ్మము జీవునికంటే అధికమైనప్పటికినీ, ఉపాసించువాడు నేను బ్రహ్మ ను అని ఉపాసించవలెను. ఆ పరబ్రహ్మము వారిని అనుగ్రహించును. దానిని స్వాత్మగా వారు గ్రహింతురు. నిష్కళంక శివత్వప్రాప్తియే విముక్తి. అది పశుత్వ నివృత్తి కానిది లభించదు. కాబట్టి నిరంతరముగా 'నేనే శివుడను' (శివోஉహం) అను భావనా ప్రవాహముచే పాశము (బంధము) శిథిలమగును. అప్పుడు ఉపాసకుడు శివుని వలెనగును. నేను నిరతిశయ ఆనంద రూపుడను, కేవలసాక్షిని, స్వయంప్రకాశుడను, శివుడను – అనుభావము ఏర్పడుట ముక్తి యని వీరి మతము. ఇది దాదాపు రామానుజుని విశిష్టాద్వైతమునకు సమీపముగా వుంది. వీరశైవుల శివ విశిష్టాద్వైతము కూడా కొన్ని తేడాలతో ఈ రకంగానే యుండును. వారు విష్ణువే పరమదైవమనగా, వీరు శివుడందురు. ఇక శైవమతస్థులు తలపాగలు, భుజంమీద పులితోలు, మెడలో రుద్రాక్ష మాలలతో వేషధారులుగా వుండేవారు. క్రమక్రమంగా ఈ మతములో కూడా దురాచారాలు పెరిగిపోయాయి.

పాశుపత మతావలంబికులు దేహమునిండ బూడిద పూసుకొని ఆరు క్రియల ద్వారా శివుడిని పూజించుట వల్ల మోక్షం సాధించవచ్చని నిర్ణయించుకున్నారు. 1) నవ్వడం, 2) పాడడం, 3) నృత్యం చేయడం, 4) ఎద్దు అరచినట్లు అరవడం, 5) సాగిలపడడం, 6) వినబడి వినబడకుండా గొణగడం. మరో ఆరు ఆటమార్గాలను కూడా శివసాయుజ్యాన్ని సులభంగా పొందుటకు వీరు నిర్ణయించుకున్నారు. 1) మేల్కొనియుండగ నిద్రించినట్లు భావించుకోవడం, 2) శరీరావయవములను పక్షపాతపు రోగివలె ఆడించడం, 3) కాళ్లు పడిపోయినట్లు వూహించుకొని నడవడం, 4) అందమైన స్త్రీలతో శృంగార చేష్టలు చేస్తున్నట్లు భావించుకోవడం, 5) పదిమంది నిషేధించిన కార్యాన్ని యుక్తాయుక్త విచక్షణ తెలియనట్లుగా ఆచరించడం, 6) పిచ్చివానివలె మాట్లాడటం. ఇక ఆ రోజులలోనే బసవని పేరు మీద పెళ్ళికాని

ఆడపిల్లలను వదలి వేసేవారు. వారినే బసివిరాండ్రు అనేవారు. వేమనయోగి పేర్కొనిన వ్యభిచారిణులు చాలా మంది ఇటువంటి మతసాంప్రదాయం నుండి వచ్చినవారే. అలా ఆనాడు శైవమతము కూడా దురాచారాలతో పతనావస్థకు చేరుకొనెను.

అందువల్లనే వేమన వీరిని గూర్చి

ఆ॥ నొసలు బత్తుడయ్యె నోరు తోడేలయ్యె
మనసు భూతమువలె మలయగాను
శివుని గనియెనన్న సిగ్గెట్లు గాదకో ?
విశ్వదాభిరామ వినుర వేమ ॥

అని చెప్పియుండెను.

షణ్మతాలలో లింగమతము కొంతవరకు ప్రశస్తమైనప్పటికినీ, వేమన నాటి కాలంలో లింగధారులు దొంగలే అయినారు. అందువల్లనే వేమన ఈ క్రింది విధంగా చెప్పియున్నాడు.

ఆ॥ ఆరు మతములకన్న నధికమైన మతము
లింగ మతముకన్న లేదు జగతి
లింగ ధారి కన్న దొంగలు లేరురా
విశ్వదాభిరామ వినుర వేమ ॥

**కాలగమనము (కాలముఖ):** ఇది కించిత్భేదములతో పాశుపతమతమునందే ఇమిడిపోవును.

**కాపాలిక మతము:** ఇది నానావిధ విపరీతాచారములు కలిగి స్త్రీ పురుష సంపర్కము ద్వారా ఏదేదో సాధింప చూపును. కాపాలికులు స్త్రీ యోనిపై ఆత్మను ఊహించుకొని ధ్యానం చేయడం వలన మోక్షం సిద్ధిస్తుందని నమ్మేవారు. ఇహపర సుఖాలను పొందాలంటే ఈ దిగువ ఉదహరించిన కర్మలను ఆచరించాలని వారి విశ్వాసం : 1) మనిషి పుర్రెలో తినడం, 2) మృత కళేబరాన్ని దహించిగా వచ్చిన భస్మం శరీరానికి పులుముకోవడం, 3) ఆ భస్మాన్ని తినడం, 4) చేతిలో ఎల్లప్పుడు దండాన్ని ధరించడం, 5) నిరంతరం ఒక పాత్రనిండా మద్యాన్ని నిలువ వుంచుకోవడం,

6) అందులో భగవంతున్ని ఊహించుకొని, ధ్యానించి త్రాగడం. ఇంకనూ ఈ కాపాలికులలో మహావ్రతులనుబడువారు పంచమకారము (మద్య, మాంస, మత్స్య, ముద్ర, మైథునము) ల యందు బడి అనేక విపరీత పనులు చేసెడివారు. ఒక్కొక్కసారి మానవ బలులు కూడా చేసేవారు. ఇదంతా అష్టసిద్ధుల కోసం మరియు పార్వతీ దేవిలాంటి వనిత పొందుకోసం చేసేవారు. వీరి యొక్క భయంకరమైన, దుష్టమైన, నీచమైన ఆచారాలవల్ల ఆనాటి ప్రజలు వీరిని అసహ్యించుకొన్నారే తప్ప, సంఘములోకి వీరిని ఆహ్వానించలేదు. అందువల్ల వీరి మతము సమాజములో మనలేక పోయెను.

ఈ విధంగా శైవమతమునందు అనేక దురాచారములు పెచ్చుపెరిగి వేమనయోగి కాలమునాటికి తారాస్థాయికి చేరుకొనెను. అందువల్లనే శైవమతమును కూడా వేమన యోగి ఖండించివేసెను.

శైవమునందలి తాత్విక చింతన వేమన వివరించిన ఎరుక తత్వమునందే ఇమిడిపోవునుగాని, వేమన బోధించిన ఆకృతి నిరాకృతులుగాని, ఇహపరములుగాని, దృక్- దృశ్య - ద్రష్టలుగాని, దేహాదేహములుగాని అచలపరిపూర్ణబ్రహ్మము శైవతత్వమునకు అందకనే యున్నదని గుర్తించవలెను. కనుకనే 'మతములందు ముక్తి వెదకిన లేదయా' అని వేమన వాక్యము.

**శాక్తేయ మతము :**

శాక్తేయులు సృష్టికి మూలం శక్తి స్వరూపిణి అయిన త్రిపురసుందరి అనియు, ఆమెను ఆరాధించిన వారికి మోక్షము సిద్ధిస్తుందని నమ్మేవారు. ఈ ఆరాధన పద్ధతి పరమనీచమైనది. సజీవులైన నవకన్యలను తొమ్మిది కులాలవారి నుండి తీసికొనివచ్చి, వారిని వివస్త్రలను చేసి, వారి యోనులను పూజించి, పూజానంతరము మద్యము, మాంసము, మత్స్యములను నైవేద్యముగా వారికిచ్చి, వారు భుజించిన పిదప భుక్త శేషములను మహాప్రసాదంగా స్వీకరించి, ఆ కన్యలతో సంభోగించేవారు శాక్తేయులు. మకార పంచకమనబడు మధు, మాంస, మత్స్య, మంత్ర, మైథునములనేవి వీరి పూజా పద్ధతిలో ముఖ్యము. కన్యలు లభించనిచో, భూర్జర పత్రము మీదనో, పట్టుగుడ్డమీదనో, లేదా బంగారు రేకు మీదనో తొమ్మిది కన్యల యోనుల ఆకారాలను చిత్రించి, అందులో మధ్యనున్న యోనిని మంత్రాదులతో పూజించేవారు. మొత్తం ఈ చక్రమునకు శ్రీ చక్రమని పేరు పెట్టినారు.

**గాణాపత్యము :** శాక్తేయులవలెనె గాణాపత్యులకు కుల విచక్షణలేదు. వివాహమైన వారు, కానివారు అని విచక్షణలేక స్త్రీ పురుషులు విచ్చలవిడిగా ప్రవర్తించేవారు. మద్యమాంసాదుల నిషేధంలేదు. వీరి దైవము గణపతి.

**సౌర మతము :** సౌర మతము వారికి జగచ్చక్షువైన సూర్యుడే దైవము.

పైన వివరించిన మతములలో 1) శైవము, 2) వైష్ణవము, 3) శాక్తేయము, 4) గాణాపత్యము, 5) సౌరము, 6) కాపాలికము ఈ ఆరింటిని కలిపి షణ్మతములని అంటారు. ఈ షణ్మతాలవల్లనూ, మరియు అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత మతముల వల్లనూ ఆత్మ స్వరూపము తెలియబడదని, జన్మ భ్రాంతినుండి ముక్తి పొందలేరని వేమన ఈ క్రింది విధంగా పలు పద్యాలలో చెప్పియున్నాడు. అంతియేగాక వివిధ మతాలలో ప్రబలిన దురాచారాలను వేమనయోగి ఖండించాడు.

ఆ॥ చదువు జదువనేల సన్యాసిగానేల ?
షణ్మతముల జిక్కి చావనేల
యతని భజన చేసి యాత్మలో దెలియుడి
విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఆ॥ శైవ వైష్ణవాది షణ్మతంబుల కెల్ల
దేవుడొక్కడనుచు దెలియలేరు
తమకు భేదమయిన తత్వంబు భేదమా ?
విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఆ॥ విష్ణుభక్తు లెల్ల వెలబూది పాలైరి
వాదమేల మత విభేదమేల ?
తెలియ లింగధరులు తిరుమంటి పాలైరి
విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఆ॥ అరుత లింగముంచి యదియునుజాలక
పర్వతమునకేగు పామరుండు
ముక్తిగాన నగునె మూఢాత్ముడగు గాక
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ మతము లెన్నియైన సతముగా నుండవు
సతముగాను యుండు జగతి నొకటి
యంత మతము విడిచి నా బ్రహ్మమరయుట
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ భూతి దేహమందు బూసితే నాయనా ?
నిష్ఠ శివుని యందు నిలువ వలయు
గాక భస్మమందు గాడిదె పొర్లదా ?
విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఆ॥ కరక కాయలు తిని కాషాయ వస్త్రముల్
బోడి నెత్తి గల్గి బొరయు చుండ్రు
తలలు బోడలైన తలపులు బోడలా ?
విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఆ॥ పుస్తుకములు జడలు పులితోలు బెత్తంబు
కక్షపాలు పదిలక్షలైన
మోత చేటుగాని మోక్షంబు లేదయా
విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఆ॥ దర్శనంబులందు ధర షణ్మతములందు
వర్ణకాశ్రమముల వదలకెపుడు
తిరుగుచుండువాడు ధరలోన నంధుండు
విశ్వదాభిరామ వినుర వేమ ॥

కనుక వేమన యోగి బోధించిన వేదాంతము షణ్మతాలకు, షట్‌దర్శనాలకు, ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది మతములకు అతీతమైనదని తెలియబడుచున్నది. కావున వేమనయోగి వేదాంతమును స్పష్టముగా ప్రకటపరచుటే ఈ గ్రంథము యొక్క లక్ష్యము.

## వేమనయోగి జీవితము :

నిజానికి వేమన యోగి జీవిత చరిత్ర స్పష్టముగా ఎవరికీ తెలియుట లేదు. మనకు ఇప్పుడు దొరుకుతున్న వేమన వాడుక కథలలోని వాడే. ఆ వాడుక కథలు కూడా వేమన పద్యాలలోని హేమతారక విద్య, వేశ్యల ప్రసక్తిని బట్టి పుట్టాయి తప్ప, వాటిలో ఇసుమంతైనా నిజం లేదు. ఈ కథల్లోని వేమన అతీంద్రియ శక్తులతో అద్భుతాలను చూపే మహిమాన్వితుడు. ఈ కథలే దేశమంతటా ప్రచారంలో వున్నాయి. ఈ కథల ఆధారంగానే కావ్యాలు, నాటకాలు, సినిమాలు కూడా వచ్చాయి.

వేమన యోగి యొక్క భౌతిక జీవితము గూర్చి కొంచమైననూ ఊహించటానికి ఆతని పద్యాలే వెన్నెముక. ఏ కవిత్వమైనా కొంతవరకు ఆ కవి యొక్క ఆత్మకథ లాంటిదే. కవి యొక్క అలవాట్లు, ఇష్టాయిష్టాలు, పుట్టిపెరిగిన పరిస్థితులు, కుటుంబ వాతావరణము మరియు ఆనాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ, మత విధానాలు మొదలగు అంశాలు ఆతని కవనములో తప్పకుండా కనిపించడానికి వీలుంది. అందుచేత వేమన పద్యాలను ఆధారంగా తీసికొని ప్రచారంలో యున్న కథలలోని అసంగతమైన అంశాలను వడబోసి వేమన యోగి జీవితాన్ని ఈ క్రింది విధంగా ఊహించవచ్చును.

వేమన క్రీ.శ.15వ శతాబ్దములో ఆంధ్రప్రదేశ్ నందలి రాయలసీమలోని ఒకానొక పల్లెటూరులో వ్యవసాయముచేయు కాపు కుటుంబములో జన్మించాడు. చిన్నప్పటి నుండే వేమన కుటుంబంలో తెలివైనవాడుగా పేరు తెచ్చుకోసాగాడు. తల్లిదండ్రులు ఆచరించు మతాచారాల గూర్చి హేతు వాద దృక్పథముతో వాదించేవాడు. ప్రతిదానిని పరిశోధించక, గుడ్డిగా నమ్మేవాడు కాడు. ఇరుగుపొరుగు వున్న మత వాదులతో కూడా స్నేహించి, వారి మతరహస్యాలను తెలిసికొనుటకు ప్రయత్నించెను. కాని వేమన హేతువాదమునకు వారు సమాధానాలు చెప్పలేకపోయారు. ఈ లోపు యుక్త వయస్సు రాగానే తల్లిదండ్రులు ఆతనికి వివాహం చేశారు. వేమన గృహస్థుడై సంసారిక జీవనం సాగిస్తూనే పరమార్థ సాధనమును వదలలేదు. అనేక గురువులను

చేరి, ఆత్మ తత్వము తెలియుటకు ప్రయత్నించినాడు. కాని వారు చేయు బోధలయందు సత్యము లేదని తొందరలోనే గ్రహించినాడు. ఇక లాభము లేదని వేద శాస్త్రములను చదువనారంభించెను. కాని ఆ శాస్త్రముల వల్ల కూడా సత్యము స్పష్టముగా తెలియుటలేదని తపన పడుచుండెను. కొన్నాళ్లు ఆసనాది విధులను నేర్చి యోగాభ్యాసము చేసి యోగ నిద్రలో కూడా వుండివున్నాడు. అయిననూ సత్యమును గాంచలేక పోయెను. ధనమే అన్నింటికి మూలమని తలంచి, బంగారమును తయారు చేయ కొన్నాళ్ళు ప్రయత్నించి విఫలుడై విరమించుకొనెను. చివరకు శ్రమ శక్తిలోనే స్వర్ణ యోగమున్నదని గ్రహించెను. శైవాది షణ్మతములను, అద్వైతాది మతములను కూడా శోధించెను, కాని పరిపూర్ణ తత్వమును గాంచకపోయెను. ఇలా సత్యాన్వేషణ చేయు సమయంలో వేమన 'లంభికా శివయోగి' అను గురువును గూర్చి ఎవరి ద్వారానో తెలిసికొనెను. తెలిసికొన్నదే తడవుగా ఆతనిని సందర్శించి, కొన్ని సంవత్సరాల నుండి వేధించుచున్న ప్రశ్నలను అడిగి, సమాధానాలను తెలిసికొని, తృప్తి చెంది, ఈతడే నిజమైన గురువని గుర్తించి వెంటనే శిష్యుడై, 'అచల పరిపూర్ణ రాజయోగము' (అచలయోగము)ను సంపూర్ణముగా గ్రహించెను. ఇంతలో వేమనయోగి సంతానము పెద్దవారై ఎవరికాళ్లపై వారు నిలబడి యుండవచ్చును. ఇక వేమన ఖాళీగాయుండుటకు ఇష్టము లేక, తాను తన గురుదేవుని నుండి గ్రహించిన 'అచల యోగము' ను సత్యమును తెలిసికొనగోరు లోకులందరకు అందించాలనే తపనతో దక్షిణ భారతదేశంలో ఉరూరా తిరుగుచు పద్యాల రూపములో తనువు చాలించే వరకు ప్రచారము చేయసాగెను. ఇలా ఆనాటి దుష్ట మతాచారాలను, సాంఘిక దురాచారాలను ఎండగట్టుచు, వేదాంత సారమగు అచలతత్వమును అతి సామాన్యమానవునికి కూడా అందుబాటులో యుండేటట్లు తన పద్యాలలో బోధించిన అచలర్షి వేమన యోగి ఆంధ్రదేశ చరిత్రలో ఒక వెలుగు వెలిగిన ఆణిముత్యమని చెప్పనొప్పును.

ఇట్లు

డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధరస్వామి

హైదరాబాద్,
క్రీ.శ. 31 అక్టోబర్ 2000.

# గ్రంథ ప్రచురణ ద్రవ్యదాత సంగ్రహ చరిత్ర

స్వస్తి శ్రీ ప్రభవ నామ సం॥ (క్రీ.శ. **1927**) ఆషాఢ శుద్ధ దశమి రోజున మెదక్ జిల్లా, సిద్దిపేట తాలుకా, పాలమాకుల గ్రామ కాపురస్తులగు శ్రీ బెజుగం నర్సయ్య మరియు శ్రీమతి సత్తెమ్మ యను పుణ్యదంపతుల గర్భవాసమున శ్రీ బెజుగం చంద్రయ్య గారు జన్మించిరి. వీరికి ఒక అన్న మరియు ఇరువురు అక్కలు, ఒక చెల్లె కలరు. అన్నయ్య బెజుగం నారాయణ, పెద్ద అక్కయ్య గంపా వీరమ్మ, రెండవ అక్కయ్య బుక్కా రాజమ్మ, చెల్లె జిల్లా వజ్రమ్మ.

వీరు స్వగ్రామమైన పాలమాకులలో ప్రాథమిక విద్యను అభ్యసించిరి. జీవనోపాధి కొరకు అమ్మా నాన్నలతో వీరు సిద్దిపేటకు **13** సం॥ల వయస్సులో వచ్చిరి. అచట సుమారు ఒక సంవత్సరము వుండి, అచటి నుండి వరంగల్ జిల్లాలోని కట్కూరు అను గ్రామమునకు తరలి వచ్చిరి. అచట కొంత కాలముండి, అచటి నుండి వీరు వ్యాపార వృత్తి కొరకు బొంబాయికి **14** సంవత్సరముల ప్రాయములో ఒంటరిగా వెళ్లిరి. అచట వీరు కల్యాణ్ సమీపమున అమర్‌నాథ్‌లోని మిలిటరి క్యాంప్ వద్ద లేబర్ కాలనీలో చాయ హోటల్‌ను ప్రారంభించిరి. అచట సుమారు **6**సం॥లు అదే వృత్తి యందు వుండిరి. **20** సం॥ల వయస్సులో కట్కూరు గ్రామమునకు తిరిగి వచ్చిరి.

ఇక కట్కూరు గ్రామములో తల్లిదండ్రులతో కలిసి కిరాణా దుకాణంను నడుపుచుండిరి. **21** సం॥ల వయస్సులో 'నాగలక్ష్మి' యను కన్యారత్నముతో వీరికి వివాహము జరిగెను. ఆ తర్వాత వీరు వ్యవసాయమును మరొక ప్రక్కన చేయిస్తూ అన్యోన్య కాపురమును కట్కూరుయందే చేయుచుండిరి. పిల్లలు పుట్టి బ్రతుకనందున, వీరు ఒక అమ్మాయిని పెంచుకొనిరి. వీరు ఆ అమ్మాయికి 'లక్ష్మి' యని నామమిడిరి. వీరు ఆ తర్వాత కొంత కాలమునకు బట్టల దుకాణంను కూడా పెట్టి వ్యాపారమును చేసిరి. ఇలా **4** సం॥లు ఔరంగబాద్ బట్టల వ్యాపారము శ్రీ వంగ మల్లారెడ్డి చొరవతో చేయగలిగిరి.

కాలక్రమములో వీరికి ముగ్గురు పుత్రికలు పుట్టిరి. మొదటి కూతురు అంజమ్మ, రెండవ కూతురు మల్లికాంబ, మూడవ కూతురు విజయలక్ష్మి. కుటుంబముతో వీరు హాయిగా కాలము గడుపుతూ యుండిరి. వ్యవసాయ వ్యాపారాదులను నిర్వహించుచూనే వీరు రాజకీయమునందు కూడా ప్రవేశించి ఉపసర్పంచి, సర్పంచి పదవులను నిర్వహించివుండిరి. నలుగురి కుమార్తెల వివాహములను కూడా వైభవంగా కట్కూరు గ్రామమునందే జరిపించెను. మొదటి అల్లుడు జిల్లా మల్లేశం, రెండవ అల్లుడు గంపా సీతా రాములు, మూడవ అల్లుడు మహంకాళి లక్ష్మి నర్సయ్య, నాలుగవ అల్లుడు జిల్లా కృష్ణ మూర్తి.

వీరికి చిన్ననాటి నుండి సజ్జనుల సాంగత్యమునందు మక్కువ ఎక్కువ. ఆ గ్రామమునందే శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయక ప్రబోధాధికారులగు శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగీశ్వరులవారు అచల వేదాంత సభలను, సమావేశములను శ్రీ పోలోజు నర్సయ్య గారి ఇంటిలో నిర్వహించుచుండిరి. క్రీ.శ. **1974** సం॥లో వీరు శ్రీవారి శిష్యుల ద్వారా శ్రీవారి పరిచయ భాగ్యమునకు నోచుకొనిరి. అదే

సమయములో శ్రీవారి వద్ద ధర్మోపదేశమును గైకొనిరి. పిదప తారక, సాంఖ్య, అమనస్క, మహావాక్యముల విచారణ శ్రీవారి వద్ద క్రమక్రమముగ అభ్యసించి, పరిపూర్ణ ప్రబోధను గ్రహించిరి. క్రీ.శ. 1976 సం॥లో బచ్చన్నపేటలో ఆశ్రమ నిర్మాణమునకు భక్తాదులందరు ప్రయత్నించుచుండిరి. ప్రముఖ శిష్యుల గుంపుతో వీరు కూడా ముఖ్యపాత్ర వహించిరి. శ్రీ ఎద్దు నర్సయ్య, శ్రీ రాపెల్లి రామచంద్రము, శ్రీ పి. బ్రహ్మానందము, శ్రీ ఆకుల సిద్ధిలింగము, శ్రీ తంగెళ్ళపల్లి శ్రీహరి, శ్రీ బెజుగం చంద్రయ్య, శ్రీ పోతగోని రామనర్సయ్య, శ్రీ అడపా వెంకయ్య, శ్రీ బండారు వెంకమ్మ మొదలగువారు శ్రీవారి ప్రేరేపణచే ఆశ్రమ స్థాపనకు ఎంతగానో కృషి చేసిరి. ముఖ్యముగా శ్రీ ఎద్దు నర్సయ్య, శ్రీ రాపెల్లి రామచంద్రము, శ్రీ బెజుగం చంద్రయ్య, శ్రీ తంగెళ్ళపల్లి శ్రీహరి గారలు విరాళాల సేకరణకు గ్రామగ్రామాలు తిరిగియుండిరి. శ్రీ చంద్రయ్య గారు తన వంతు ధన సహాయమును కూడా అందించియుండిరి.

కాలక్రమములో వీరు మళ్ళీ ఒకసారి స్థల మార్పుకు ఉపక్రమించిరి. క్రీ.శ. 1982 లో కట్కూరు గ్రామమున వున్న ఆస్తులను అమ్ముకొని, జనగామ పట్టణంకు వ్యాపార నిమిత్తము వెళ్ళిరి. అచట శ్రీ రాజరాజేశ్వర కమీషన్ (అడ్తి) దుకాణంను ప్రారంభించిరి. అంచెలంచెలుగా శ్రీవారి కృపతో వ్యాపారమునందు అభివృద్ధిగాంచి ఉన్నత స్థితికి అనతికాలములోనే చేరుకొనగలిగిరి.

వీరికి దానధర్మములయందు ప్రీతి ఎక్కువ. వీరు నిత్యాన్నదాన పథకములలో సభ్యునిగా ఎన్నింటియందునో చేరియుండిరి. ఇక శ్రీ శివరామదీక్షితీయ అచల గురూపపీఠ రాజయోగాశ్రమము, బచ్చన్నపేట యందు స్నానపు గదుల మరియు మరుగు దొడ్డిల నిర్మాణమునందు పాలు పంచుకొనిరి. అంతియేగాక క్రీ.శ. 2000 సం॥న ఇదే ఆశ్రమములోని పూజా మందిరము ముందు మండప నిర్మాణమును, రెండు దుకాణ (షెటర్‌లు) నిర్మాణమును ఉత్సాహముతో చేయించి గురు ఋణము దీర్చుకొని ధన్యులైరి. ఇక లోక సేవ కొరకు 'రాజయోగి' పేరనొక అద్భుతమైన కళ్యాణమండపమును లక్ష్మీనారాయణ దేవాలయ ఆవరణలో, గ్రేన్ మార్కెట్, జనగామ పట్టణము, వరంగల్ జిల్లా యందు నిర్మించి ఉదాత్తమైన దాతగా ఖ్యాతి వహించిరి. అచలపరిపూర్ణ రాజయోగ ప్రచారమునకై తన వంతు ధర్మ నిర్వహణగా ఈ గ్రంథ రాజమును ముద్రించుటకు ద్రవ్య సహాయమును చేసిరి.

అంతియేగాక తాను తరించి ఇతరులను తరింపజేయుటకు, శ్రీవారి ఆజ్ఞానుసారము ప్రబోధాధికారమును శ్రీ దయానంద పొన్నాల సాందీపిని రాజయోగీశ్వరులవారి కరుణచే శ్రీవారి సమక్షమునందే ఈశ్వర నామ సంవత్సర ఆషాఢ శుద్ధ పౌర్ణమి (క్రీ.శ. 21-7-1997) రోజున పొందియుండిరి. వీరికి 'చిన్మయానంద' యను బిరుదును శ్రీవారు అనుగ్రహించిరి.

అప్పటి నుండి వీరు గురువుగారి ఆజ్ఞ ప్రకారము విచార ఆచార ప్రచారములందు లక్ష్యమునుంచి జీవితమును దివ్యమైన మార్గములో గడుపుచున్నారు. శ్రీవారి యొక్క కరుణాకటాక్షముచే వీరి కుటుంబమునకు సకల శుభములు కలుగుగాక!

ఇట్లు

డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధరస్వామి

# వేమన స్తుతి

వేమనంటే ఏమిటో?
వేదమంటే ఏమిటో?
వేడ్క తోడుత చెప్పనా?
వివరమంతయు చెప్పనా? ( 1 )

వేమనంటే ఋషియనీ
వేమనంటే యోగనీ
వేమనే నవ కవియనీ
వేమనే సద్గురువనీ (2)

వేమనే కరుణించగా
వేకువే ఉదయించగా
వేడ్క తోడుత చెప్పనా?
వివరమంతయు చెప్పనా? (3)

అతని తత్వమరయాలని
అతని శరణు పొందాలని
అతని చరణ ధూళినైన
నాతలను ధరించాలని (4)

నా హృదయం చెప్పతుంది
నా గాత్రం నడుస్తుంది
నా కరంబు కదుల్తుంది
నా నాలన్నియు నీకై (5)

పలుక వేల వేమనయ్య
పలుకు మీరి వున్నవయ్య
పలుక కుంటె నేలనయ్య
పథము నీది తెలియునయ్య (6)

అన్నియు ఎరిగియు నీవే
అన్నియు మీరియు నీవే
అన్నియు బాసియు నీవే
అన్నియు గాకను నీవే (7)

ఉన్నది అచలంబేనని
ఉన్నావో మౌనిలాగ
ఉన్నా యిక లేనట్టే
ఉన్నా యిక నీ వెంటా (8)

వేమన్నా నీ పద్యం
ఏమన్నా నా నాలుక
ఏమారక నుడువుతుంది
ఏమందునో విచిత్రం (9)

నీ పద్యమె నా ప్రాణం
నీ పద్యమె నా గానం
నీ పద్యమె నా గమనం
నీ పద్యమె నా కవనం (10)

ఆట వెలదులు చెప్పావు
ఆట జీవిత మన్నావు
ఆట ఆడక ఆడావు
ఆట చేటును విడిచావు (11)

నీ పద్యాలకు అర్థం
నా ప్రజలకు తెలియాలని
నా కలమ్ము కదులుతుంది
నీ గళముతో ఏకమై (12)

అచల బోధ నీచమనుట
అభాగ్యుల నోటి దురద
అచల మనగ అర్థమేదొ?
అచల యోగి జేరి కనుము (13)

మతములన్నియు ఏలరా?
మర్మమొక్కటి తెలియరా?
మర్మమెరుగక పోతిరా?
మాయబంధం తిప్పరా! (14)

సద్గురువు మద్గురువగు
సంగయాఖ్య సత్కృపచే
సద్భక్తిచె వేమన్నకు
సవ్యాఖ్యానము వ్రాసెద (15)

ప్రజలార చదవండి మరి
పూర్ణగురుని చేరండి మరి
పరమార్థం వినండి మరి
పరిపూర్ణం కనండి మరి (16)

- వ్యాఖ్యాత

O.K.
P.

ఒకటవ అధ్యాయం

## వేమన - అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతం - ఒక పరిశీలన

వేమన పేరు వినని తెలుగు ప్రజలు ప్రపంచంలోనే అరుదు. నేటికినీ వేమన పద్యాలు ఏదో ఒక సమయాన తెలుగు వారి నాలుకలపై నాట్యమాడుచూనే వున్నాయి. వుండగలవు. వేమన పద్యాల యందు వున్న వాడి, వేడి వాటిని రక్షిస్తున్నాయి. వేమన కావ్యాలు వ్రాయని కవి, సాంప్రదాయక వాదులచే కవి అనిపించుకొనని మహాకవి. సమాజంలో వున్న మూఢ నమ్మకాలపై, మూఢాచారాలపై, కుల వ్యవస్థపై, మత సిద్ధాంతాలపై, ఒక్కటేమిటి, ప్రతీ విషయంపై తన ఆటవెలదులను ఈటెలుగా విసరిన మహా ఋషి. ఆతడు శోధించక విడచిన మతవాదాలు, తాత్విక విషయాలు లేవు. ఉన్నదున్నట్లు, సరళమైన మరియు మృదు మధురమైన భాషలో ప్రతి విషయాన్ని విప్పి చెప్పుటలో వేమన తనకు తానే సాటి. అన్ని వేళల, అన్ని సందర్భాలలో సమదర్శనాన్ని పాటించిన మహాయోగి. తెలుగు సాహిత్యం నుండి పాశ్చాత్య భాషలలోకి మొట్ట మొదట అనువాదం చేయబడినవి వేమన పద్యాలే. ఈ మహా కవి యొక్క పద్యాలు ఫ్రెంఛ్, లాటిన్, ఆంగ్ల, అరవ, కన్నడ, ఉర్దూ, హిందీ, సంస్కృత, మళయాల, మరాఠి మొదలగు భాషలలోకి అనువదించబడినాయి. సాంస్కృతిక విద్యా సంబంధ శాఖ (యునెస్కో) ప్రపంచ భాషలలో గల మేటి కవులలో, ఒక్కొక్కరిని ఎన్నుకొని, వారిని గూర్చి నిపుణుల చేత వ్రాయించి, ప్రపంచ భాషలలోకి అనువదింప జేసి ప్రపంచ సమిష్ఠి విజ్ఞానాన్ని పంచిపెట్టుచున్నది. ఈ ప్రక్రియలో తెలుగుకు వేమనను ఎన్నుకొన్నది. వేమన పద్యాలను కాలిఫోర్నియా యూనివర్సిటీలో పనిచేయుచున్న ప్రొ॥ జె. ఎస్. ఆర్. ఎల్.నారాయణమూర్తి గారు మరొక ఆంగ్ల భాషా ప్రవీణుని సహాయంతో ఆంగ్లంలోకి అనువాదం చేశారు. ఈ అనువాదం నుండే ఇతర ప్రపంచ భాషల్లోకి అవి అనువదించబడుచున్నవి. మరి యే ఇతర తెలుగుకవి రచనలు ఇంతగా ఇతర భాషల్లోకి అనువదించబడలేదు. అంతియేగాక ఈ కంప్యూటర్ యుగంలో వేమన పద్యాలు ప్రపంచ ప్రజలందరికి అందుబాటులో యుండేటట్లు కంప్యూటర్ వెబ్‌సైట్లలోకూడా ఉంచబడినాయి. కనుక ఇంటర్‌నెట్ ద్వారా ప్రపంచంలో ఎచ్చట నుండి అయిననూ వేమన పద్యాలను చదువుకోవచ్చును. దీనిని బట్టి వేమన విశిష్టతను ఊహించవచ్చును.

వేమన తర్వాత వేమన పద్యాలు ప్రజల నాలుకల్లో మాత్రమే వుండి పోయాయి. హృదయాలు మాత్రం మళ్ళీ మూఢాచారాల ముసుగులో పడి, వేమనను మరచిపోయాయి. సాంప్రదాయక

వాదులు, మతవాదులు, అగ్రవర్ణాల వారు వేమన పేరును అణచి పెట్టారు. ఆ సమయంలో వేమన ప్రసిద్ధిని యావత్ ప్రపంచానికి తెలియజేసినవారు పాశ్చాత్యులు. ఎందరో విదేశీయులు వేమన పద్యాలను వేనోళ్ళ కొనియాడారు. వారి వారి భాషల్లోకి అనువదించుకొన్నారు. వారిలో అతిముఖ్యుడు చార్లెస్ ఫిలిఫ్ బ్రౌన్. ఈయన తెలుగు భాషకు చేసిన సేవలు కొనియాడ తగినవి. వేమన గూర్చి బ్రౌన్ **18** సం॥లు కృషి చేశాడు. వేమన పద్యాల తాళ ప్రతుల సేకరణ కోసం క్రీ.శ. **1836** వరకే దాదాపు **30,000/-** రూపాయలను ఖర్చు చేశాడు. ఇందులో కొంత సొంత ధనముకాగా మిగతాది విరాళాల సేకరణ. అంతేగాక ఈ లోక కవి పద్యాలను కొన్ని వందలను లాటిన్ మరియు ఇంగ్లీషులోకి అనువదించి ప్రచురించినాడు. పద్యాలపై పరిశోధక వ్యాసాలు కూడా వ్రాశాడు. దీనితో వేమన వెలుగులోకి వచ్చాడు.

వేమన ఎవరు? వేమన చరిత్ర ఏమిటి? అని ప్రశ్నించుకొంటే, నిజానికి వేమన చరిత్ర ఎవరికీ స్పష్టంగా తెలియుట లేదు. వేమన యోగి కాలము, ప్రాంతము, మరియు జీవిత చరిత్రకు వేమన పద్యాలపై ఆధారపడటం తప్ప వేరే మార్గం లేదు. నా పరిశోధనల వల్ల తేలిన సారాంశం ఏమిటంటే వేమన రాయలసీమ ప్రాంతమునకు చెంది వుండవచ్చు మరియు క్రీ.శ. **15**వ శతాబ్దంలో జీవించి వుండవచ్చు. వేమన పోతులూరి వీరబ్రహ్మం కంటే సుమారు మూడు వందల సంవత్సారాల ముందటి వాడు. వేమన యోగి కాలము, ప్రాంతము, మరియు జీవిత చరిత్ర గూర్చి వివాదగ్రస్తమైన విషయములున్నవి. ప్రస్తుతము అవి అనవసరములు. ఇక వేమన జీవిత చరిత్ర గూర్చి అనేక కట్టు కథలున్నాయి. ఇవన్నీ వేమన పద్యాలను బట్టి ఊహించినవే. ఉదాహరణకు వేమన యోగి దిగంబరునిగా తిరిగాడని నగ్న చిత్రమును ఊహించి వేశారు. ఇది ఎంతవరకు నిజం అంటే ఈ క్రింది పద్యాన్ని చూపించారు.

**ఆ॥ తల్లి గర్భమందు దా బుట్టినప్పుడు**
**మొదల బట్ట లేదు తుదను లేదు**
**నడుమ బట్ట గట్ట నగుబాటు గాదటో?**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

ఏ పద్యానికైనా స్థాన, స్వరూప, స్వభావాలు తెలియక పోయినచో, అది ప్రమాద హేతువు కాగలదు. వేమన యోగి ప్రాకృతము, పారమార్థికము రెండింటికి, ఒకే నాణెమునకు ఇరువైపుల వలె ప్రాముఖ్యత నిచ్చి నీతి, భక్తి, యోగ, వైరాగ్య, జ్ఞాన సంబంధములైన దాదాపు **5000** కంటె

ఎక్కువ పద్యాలను తన కంఠం నుండి పలికించాడు. వీటిలో కొన్ని వందల పద్యాలను మతఛాందసులు తగులబెట్టారు. ఇంకా కాలగర్భంలో కొన్ని వేల పద్యాలు కలిసిపోగా, నేటికి దాదాపు **4000** పద్యాలు దొరుకుచున్నవి. వీటిలో ప్రక్షిప్తములనేకంగా వున్నాయి. వాటిని వేరిపారేయాల్సిన అవసరం వుంది. వేమన పద్యాలలో ఏ పద్యము దేనికి సంబంధించినదో పండితులమనుకొనువారికే కొన్ని సందర్భాలలో అంతుపట్టుటలేదు. తత్వ నిర్ణయంకు సంబంధించిన మార్మిక పద్యాలలో కూడా ఇంతే సంగతి. నిజానికి వేమన దిగంబరంగా వుండనే లేదు. వున్నా అది యోగాభ్యాసం చేసినప్పుడు యోగనిద్రలో వస్త్రాలు పడిపోయి వుండవచ్చు. కాని సహజంగా వస్త్రధారిగానే వున్నాడు. భగవద్గీతలో చెప్పిన విధంగా ఈ స్థూల శరీరమే వస్త్రము(బట్ట).

'శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ ...... ॥' అను న్యాయమున తల్లి గర్భంలో తాను చేరకముందు మరియు మరణించిన తర్వాత, ఈ స్థూల శరీరం(బట్ట) ఉండుటలేదు. మధ్యలో ఈ శరీరాలను దేహి తగిలించుకొంటుంది. కనుక ఈ జన్మలు రాకుండ చేసుకోవడమే బట్ట కట్ట కూడదనడం.

ఎవరైనా గొప్పవారలతోగాని, ధనవంతులతోగాని, తమకు ఏ సంబంధం లేకున్ననూ వారిని తమ కులం వారిగానో, బంధువులుగానో, స్నేహితులుగానో అభివర్ణించుకోవడం మానవులకు సహజమే. అట్లే వేమన్ననూ వివిధ కులాలవారు, మతాలవారు తమవాడిగా అభివర్ణించుకున్నారు. నిజానికి వేమన కులవ్యవస్థలను, మతవ్యవస్థలను ఈసడించుకున్నాడు. అయినా ఋషియైన వేమన మూలాన్ని వెతకటం భావ్యం కాదేమో? అయిననూ, వేమన పద్యాలలో కొన్నింటిని తీసుకొని ఆతని కులాన్ని, కుటుంబాన్ని, పరిసరాల్ని, కాలాన్ని వంగూరి సుబ్బారావు, శేషాద్రి రమణకవులు, వేదం వేంకటకృష్ణ శర్మ, వేటూరి ప్రభాకర శాస్త్రి, బండారు తమ్మయ్య, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, నార్ల, ఆరుద్ర, డా॥ ఎన్. గోపి మొదలగు ప్రముఖ పరిశోధకులు పరిశీలించారు. వాటి సారాంశం: వేమన సామాన్య రైతు కుటుంబములో పుట్టి వుండవచ్చును. ఆతడు గృహస్థుడే. ఆతడు కాపు కులానికి చెందిన వాడై వుండి వుంటాడు. ఆ కాపులకే రెడ్డి అను బిరుదము కలదు. వేమన యోగి ఆంధ్రదేశం అంతటా తిరిగి తన సిద్ధాంతమును వ్యాప్తి చేసి వుండవచ్చును. కాని ఆతని స్వగ్రామం మాత్రం ఖచ్చితంగా తెలియుట లేదు.

విలియం హోవర్డ్ క్యాంబెల్(క్రీ.శ.1910) తెలుగుభాషను నేర్చి 'లోక కవులలో వేమన ఒక్కడే మహాకవి' అని చాటినాడు. 'వేమన ఇంగ్లండ్ రచయిత విక్లిఫ్ అంతటివాడు' అని అభిప్రాయపడినాడు. కాని కొందరు పరిశోధకులు వేమన కవి కాడు అని అభిప్రాయపడినారు. అయితే కవి యనగా నెవరు? 'క్రాంత దర్శియే' కవి అని వైదిక నిర్వచనం. '' అతీతా నా గత విప్రకృష్ట విషయకం యుగ పద్జ్ఞానం క్రాంత దర్శనం'' అనగా భూత భవిష్యత్ వర్తమానాలను కాలత్రయమందు జరుగువానిని గుర్తెరిగిన త్రికాలజ్ఞుడే 'కవి'. భాష్యకారులందరు 'కవయః క్రాంత దర్శనః' అనియే నిర్వచించిరి. దీనిని అనుసరించినచో పరబ్రహ్మయే మొదటి కవి. తర్వాత శుక్రాదులకును, ఆ తర్వాత త్రికాలజ్ఞులైన మంత్ర ద్రష్టలకు ఈ శబ్దం చెల్లుతుంది. ఆ పిమ్మట ఈ కవి వ్యవహారమునకు గురియైనది వాల్మీకి, వ్యాసులు. లౌకిక సంస్కృతమున వాల్మీకియే ఆదికవి. ఆతని కావ్యమే ఆది కావ్యము. ఈ కవులందరు త్రికాలజ్ఞులైన మహర్షులు. ' నా నృషి కురుతే కావ్యం' అని పై విషయాన్ని లక్షణకారులందరూ పేర్కొన్నారు. కాని నేడు కొలదిగనో, గొప్పగనో పద్యాలను గానీ, గద్యాలను గానీ వ్రాయగల వారినందరినీ 'కవి' శబ్దముతో పిలుచుచున్నారు. అయితే వేమన యోగి కవియా? అవును. ఏలననగా, సృష్టికి మూలకారణమైన పదార్థమేదో, దాని స్థాన స్వరూప స్వభావములను ఉన్నదున్నట్లు తెలుసుకొనిన వారే ఋషులు మరియు తెలుసుకొనిన విధానాన్ని ఆచరణలో పెట్టిన వారే యోగులు. ఈ రెండు విషయాలలో వేమన పూర్ణసిద్ధిని సాధించినవాడు. కావుననే త్రికాలజ్ఞుడు కాగలిగాడు. కవి కాగలిగాడు. కనుకనే వేమన **'ఆదివు కవులవలె నల్పుండు తానేర్చి, చెప్పలేదు గాని తప్పు బట్టు'** అని ఆనాటి, ఆతని ముందరి తరమునాటి బూటకపు కవులను యెద్దేవా చేస్తూ తన మార్గం 'ఆదిమ కవుల' మార్గమని పరోక్షంగా చెప్పుకున్నాడు. అందువల్లే ఆతని పద్యాలు విశ్వజనీన సత్యాలు కాగలిగాయి. ఆ పద్యాలు అన్ని కాలాల, అన్ని దేశాల, అన్ని పరిస్థితుల వారికి విజ్ఞానాన్ని అందించేవిగా వున్నాయి. అందువల్లే ఆ మహాకవి ఏ జాతి, వర్గ, కుల, మతములకు సంబంధించిన వాడు కాదు. ఆతను ప్రజాకవి.

వేమన తన సిద్ధాంతం పట్ల తనకు పుష్కలంగా ఆత్మవిశ్వాసం వున్న వ్యక్తి. తన గురువు ద్వార విని, కని, తాను ఆచరించి చెప్పుచున్నది వేదసారం అన్నాడు గానీ, వేదంలో వున్న దాన్ని తాను మళ్ళీ చెప్పుచున్నట్లుగా చెప్పలేదు. తాను నిజమైన కవియని తెలిసివుండటమే గాక, తన కాలపు బూటకపు కవులతో సమూలంగా విభేదిస్తున్న స్పృహ కూడా వేమనకు వున్నది. అలా లేకుంటే

ఆ॥ తోట కూరకైన దొగ్గలాకుకైన
తవుడుకైన తాలు తప్పకైన
కావ్యములను చెప్ప గాడ్డెలు ఘనులైరి
విశ్వదాభిరామ వినుర వేమ॥

అని చెడ తిట్టేవాడు కాదు. వేమన నిస్వార్థంగా లోక కళ్యాణం కోసం కవనము చేసినాడే గానీ, స్వప్రయోజనాలను ఆశించి చేయలేదు. కనుకనే ఆతడు అసలు సిసలైన ఆధ్యాత్మిక కవి.

వేమన పండితుడు కాడని డా॥ ఎన్. గోపిగారు తమ 'వేమన్నవాదం' అను గ్రంథములో వ్రాశారు. వేమనది సంస్కృతాంధ్ర భాషల్లోని బహుగ్రంథాధ్యయనం వల్ల ఏర్పడిన పాండిత్యము కాదని వారి అభిప్రాయము. అయితే నిజమైన పండితుడెవరు? అని తెలిసికోవాల్సిన అవసరం వుంది.

భగవద్గీత యందు పండితుని గూర్చి శ్రీకృష్ణుడు

'శ్లో॥ విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః॥' అని బోధించాడు.

కనుక ఎవరైతే విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మణుని యందును, ఆవుయందును, ఏనుగుయందును, కుక్క యందును, కుక్కను వండుకొని తిను చండాలుని యందును సమదర్శనము చేయునో, ఆతడే పండితుడు. కనుక వేమనను అసలు సిసలైన 'పండితుడు' గా చెప్పవచ్చును. ఎందుకంటే వేమన సర్వజాతులను, సర్వ జీవులను సమదృష్టితో చూసెను. కనుక వివిధ భాషలయందు ప్రావీణ్యత సంపాదించిననూ, వేదశాస్త్ర పురాణేతిహాసములను ఔపోశనపట్టినను ఈ సమదర్శిత్వము లేనిచో ఆతడు పండితుడనబడడు. ఆతడు వట్టి వాడేనని వేమన ఈ క్రింది విధముగా బోధించియున్నాడు.

ఆ॥ వేదశాస్త్రములను విరివిగా దానేర్చి
వాదమాడు వాడు వట్టివాడు
సారమైన గురుతు సాక్షిగా నెంచడు
విశ్వదాభిరామ వినుర వేమ॥

**కం॥ వేదంబు చదివి విప్రులు**
**వాదంబులు మరచి తమరు వస్తువు గనిరా?**
**మోదంబు నంటి తమలో**
**భేదంబుల నణచువారె పెద్దలు వేమా॥**

కొందరు వేదశాస్త్ర పురాణేతిహాసాది బహుగ్రంథములను చదివి పండితులమని భ్రమ పడుచున్నారు. వారు సారం తెలియకుండా వాటిని గూర్చి చిలుక పలుకులవలె పలుకుతారె తప్ప, వస్తువును తెలిసికొనలేరు. అట్టి వారు వట్టివారేనని వేమన అభిప్రాయము. వేమన చూపులో సర్వ భేదములను అణచు వారే పెద్దలు. వారే నిజమైన పండితులు.

ఇక వేమన కంఠం నుండి వెలువడిన వేలకొలది పద్యాలలో మనకు దొరికిన దాదాపు **4000** పద్యాలు నీతి, యోగ, భక్తి, వైరాగ్య,జ్ఞానసంబంధమై వుండి కలగాపులగంగా వుండుటచే వేమన యోగి తత్వశాస్త్రము ఎవరికీ అంతు బట్టలేదు. పరిపూర్ణ సత్యము తెలియక చెప్పిననూ లేక ఆచరించిననూ నీతి, భక్తి, యోగ, వైరాగ్య, జ్ఞానములు నిష్ఫలములే అగును. కనుక వేమన చెప్పిన తత్వశాస్త్ర నిర్ణయం తెలుసుకోవాల్సిన అవసరం వుంది. అసలు వేమన వేదాలను అంగీకరించాడా? మతాలను అంగీకరించాడా? అయితే ఏ మతానికి చెందినవాడు? అనే ప్రశ్నలు రాగలవు.

వేమన తత్వనిర్ణయ నిర్ధారణకు వేమన పద్యాలే వెన్నెముక.

**ఆ॥ ఉత్తమోత్తముండు తత్వజ్ఞుడిల మీద**
**మహిమ జూపువాడు మధ్యముండు**
**వేషధారి యుదర పోషకుడధముండు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

తత్వనిర్ణయం తెలిసిన వాడే ఉత్తమోత్తముడని వేమన నిర్ణయం. అయితే వేమన ఏ మతానికి చెందిన వాడు? అంటే కొందరు అద్వైతి యని, మరి కొందరు శివాద్వైతి యని, ఇంకొందరు నాస్తికుడని తమ తమ ఇష్టానుసారం వేమనను త్రిప్పుకున్నారు. నిజానికి వేమన మతాలకు అతీతమైనవాడు. మతవాదులకు చిక్కేవాడు కాడు. ఆతడు మతాలకు అందని భావాన్ని బోధించాడు. 'వేదాతీతుడు వేమన సుమ్మీ' అని చెప్పుకున్నాడు వేమన. అందువల్ల వేమన

తత్వము వేదాతీతము. కనుక వేమన చెప్పినది వేదమూ కాదు. వేమన 'వాదుల నోటికి బూడిదె సుమ్మీ' అన్నాడు. కనుక వేమన్నది వాదమూ కాదు. కాని ఆతనిది సంపూర్ణమైన, సమగ్రమైన తత్వ శాస్త్రమని చెప్పనొప్పును. ఆతని తత్వశాస్త్ర సిద్ధాంతమును నిర్ధారణ చేయుటయే ఈ మొదటి అధ్యాయం యొక్క ప్రధాన లక్ష్యము.

సుమారు క్రీ.శ **1700-1750** సం॥ల మధ్య జీవించిన వీరబ్రహ్మం వేమన వలెనే అచల తత్వాన్ని ప్రబోధించాడని తమ 'వేమన' గ్రంథములో శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ వ్రాశారు. వీరబ్రహ్మం ప్రబోధించినది కాలజ్ఞాన తత్వమే కాని అచల తత్వము కాదని వీరబ్రహ్మం యొక్క రచనలను పూర్తిగ చదివిన వారికి తెలియబడును. వేమన గురుశిష్యుల సాంప్రదాయమునకు చెందిన శ్రీ శివరామదీక్షితులు కూడా క్రీ.శ. **1690-1791** సం॥ల మధ్య వంద సంవత్సరాలకు పైగా జీవించాడని చారిత్రక ఆధారాలున్నాయి. శ్రీ శివరామదీక్షితులు ఈ అచల సిద్ధాంతమును క్రీ.శ. **1712** నుండి **1791** సం॥ల కాలములో ఆంధ్రప్రదేశంలో బాగా వ్యాప్తిలోకి తెచ్చారు. కనుక శ్రీ శివరామదీక్షితులు, వీరబ్రహ్మం సమకాలికులు అయివుండవలెను. ఒకవేళ వీరబ్రహ్మం కూడా అచల సిద్ధాంతాన్ని బోధించినట్లయితే, శ్రీ శివరామదీక్షితులు తమ గ్రంథం 'బృహద్వాశిష్ఠము' లో తప్పకుండా వీరబ్రహ్మమును గూర్చి వ్రాసియుండేవారు. కాని వీరబ్రహ్మం గూర్చి ఆ గ్రంథములో ఎక్కడ కూడా ప్రస్తావన రాలేదు. దీనిని బట్టి వీరబ్రహ్మం గారు అచల సిద్ధాంతాన్ని బోధించలేదని అవగతమగుచున్నది. వీరబ్రహ్మం గారు తాను వీరభోగవసంతరాయలుగా మళ్లీ పుట్టుతానని చెప్పినాడు. కనుక ఈతడు అచల సిద్ధాంతి కాడు. ఎందుకనగా అచల సిద్ధాంతుల పరమలక్ష్యము పుట్టుకే లేకుండా చేసుకోవడం. కనుక వీరబ్రహ్మంగారు ముఖ్యంగా కాలజ్ఞాన తత్వమునే చెప్పారని చెప్పవచ్చును. దానికి తోడు హఠయోగసంబంధమైన కొన్ని తత్వాలు వ్రాసియున్నాడు. ఇంకా ఆనాటి ప్రజలకు పట్టిన దురాచారభూతాలను వెడలగొట్టుటకు ప్రయత్నించినాడు. మహిమలు, మహత్తులు చూపించి ప్రజలను ఆకర్షించినాడు. 'మహిమ జూపు వాడు మధ్యముండు' అని చెప్పిన వేమన దృష్టిలో ఇవి మధ్యమమే. డా॥ ఎన్. గోపిగారు కూడా తమ సిద్ధాంత వ్యాసం 'ప్రజా కవి వేమన' లో వీరబ్రహ్మం అచలమతాన్ని బోధించినట్లు వ్రాసుకున్నారు. ఇందులో ఏ మాత్రం నిజంలేదు. చాలామంది చారిత్రక పరిశోధకులు, తత్వశాస్త్ర పరిశోధకులు అచలము - అద్వైతముల మధ్య చాలా తేడా లేదనుకుంటుంటారు. ఇది నిజము కాదు. అచలము - అద్వైతములకు పర్వతానికి ఆవగింజకున్నంత తేడా వుంది. ఇది అది కాదు. అది ఇది కాదు. ఈ విషయం ఆమూలాగ్రముగా అచల సిద్ధాంత గ్రంథాలను, అద్వైత మత గ్రంథాలను చదివిన వారికే తెలియబడును.

కాలక్రమములో వీరబ్రహ్మంగారు విశ్వకర్మల కులగురువుగానే మిగిలిపోయారు. వేమన అట్లుగాక శ్రీ శివరామదీక్షితీయ అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతమునందు నేటికినీ పూజార్హుడై, గురుపరంపర యందు చేరియున్నాడు.

శ్రీ డా॥ ఎన్. గోపి గారి సిద్ధాంత వ్యాసంలో ''వైదిక జ్ఞానం సామాన్య ప్రజల పరం కావలసిన చారిత్ర కావసరం వేమన, వీర బ్రహ్మం వంటి తాత్త్విక కవులు బయలు దేరడానికి కారణమైంది. వీరు జ్ఞానయోగ ప్రధానమైన శంకరాద్వైతాన్ని నిరసించి, భక్తి యోగం ద్వారా తత్త్వ ప్రచారం చేశారు. ఈ ప్రచారానికే 'అచల బోధ', 'అచల మతం' అనే పేర్లు వాడుకలోకి వచ్చాయి. జగత్తు మిథ్య అనీ, బ్రహ్మమే సత్యమనీ - ఇదే అచల వాదం కూడ. కాని జగన్మిథ్య వైపే మొగ్గు ఎక్కువై బ్రహ్మము అడుగున పడిపోయింది. అద్వైత మత ప్రతిపాదకులు నిరసించిన హఠయోగాదులను వీరు ఆదరించినట్టు కనిపిస్తుంది. వీరు గురూపదేశానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. ఇది ఎక్కువగా అబ్రాహ్మణుల్లో వ్యాపించింది. శంకరాద్వైతుల ఆదరాన్ని ఇది ఎప్పుడూ పొందలేదు - ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు 'హిందూమతము-అచలబోధ' అనే వ్యాసంలో దీనిని వివరించారు'' అని అచలబోధ గూర్చి పేర్కొన్నారు. కాని నిజానికి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారికి అచలబోధ గూర్చి వీసమంతైననూ తెలిసినట్టు లేదు. ఎందుకనగా వీరికాలంలో అచలబోధను గూర్చి గ్రంథాలు ప్రచారంలో లేకపోవడం మరియు ఈ బోధ గోప్యాతిగోప్యంగా శిష్యులకే పరిమితమై యుండటం. ఒక సిద్ధాంతం గూర్చి సంపూర్తిగా తెలిసికోకుండా స్వప్రయోజనాల కోసం దానిని గూర్చి వ్రాయడం దేశీయుల కొందరికి పరిపాటి అయిపోయింది. ఇది చాలా తీవ్రమయిన విషయం. ఆతను అచల సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యుడైన శ్రీ శివరామదీక్షితులు రచించిన 'బృహద్వాశిష్ఠము' అనే గ్రంథమును చదివియున్నచో, తన తప్పును దిద్దుకునే వారేమో! అచల బోధను ఇలా దుష్ప్రచారము చేసే వారి నుండి రక్షించుకోవలసిన బాధ్యత అచల గురుసాంప్రదాయకుల భుజస్కంధములపై యున్నదని గుర్తించవలసిన విషయం.

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ కూడా వేమన యొక్క మతాన్ని కనుగొన ప్రయత్నించి విఫలమయ్యారు. ఆరుద్రగారు వేమన 'లోకాయత' మతానికి చెందినవాడని అభిప్రాయపడినారు. 'లోకేషు ఆయతః' అనే వాక్యాన్ని బట్టి లోకాన్ని మాత్రమే ఆలోచన విషయంగా స్వీకరించే శాస్త్రమని లోకాయతకు అర్థం. కాని వేమన లోకమును, లోకములో నెసగి యున్న పరమును,

లోకాతీతమును కూడా విషయంగా తీసుకొని వేలకొలది పద్యాలు చెప్పినాడు. కనుక వేమన 'లోకాయత' మతానికి కూడా చెందినవాడు కాడు.

ఇంకా కొందరు వేమన వేదాలను నిరాకరించాడని చెప్పుచున్నారు. అది కూడా సరియైన అభిప్రాయము కాదు. వేమన తనకు వేదసారమంతా తెలుసునని చెప్పాడు. సారం తెలియకుండా వేదాలను వల్లించే వారిని అధములని చెప్పాడుగానీ, వేదాలు వ్యర్థమని చెప్పలేదు. వేదాల వల్ల సామాన్య మానవుడు సత్యంను తెలిసికోవడం కష్టసాధ్యమైన విషయం. ఎందుకనగా వేదాలు ఒక వ్యక్తి చేత వ్రాయబడలేదు. అవి అనేక ఋషుల ప్రోక్తమని చెప్పవచ్చును. అందువల్ల వేదాలలో శూన్యవాదం మొదలుకొని అనేక వాదాలు కనిపించుచున్నవి. కనుక వేదాలు చదివిన వారికి సత్యం తేలికగా అర్థం కావడం లేదు. అందుకే వేమన వేదాల గూర్చి ఈ క్రింది విధంగా చెప్పి యున్నాడు.

**ఆ॥ వేద విద్య లెల్ల వేశ్యల వంటివి**
**భ్రమల పెట్టి తేట పడగనీవు**
**గుప్త విద్య యొకటె కులకాంత వంటిది**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥**

ఇక మతాలను గూర్చి వేమన ఈ క్రింది విధముగా చెప్పియున్నాడు.

**ఆ॥ మర్మ మెరుగలేక మతముల గల్పించి**
**యుర్వి దుఃఖు లగుదు రొకరి కొకరు**
**గాజు యింట కుక్క కళవళపడు రీతి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

**ఆ॥ చదువు జదువనేల సన్యాసి గానేల?**
**షణ్మతముల జిక్కి చావనేల?**
**యతని భజన జేసి యాత్మలో దెలియుడి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

కనుక అన్ని మతాలను జంకులేక ఖండించిన వేమనను ఒక మత చక్రములో బిగించ పూనుట వెర్రి పనే కాగలదు. మర్మమును తెలిసి కొనక పోవుటచే వివిధ మతాలు పుట్టినవి. మతాలను ఆశ్రయించిన వారికి దుఃఖం తప్పదు. మతాలన్నియు ఎలా వున్నాయి? అంటే గాజులగదిలోకి కుక్క వెళ్ళిచూస్తే దానికి ఎదురుగా ఎటు చూసినా అనేక కుక్కలు కనబడి అవన్నియూ తన రూపాలేననీ, తెలుసుకోలేక గాబరాపడ్డట్టుంది. అట్లాగే ద్వైతమనీ, అద్వైతమనీ, విశిష్టాద్వైతమనీ ఇలా అనేక మతాలు ఏర్పడినాయి, సత్యమొక్కటే అయినప్పటికినీ. కనుక సన్యాసి అయినా షణ్మతాలను (శైవము, వైష్ణము, శాక్తము, గాణాపత్యము, సౌరము, కాపాలము అనునవి) శోధించినా, చావే గతి గాని, అమృతత్వము పొందే నిర్ణయం లేదు. కనుక ఆత్మ తత్వాన్ని పొంది, అచటనే తెలుసుకోవాల్సిన విషయం వుందని వేమన నిర్ణయం. వేమన తత్వము సన్యాసులకు కూడా తెలియబడనిదని పై పద్యాల వల్ల అవగతమగుచున్నది. మరియు వేమన సంసారియేనని కూడా తెలియబడుచున్నది.

**ఆ॥ వెర్రి నక్కల వలె వేదముల్ జదివేరు**
**యాశయంబు లెరుగ రయ్య వార్లు**
**వేద సారమంత వేమన యెరుగును**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

వేదముల ప్రధాన లక్ష్యమును తెలుసుకోక పోవడం వల్లే క్రమేణా వేదమతం క్షీణించి అనేక మతాలు ఏర్పడినాయి. కనుక సారం తెలియని పఠనం వృధా అనియు, వేదాల సారమంతా తనకు తెలుసుననీ వేమన తెలియజేశాడు. అయితే వేమన స్వయంగా ఈ సారాన్ని తెలుసుకున్నాడా? లేదు. వేమన తన గురువు ద్వారా సర్వశాస్త్రాల సారాన్ని గ్రోలినట్టున్నాడు. అందువల్లే అంత నిర్భయంగా నొక్కి చెప్పుచున్నాడు.

**ఆ॥ లోకములకు గురువు లోకులకును గురు**
**వదియు దెలసి మోక్ష మందరోరి**
**గురుని గనక నరక కూపము బొందిరి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

కనుక వేమనకు గురువు తప్పని సరిగా వుండి వున్నాడు. ఆతడే లంభికా శివయోగి. అచల సిద్ధాంతులు ఈతనినే అంభికా శివయోగి అని కూడా అందురు. ఈ లంభికా శివయోగి అచల

సిద్ధాంత సాంప్రదాయకుడే. ఆతని నుండే వేమన పరిపూర్ణ రాజయోగమును గ్రహించినాడు. ఈ అచల పరిపూర్ణ రాజయోగమునకే అచల బోధయనీ, అచల సిద్ధాంతమనీ, అచల తత్వమనీ, పరిపూర్ణ ప్రబోధయనీ, అచల యోగమనీ, రాజయోగమనీ లోకమున వాడుక కలదు. వేమన అచల తత్వమును బోధించినాడనుటకు ఈ క్రింది పద్యములే నిదర్శనం.

**ఆ॥ అచల తత్వ మనగ ననుభవ గమ్యంబు**
**చూపి చెప్ప రాదు సూక్ష్మమదియె**
**మదికి దోచు గాని మర్మమెన్నగ రాదు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥**

**ఆ॥ అచల యోగ తపము నందంగ గమకించి**
**ప్రచురమైన కాంతి బడయు చుండ**
**రుచిరముగ దాటి రూపించు పరమాత్మ**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥**

**కం॥ మూటికి మూలంబైనది**
**ధాటిగ గుర్తించి మించి ధావళ్యమునన్**
**సూటిగ మించిన తత్వము**
**చాటింతరె యచల మనుచు సరసత వేమా ॥**

**సీ॥ మనసు నిల్పినవాడు మరి సర్వ సమమందు**
**ననుభవంబును గోరి యచలుడగును**
**నిగమాంత వేద్యుడై నిత్య ప్రకాశుండై**
**పరమ పరిపూర్ణము గోరి పట్టు విడదు**
**అరయంగ రానిది యలపరబ్రహ్మంబు**
**తానని తెలిసియు దలపు విడదు**
**నిరతమాత్మ నుతించి నిర్గుణంబును జెంది**
**నిశ్చల బ్రహ్మమౌ నియతి విడదు**

తే॥ సగుణమెప్పడు తాగాక సత్యమనెడు
నిర్గుణ బ్రహ్మమే నని నిశ్చయించి
తాను తనలోన పూర్ణుడై తలగకుండు
విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య ॥

ఇక వేమన రాజయోగి యనుటకు ఆధారం ఈ క్రింది పద్యమే. సన్న్యాసులు రాజయోగులని పిలువబడుటకు అర్హులు కారు. కనుక వేమన తప్పనిసరిగా సంసారియేనని తెలియబడుచున్నది. వేమన బోధించిన అచల యోగ తత్వము ప్రపంచంలో యున్న యోగములకెల్ల రాజు. దీనినే అచల సాంప్రదాయకులు అచల పరిపూర్ణ రాజయోగమని కూడా అందురు.

ఆ॥ రాజయోగి మహిమ రాజయోగికి గాక
నితర జనుల కెల్ల నేమి దెలుసు
తాను దేవుడైన దైవము గొలుచునా?
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఈ విధానమందు అందరూ దైవ స్వరూపులే. ఈ విధానమందు ప్రవర్తించు రాజయోగి దైవముకన్న వేరు కాడు. ఆతడే దైవము. ఈ విధానం ఇతర జనులకు తెలియదు మరొక రాజయోగికి తప్ప.

ఆ॥ వేమ ననగ యోగి వెలసె లోకములోన
పూజ లిడుడు పుణ్య పురుషులార
పూజలిడిన యంత భుక్తి ముక్తుల నిచ్చు
విశ్వదాభిరామ వినుర వేమ॥

వేమన ప్రబోధించిన అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత పద్ధతి యందు గురువే దైవము. గురునకే పూజ వుంటుంది. కాని ఇతర దేవతల పూజలు వుండవు. గురువే వారి అనుగ్రహం వల్ల శిష్యులకు భుక్తి ముక్తులను ఇవ్వగలరు. కనుకనే వేమన తన పద్యాలలో ఎచ్చటనూ ఇతర దేవతల స్తుతిని చేయనే లేదు.

ఈ అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతం సంక్షిప్తంగా ఏమిటంటే? మూడు మాటల్లో 1) ఉన్నది పరిపూర్ణం, 2) లేనిది ఎరుక, మరియు 3) లేని ఎరుకను విడువడం.

పరిపూర్ణమునే బయలనీ, అచలమనీ, గురు రహస్యమనీ, బట్ట బయలనీ, పరిపూర్ణ బ్రహ్మమనీ, అచల పరిపూర్ణ బ్రహ్మమనీ, పరమనీ, పరమ పురుషుడనీ ఆయా సందర్భాలలో పేర్కొన్నారు. బయలుకే వేమన పద్యాలలో మూడు అర్థాలు కలవు. 1)ఆకాశం, 2)ఆత్మ, 3)శూన్యం, 4)అచలం. ఈ నాలుగు అర్థాలు విభిన్నముగా వున్నాయి. ఎరుకనగా ఈ సృష్టికంతటికి మూలమైన పదార్థము. లేని ఎరుకను లేనిదని వదలివేయడమే ముముక్షువు యొక్క ముఖ్య కర్తవ్యము.

**1) అచల పరిపూర్ణ బ్రహ్మము:** వేమన పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి ఈ క్రింది విధంగా తెలియజేశాడు.

> **కం॥ నాదము బ్రహ్మంబనుచును**
> **వేదములను జదువవచ్చు విని కని నంతన్**
> **నాదంబులేని బయలున**
> **నాదాంతము పూర్ణ పదవి నయముగ వేమా॥**

నాదము బ్రహ్మమనుచు వేదములను వినిననూ, చదివిననూ, కనిననూ తెలియబడును. ఆ నాదములేని బయలే పరిపూర్ణ పదవి అని వేమన బోధించుచున్నాడు. నాదాంతమే పరిపూర్ణ బ్రహ్మము అని వేమన నిర్ణయం.

> **కం॥ చెప్పియు జూపగరానిది**
> **మెప్పగ మదిలోన జూచి మెలకువ తోడన్**
> **త్రిప్పలను బడక చూచిన**
> **నొప్పగ జగమెల్ల నిండి యుండును వేమా॥**

ఆ పరిపూర్ణ బ్రహ్మము చెప్పి చూపించరానిది. ఏ సాధనలు చేయకుండ యుక్తితో చూసినచో ఆ పరిపూర్ణ బ్రహ్మము అంతట గలదని తెలియబడును.

కం॥ పరము పరమటంచు పలుకుదురందరు
పరము నందు నేమి ప్రబలమయ్యె
పరముడిందు నందు పరిపూర్ణుడే కదా?
విశ్వదాభిరామ వినుర వేమ॥

పరము పరము అని పలుకుచుంటారందరు. కాని ఆ పరమునందు ఏమైనా ప్రబలమయ్యిందా? అని వేమన ప్రశ్నించుచున్నాడు. పరము పరిపూర్ణముగా యున్నది. కనుక దానియందేమియూ ప్రబలము కాలేదు అని వేమన ప్రబోధించుచున్నాడు.

కం॥ నిరతం బెడతెగకుండన్
బరిపూర్ణ బ్రహ్మమాత్మ పదమున నుంచన్
నిరవద్యమైన పదవిని
జరియించును జగమెరుంగ సత్యము వేమా॥

ఆ పరిపూర్ణ బ్రహ్మము నిరతంబు ఎడతెగక యున్నది. దానిని తెలిసికొన్నవారు నిరవద్యమైన అనగా అనపేక్షనీయమైన(చావు పుట్టుకలు లేని) పదవిని అలంకరించి ఈ ప్రపంచం యందు చరిస్తూ వుంటారు.

కనుక పరిపూర్ణ బ్రహ్మము (అచలము) ఎలాంటిది? అనగా అది సర్వత్ర నిండి నిబిడీకృతమై వున్నది. దాని యందు నాదము లేదు. దానిని ఎవరు కూడా చెప్పి చూపించలేరు. ఆ పరము అంతటా పరిపూర్ణమై వున్నది. దాని యందు ఏదీ పుట్టనే లేదు. అది తప్పు ఏమీ లేదు. దానిని చూచి లేకుండా పోవుటే ముక్తి. అదే సర్వ భ్రాంతి రహితం.

**2) ఎరుక ( బ్రహ్మము):**

ఇక మతముల వారు నిర్ణయించిన బ్రహ్మమే అచల సిద్ధాంతులు నిర్ణయించిన 'ఎరుక' యొక్క నిజస్వరూపం. ఇదే సర్వసృష్టికి మూల కారణము. ఇదే వేమన పద్యాల్లో:

ఆ॥ ఎరుక యుండు వాని కెరుకయే యుండును
యెరుక లేని వాని కెరుక లేదు
యెరుక లేని ఎరుక నెరుగుట తత్వంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ బ్రహ్మమనగ వేరె పరదేశమున లేదు
బ్రహ్మమనగ తానె బట్టబయలు
తన్ను దా నెరిగిన తానె పో బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ తన్ను వెదకి చూడ దానె పో జీవుండు
తత్వ మరసి చూడ దానె యాత్మ
మన్ను మిన్ను లేదు మాయ తా లేదయా
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ ఆత్మ దేహమందు నతి సూక్ష్మముగ జూచి
దేహమాత్మ యందు దేట పరచి
యాత్మనెందు జూచు నతడె పో బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥

కం॥ నీవాడిన నేనాడుదు
నీవుండిన నేను నుందు నిర్విణ్ణుడనై
నీవు దలంచిన దలపుదు
నీవు నగిన నేను నగుదు నిజముగ వేమా ॥

కం॥ తలచినను శూన్యతత్వము
తలచక నుండినను శూన్యతత్వం బదియౌ
తలచిన తలపీడేరును
తలచక నుండినను తానె తత్వము వేమా॥

కం॥ అనిలంబున జనియించిన
యనలంబున సలిలమగును, యాకాశమునన్
గనిపించి పుట్టు దానే
జనకుడు లేనట్టి మాయ చరితము వేమా ॥

మతాలు వేర్వేరు అయినా తత్వ నిర్ణయం ఒకటే. పరిపూర్ణ బ్రహ్మము తప్ప మిగతా సర్వమూ ఎరుకే. ఎరుకే మాయా స్వరూపమైనది. ఇది సర్వ మాయలకు పుట్టినిల్లు. జీవేశ్వరులు, ఆత్మానాత్మలు, ప్రకృతీ పురుషులు, జడ చేతనములు, సాకార నిరాకారాలు, దేహీ దేహాలు, సదసత్తులు, విద్యా విద్యలు, ప్రకాశాప్రకాశాలు, జ్ఞానాజ్ఞానాలు, క్షరాక్షరాలు, దృక్దృశ్యాలు మొదలగు సర్వ ద్వంద్వములూ ఎరుకే. ఎరుకలో యుండు వారికి ఎరుక సత్యమే. ఎరుకాతీత పరిపూర్ణ బ్రహ్మమును తెలుసుకొన్నవారికి ఎరుక శూన్యము. ఇదే తత్వ నిర్ణయం. బ్రహ్మమనగా ఎచ్చటో లేదు. తానే జీవుడు, తానే బ్రహ్మము, తానే ఆత్మ, అన్నీ తానే. ఇందులో కొంత మాయ. కొంత నిజము కాదు. ఆత్మ యొక్క స్థూల రూపమే దేహము. దేహము యొక్క సూక్ష్మ రూపమే ఆత్మ. ఇదే ఏక వస్తువుగా, అనేక వస్తువులుగా, సర్వ స్వరూపంగా వున్నది. బీజమునందు వృక్షమంతా దాగి యున్నట్లుగా ఆత్మ యందే సర్వము బీజస్వరూపంగా వుంది. ఈ చిక్కు సామాన్యులకు తెలియబడనిది. ఈ చిక్కును బాపువాడే ఘనయోగి.

ఎరుకే అహం పదార్థం. తత్, త్వం పదార్థాలు ఇదే. ఇదే అసి పదార్థం. అన్నీ ఇదే. ఇదే లేకుంటే పరిపూర్ణ బ్రహ్మము తప్ప ఇంకేమీ లేదు. 'బ్రహ్మణోన్యం నకించిన'. అన్నింటికీ మూలం ఎరుకే. కాని ఎరుకకు మూలం లేదు. పరిపూర్ణ బ్రహ్మమునందు స్థానమూ లేదు. కనుక తత్వ నిర్ణయంలో ఎరుక శూన్యము. ఉన్నది ఒక్కటే. అదే పరిపూర్ణ బ్రహ్మము. కనుక ఎరుక మూలమును తెలుసుకున్న వారికే సర్వభ్రాంతి రాహిత్యం కాగలదు.

**3) ఎరుకను విడిచే విధానము:** ఇక లేని ఎరుకను ఎరిగి, ఎరుక లేక యుండుట ఎట్లాగా? వేమన పద్యాల్లో:

**ఆ॥ రాకపోక లణచు రాజమార్గము పూని**
**నాకమనెడు గురుతు వీక నెరిగి**
**సోకి మించ బయలు సూత్రంబు గాదొకో?**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

**ఆ॥ ఎచట జూడ్కి నిలిపి యెందాక చూచిన**
**నచట దోచు కళల నంద రాదు**
**అచల వ్యక్తి యరగి యందుట మోక్షంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

ఆ॥ రాజయోగమూని తేజ మందుట ముక్తి
తేజ మందకున్న దేబె లరయ
మర్మ రహిత గురుని మరి చేర వలెనయా
విశ్వదాభిరామ వినుర వేమ॥

కం॥ భావా భావము లంటక
సేవించెడు బట్టబయలు స్థిరమతి లోనన్
కేవల శివపర ధ్యానము
తావరమును గన్నవాడె ధన్యుడు వేమా ॥

కం॥ మాయావిద్యల జూడకె
మాయల కిరవైన ఎరుక మర్మము గనకే
మాయావిద్యల జాలము
ఛాయలె జీవేశ్వరునకు జాతము వేమా॥

కం॥ వంచన చేసెడి యెరుకను
మించిన పరతత్వ మమరు మేలిమిగా నా
శించును గన్గొని యుండిన
సంచారము లేని బయలు సతమగు వేమా ॥

ఆ॥ వ్రతము లెన్నియైన వట్టి చిక్కులె కాని
యాత్మ చిక్కు గాన నలవి గాదు
ఆత్మ చిక్కు బాపు నతడె పో ఘనయోగి
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ కాశి యాత్ర జేసి గాసి జెందగనేల?
రోసి గుణ వికార రూపడంచి
మోసపోక ఎరుక మూలంబు గనువాడు
గాసి జెందబోడు ఘనుడు వేమ॥

ఆ॥ మనసు వాక్కు కర్మ మరి యేమి లేకను
రాక పోక గాని రాజవీధి
పరగ హాని గలదె పరతత్వయోగికి
విశ్వదాభిరామ వినుర వేమ ॥

కం॥ కాయము విడచెడు వేళను
న్యాయంబుగ బుద్ధినొక్కి నమ్రత తోడన్
జ్ఞేయంబగు పరిపూర్ణము
ఛాయను గని పరిణమించు జయ్యన వేమా॥

తే॥ నీవు నెరిగిన లోకంబు నీకు దోచు
నీవు మరిగిన తోడన నెందు బోయె?
ననెడి యెరుకను విడనాడు డయ్య యోగి
విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య ॥

ఎవరైతే అచల ఋషి అయిన రాజయోగిని చేరి సర్వ నామ, రూప, క్రియ, నటనలకు కారణమైన ఎరుక మూలాన్ని ఎరిగి, దానికతీతమైన పరిపూర్ణ బ్రహ్మమును దర్శిస్తారో, వారికి రాకపోకలుండవు. ఈ పరతత్వాన్ని తెలుసుకొన్న రాజయోగి ఎరుకను (అహంకారాన్ని) వదలి అనగా కర్తృత్వ రహిత కర్మాచరణ యందుండి త్రికరణశుద్ధిగా కర్మలను ఆచరించును. కనుక వారికి ఏ హాని వుండదు. అనగా జననమరణ బాధలుండవు.

ఇలా రాకపోకలను అణచి వేసే మార్గమే రాజ మార్గము. ఉన్నదున్నట్లుగా ఈ రాజమార్గాన తెలుసుకొని ఆచరించిన వారే రాజయోగులు. వేమన మొదట అన్ని రకముల యోగాలు చేసి, చివరకు రాజయోగము శ్రేష్ఠమని దానినే ఆచరించాడు. దీనికి ఏ సాధనా అవసరం లేదు. తత్వ వివేచన తప్ప. దీనిని ఊరక యుండియే తెలియవలయును. శ్రీ శివరామదీక్షితుల కంటే ముందుగా వేమన యోగి ఈ సిద్ధాంతాన్ని తెలియజేశారు. శ్రీ శివరామదీక్షితుల వారు వ్రాసిన గ్రంథం 'బృహద్వాశిష్ఠం' లో కూడా వేమన ఉపయోగించిన బయలు, ఎరుక, పరిపూర్ణం మొదలగు పదాలను ఉపయోగిస్తూ ఈ అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతాన్ని సిద్ధాంతీకరించాడు.

దీనిని మతమనకూడదు, వాదమని కూడా అనకూడదు. ఇది వాదాలకు,మతాలకు అతీతమైన సిద్ధాంతం. దీని మూల బీజాలు వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ వున్నవే. అయితే వేమనకు పూర్వము నుండియే ఈ సిద్ధాంతం గురుపరంపర సాంప్రదాయకంగా వస్తూవుంది.

ఈ సిద్ధాంతానికీ వేమన పద్యాలకు సమన్వయం కుదురుతుంది. అలాగాక వేమనను మిగతా ఏ తత్వవేత్తగానైనా తీసుకుంటే సమన్వయం కుదురదు. కనుక వేమన తన పద్యాలలో మతాలకు అందని సూక్ష్మమైన భావాన్ని బోధించాడు. ఆ భావమే 'అచల పరిపూర్ణ రాజయోగము' అని తెలియబడింది. కొందరు పొరపాటున దానిని 'అద్వైతము'ను కొన్నారు. కాని వేమన 'షణ్మతముల జిక్కి చావనేల?', 'మతములందు ముక్తి వెదకిన లేదయా' అని నిర్భయంగా మతాల స్థితిని తెలియ జేశాడు. కనుక వేమన బోధించినది 'శంకరాద్వైతం' ఎంత మాత్రం కాదు. వేమన యోగి ఆచరించినది రాజయోగమే. వేమన 'రాజయోగమూని తేజమందుట ముక్తి' అన్నాడు. ఈ మార్గము 'అచల వ్యక్తి యరగి యందుట మోక్షంబు' అన్నాడు. కనుక ఈ మార్గం అచల సిద్ధాంతులకు మాత్రమే తెలసి వున్నది. కనుక నిస్సందేహంగా వేమన 'అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతి' అని తెలియబడింది.

రెండవ అధ్యాయం

# విశ్వదాభిరామ వినుర వేమ

వేమన విశ్వ విఖ్యాత కవి. ఆతని గళము నుంచి వెలువడిన గీతాలు నేటికినీ ఆబాలగోపాలాన్ని అలరింపజేయుచునే వున్నవి. ఆతని పద్యాలలో ఏవో తెలియని నిగూఢమైన భావాలు నిక్షిప్తమై వున్నాయి. ఆ పద్యాలలో వున్న సార్వజనీనమైన సత్యాలు సమాజ శ్రేయస్సును కోరుచున్నాయి. వేమన వేలకొలది పద్యాలను తన గొంతు నుంచి పలికించాడు. ప్రతి పద్యంలో ఏదో ఒక నీతిని నింపాడు. అంధకారంలో వున్న అభాగ్యులకు అమృత తుల్యమైన ఆటవెలదులను అందించాడు. ఆ ఆటవెలదులకు వున్న 'విశ్వదాభిరామ వినుర వేమ' అనే మకుటం వాటికి మరింత వన్నె తెచ్చింది. ఈ మకుటానికి అర్థం నిర్ణయించడమే ఈ రెండవ అధ్యాయం యొక్క ప్రధాన ఉద్దేశ్యము.

పూర్వ కవులు తమ తమ పద్యాలకు భిన్న భిన్నమైన మకుటాలు నిర్ణయించుకొని శతకాలు వ్రాశారు. కొందరు కవులు ఇష్ట దేవతా పేర్లను వాడగా, మరి కొందరు వారికి వారే సంబోధించుకొన్నారు మకుటంలో. సుమతి శతక కర్త తన పద్యం చివరలో 'సుమతీ' అని చేర్చినట్లే, వేమన తన పద్యాల చివరన 1)వేమ, 2)విశ్వదాభిరామ వినుర వేమ, 3) విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య , 4) రాజయోగి వేమా, 5) వివిధ విద్యా కళాత్రాణ వివరి వేమ, 6) విశ్వదాభిరామ యిదియు వినురవేమ అని మకుటంగా ఆరు రకాలుగా అనేక పద్యాలలో వాడారు. వేమన చెప్పిన పద్యాలలో ఎక్కువ పద్యాలు 'విశ్వదాభిరామ వినుర వేమ' అను మకుటాన్నే కలిగి వున్నాయి. ఈ 'విశ్వదాభిరామ వినుర వేమ' అనే మకుటం శ్రవణానందంగా వుండి ప్రపంచ ప్రసిద్ధి గాంచినది.

దేనికైన మకుటమే మణి కిరీటం. మకుటంలోనే కవి లేదా కావ్యం యొక్క పూర్తి స్వరూపం ఇమిడించబడుతుంది. వేమన పద్యాలలో ఉపయోగించిన ఈ మకుటం ఔచిత్యం చర్చనీయాంశంగా వుంది. 'విశ్వదాభిరామ వినురవేమ' అను మకుటంలో వేమన భావం పూర్తిగా నిక్షిప్తమై వుంది. వేమన యొక్క సంపూర్ణ స్వరూపం, వేదాంత వైఖరిని తెలుసుకున్న వారికే ఆ మకుటార్థం తెలియబడగలదు. ఇతర కవులవలె కాకుండా, వేమన తన మకుటంలో రహస్యంను దాచి వుంచాడు. ఈ మకుట వివరణ కోసం సి.పి. బ్రౌన్, ఆచంట సాముఖ్యాయన శర్మ,

వేంకట శేష కవి, రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ, డా॥ ఎన్. గోపి మొదలగు ప్రముఖులు పరిశోధించారు.

క్లుప్తంగా చెప్పాలంటే మకుటం అనేది కవి రచించిన కావ్య సారానికి ప్రతీక. వేమన లోక శ్రేయస్సు కోరే సంఘ సంస్కర్త మాత్రమే కాదు. ఆతడు అసలు సిసలైన ఆధ్యాత్మిక వేత్త. ఇహ పరాలను మథించగా వచ్చిన అమృత భాండాలను ఆటవెలదులుగా అందించిన ఆత్మ జ్ఞాని. సర్వత్ర సమదర్శనాన్ని పాటించిన మహాయోగి. తత్వ శాస్త్ర సారాన్ని 'విశ్వదాభిరామ వినుర వేమ' లో ఇమిడ్చిన తాత్వికుడు వేమన. కనుక ఈ మకుటార్థంను వున్నదున్నట్లుగా తెలుసుకున్నచో, వేమన పద్యాలను సరిగ్గా అర్థం చేసుకోగలుగుతాము.

ఈ మకుటార్థ నిర్ణయానికి వేమన పద్యాలే వెన్నెముక. ఒక నాణెమునకు బొమ్మ బొరుసు ఎంత అవసరమో, వేమన పద్యాలకు ప్రాపంచిక పారమార్థికములు అంతే అవసరం. ప్రపంచంలో సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఎలా ఆచరించాలో తెలుపుచూ, పారమార్థికంగా మానవుడు ఎలా ముముక్షువు కాగలడో వేమన తన పద్యాలలో తెలియజేశాడు. తాను ఆచరించి తద్వారా ఇతరులకు తెలియజేయడం మహాత్ముల లక్షణం. అదే విధంగా వేమన పద్యాలను తనకు తానే బోధించుకున్నాడు.

వేమన తన పద్యాలతో మానవ సౌభ్రాతృత్వము, అన్యోన్య సహకారము, ఐహికాముష్మిక పురోభివృద్ధి మరియు వసుధైక కుటుంబ నిర్మాణము గూర్చి ప్రజలకు బోధించెను.

వేమన విప్పి చెప్పని విషయాలు విశ్వంలోనే లేవు. ఆతని విమర్శనాస్త్రాల నుంచి తప్పించుకోని కులాలు, మతాలు లేనే లేవు. ఆతను కులాలకు, మతాలకు అతీతమైన భావాలను తన పద్యాలలో తెలియజేశాడు. వేమన ఇచ్ఛ వచ్చినట్లు వెర్రిగా పద్యాలను అల్లుకు పోయాడా? ఆతనికి ఓ మతమూ, సిద్ధాంతమూ అంటూ ఏది లేదా? అని విమర్శిస్తే, ఇంతవరకు పరిశోధకులు తేల్చిన సారమేమనగా - ఆతను అద్వైతి. అయితే నిశితంగా ఆలోచిస్తే, వేమన బోధించినది అద్వైతమా? కాదు, అని వేమన పద్యాలవల్లే తెలియబడింది.

**ఆ॥ చదువు జదువనేల సన్యాసి గానేల?**
**షణ్మతముల జిక్కి చావనేల?**
**యతని భజన చేసి యాత్మలో దెలియుడి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

ఆ॥ మర్మ మెరుగలేక మతముల గల్పించి
యుర్వి దుఃఖు లగుదు రొకరి కొకరు
గాజు యింట కుక్క కళవళపడు రీతి
విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆ॥ మతము లెన్నియైన సతముగా నుండవు
సతము గాను యుండు జగతి నొకటి
యంత మతము విడిచి నా బ్రహ్మమరయుట
విశ్వదాభిరామ వినుర వేమ ॥

వేమన అద్వైతి కాడు. ఎందువల్లననగా, అద్వైతము ఒక మతముగా వుండడమే. వేమన అన్ని మతాలను నిర్భయంగా ఖండించాడు. పైగా వేమన తాను శంకరాద్వైత మతమును బోధించుచున్నట్లు ఏ ఒక్క పద్యంలోను చెప్పలేదు. 'చదువు జదువనేల సన్యాసి గానేల?' అని చెప్పి వేమన మతప్రవక్తలైన సన్యాసులను కూడా నిరసించాడు. ఇచట గుర్తించవలసిన విషయమేమంటే శంకరాచార్యులవారు కూడా సన్యాసి. అందువల్ల వేమన అద్వైతి ఎంత మాత్రం కాడు. వేమన భావము మతాలకు అతీతమైనది. ఆతని తత్త్వసారం అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతంగా తెలియబడింది. ఈ సిద్ధాంత సారం తెలిస్తే, ''విశ్వదాభిరామ వినుర వేమ'' మకుట రహస్యం తెలియబడగలదు. కనుక ఈ సిద్ధాంతాన్ని కుప్లంగా వివరించడం అప్రస్తుతం కాదు. ఈ సిద్ధాంతంను అనుసరించి పరిపూర్ణ పరబ్రహ్మమును, లేని ఎరుకను తెలుసుకొని, లేని యెరుకకు పరిపూర్ణ పరబ్రహ్మములో స్థానం లేదని వదిలివేయడం ముముక్షువు యొక్క ముఖ్య కర్తవ్యము. ఈ సారాన్నే వేమన పరిపూర్ణమైన భావంగా మనోహర పదసమూహంతో ''విశ్వదాభిరామ వినుర వేమ'' మకుటంలో నింపాడు.

1) పరిపూర్ణ బ్రహ్మము:-

ఆ॥ పరము పరమటంచు పలుకుదురందరు
పరము నందునేమి ప్రబలమయ్యె?
పరము డింది నందు పరిపూర్ణుడే కదా?
విశ్వదాభిరామ వినుర వేమ॥

కం॥ నిరతం బెడతెగకుండన్
బరిపూర్ణ బ్రహ్మమాత్మ పదమున నుంచన్
నిరవద్య మైన పదవిని
జరియించును జగమెరుంగ సత్యము వేమా ॥

2) ఎరుక:-

ఆ॥ ఆత్మదేహమందు నతి సూక్ష్మముగ జూచి
దేహమాత్మ యందు దేట పరచి
యాత్మనెందు జూచు నతడె పో బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥

కం॥ తలచినను శూన్యతత్వము
తలచక నుండినను శూన్యతత్వం బదియౌ
తలచిన తలపీడేరును
తలచక నుండినను తానె తత్వము వేమా॥

3) ఎరుకను విడిచే విధానము:-

ఆ॥ రాకపోకలణచు రాజమార్గము పూని
నాకమనెడు గురుతు వీక నెరిగి
సోకి మించ బయలు సూత్రంబు గాదొకో?
విశ్వదాభిరామ వినుర వేమ ॥

కం॥ వంచన చేసెడి యెరుకను
మించిన పరతత్వ మమరు మేలిమిగా నా
శించును గన్గొని యుండిన
సంచారము లేని బయలు సతమగు వేమా॥



కనుక వేమన బోధించినది సర్వమతాభిప్రాయాలకు అతీతమైన అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతం మాత్రమేనని తెలియబడింది. వేమన ఆచరించినది రాజయోగం. ఆతను రాజయోగి. వేమన తన గురువైన లంభికా శివయోగి ద్వారా పరతత్వమైన పరిపూర్ణ పరబ్రహ్మమును దర్శించి, లేని ఎరుకను వదలిన పరిపూర్ణ భావజ్ఞుడు. అందువల్లే ఆతను పుట్టి వేమన కాడు. ఆతడు విశ్వదాభిరాముడైన వేమన. కనుక ఈ అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతాన్ని అనుసరించి 'విశ్వదాభిరామ వినుర వేమ' మకుట అర్థ నిర్ణయంః

''విశ్వదాభిరామ వినుర వేమ'' ను పదవిభాగాలుగా విభజిస్తే
= విశ్వ+ ద+ అభిరామ+ వినుర+వేమ
ఇందులో వేమ=వేమన
వినుర= వినుము అనియూ,
'విశ్వదాభిరామ' నేమో వేమనకు విశేషణంగా వాడబడింది.

ఇక అభిరామ= అభి+ రామ ను గూర్చి విచారించి చూడగా,

ఇందలి రామ శబ్దము నందలి ''రా'' అను అక్షరం ''తత్'' పదమునకర్థమైన ఆత్మ లేదా బ్రహ్మమగును 'మ' అను అక్షరం 'త్వం' పదమునకర్థమైన జీవుడగును. అందువల్ల 'అభిరామ' అను పదము 'జీవ బ్రహ్మైక్యం' ను సూచిస్తుంది.

**ఆ॥ తన్ను వెదకి చూడ దానెపో జీవుండు**
**తత్వ మరసి చూడ దానె యాత్మ**
**మన్ను మిన్ను లేదు మాయ తా లేదయా**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

కనుక 'అభిరామ' అను శబ్దము తప్పనిసరిగా జీవ బ్రహ్మముల ఏకత్వాన్ని సూచిస్తుంది. తత్వశాస్త్రంలో, తనను తానే వేమన ప్రశ్నించుకొన్నప్పుడు తాను బ్రహ్మము ( ఆత్మ ) కన్నా వేరు కాదు మరియు తానే జీవుడు అనియూ తెలియబడింది. మాయ వలన బ్రహ్మమునందు జగత్తు ఆరోపించబడలేదు. అన్నీ ఆత్మయే. మన్ను మిన్ను అను భేద భావము లేదు.

**ఆ॥ బ్రహ్మమనగ వేరే పరదేశమున లేదు**
**బ్రహ్మమనగ తానె బట్టబయలు**
**తన్ను దా నెరిగిన తానె పో బ్రహ్మంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥**

వేమన పై పద్యంలో జీవుడుగా వున్న తాను బ్రహ్మమున కంటే వేరుగా లేనని తెలియజేశాడు. కనుక 'అభిరామ' అనగా జీవ బ్రహ్మైక్యముగా తెలియబడింది. ఇందులో ఐక్యం అనగా రెండింటిని కలిపే ప్రక్రియ ఏదీ లేదు. రెండూ ఒకే వస్తువు అని తెలుసుకోవడమే జీవబ్రహ్మైక్యంగా తెలుసుకోవాలి. ఇక

విశ్వ+ద:
విశ్వ = సర్వ సంఘములను(సర్వస్వమును)
ద = త్యాగము చేసినవాడు(త్యజించినవాడు)

కనుక సంపూర్ణ మకుటార్థ వివరణ ఏమిటనగా :-

అభిరామ = జీవబ్రహ్మైక్యం పొంది (సర్వమునకు మూలమైన)
విశ్వ = సర్వసంఘ ( ఎరుకను)
ద = పరిత్యాగము చేసిన
వేమ = ఓ వేమా!
వినుర = వినుము

విశ్వదాభిరామ వినుర వేమ = జీవ బ్రహ్మైక్యము పొంది సర్వసంఘ పరిత్యాగము చేసిన ఓ వేమా! వినుము అనుచూ వేమన తనకు తానే సంబోధించుకొను మకుటాన్ని వాడారు. పైన వివరించిన మకుటార్థం అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతానికి, వేమన పద్యాల సారానికి సరిగ్గా సరిపడి, పరిపూర్ణమైన భావాన్ని ఇవ్వ గలుగుతుంది. వేమన అసలు సిసలైన అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతి కావడం వలననే, నేటికినీ అచల సాంప్రదాయకులలో వేమన పూజార్హుడై యున్నాడు.

ఇక పైన వివరించిన మకుటార్థమునకు, పూర్వపు పండితులు వివరించిన అర్థానికిగల విభిన్నత్వం ఎలా వుంది? ఏది సమగ్రమైన సంపూర్ణార్థాన్ని ఇవ్వగలదో, చర్చిద్దాం.

1) బ్రౌన్ అభిప్రాయం ప్రకారం:

''విశ్వదాభిరామ వినుర వేమ''కు అర్థం (బ్రౌన్ ఈ మకుటం యొక్క ప్రాముఖ్యతను గుర్తించలేకపోయాడు.) స్థూలంగా 'విశ్వదాభిరామ వినురవేమ' ను ఆంగ్లంలోకి తర్జుమా చేశారు. దానిని 'సకల జనుల దైవానికి ప్రియమైన' అని తెలుగులో చెప్పవచ్చును. కనుక బ్రౌన్ ఉద్దేశ్యంలో మకుటార్థం - సకల జనుల దైవానికి ప్రియమైన ఓ వేమా వినుము.

కాని వేమన దైవ స్తుతి ఎచ్చటనూ చేయలేదు. పైగా విగ్రహారాధనలను ఖండించారు. అయితే సకల జనుల దైవము ఎవరు?

**ఆ॥ రాజయోగి మహిమ రాజయోగికి గాక**
**నితర జనుల కెల్ల నేమి దెలుసు**
**తాను దేవుడైన దైవము గొలుచునా?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥**

వేమన రాజయోగి. ఆతని మహిమను ఇతరులెరుగ లేరు మరొక రాజయోగి తప్ప. ఆ రాజయోగి యే దైవము, ఆతను ఇంకొక దైవమును ప్రార్థించడు, తన గురువును తప్ప. అందుకే వేమన

**ఆ॥ వేమ ననగ యోగి వెలసె లోకములోన**
**పూజలిడుడు పుణ్య పురుషులార**
**పూజలిడిన యంత భుక్తి ముక్తుల నిచ్చు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥**

అని చెప్పియున్నాడు.

కనుక బ్రౌన్ గారు సూచించిన మకుటార్థం సమగ్రమైనది కాదు. బ్రౌనే స్వయంగా ఒప్పుకున్నాడు.

2) శ్రీ ఆదంట సాముఖ్యాయన శర్మ, పార్వతీపురం దృష్టిలో :

విశ్వ = సమస్తమును

ద = ఇచ్చుటచేత

అభిరామ = మనోజ్ఞుడు

వేమ = వేమన్న

వినుర = వినుము !

ఈ వివరణలో ఏ విధమైన ప్రత్యేకమైన తత్వశాస్త్ర సారం కనిపించుట లేదు. మరియు వేమనను వివరించే 'విశ్వదాభిరామ' ఇచట సమస్తమును ఇచ్చుట చేత 'మనోజ్ఞుడు' అని వివరించబడినది. కాని ఇది వేమన తనకుతానే స్తుతి చేసుకున్నట్లు ధ్వనిస్తుంది. ఆత్మ జ్ఞానులకు ఆత్మస్తుతి కూడదు. కనుక ఈ వివరణ సమగ్రమైనదిగా లేదు. మరిము ఇది మనస్సు వరకే పరిమితమైనది.

**3)** శ్రీ వేంకటశేష కవి గారి వివరణ :

విశ్వ = సకలమైన వానిని

ద = ఇచ్చెడి

అభిరామ = ప్రియమైన వాడు

వేమ = ఓ వేమన్నా

వినుర = వినుము !

మకుటార్థం: సకలమైన వానిని ఒసంగెడి ప్రియమైన ఓ వేమన్నా! వినుము !! ఇచట వేమన ఎవరికి సకలమైనవి ఇస్తున్నాడు? వేమన తనకుతానే బోధించుకొనుచు, తన స్వరూపాన్ని 'విశ్వదాభిరామ' లో దాచాడు. కనుక తత్వజ్ఞుడు, యోగియైన వేమన తన సిద్ధాంత సారాన్ని ఇందులో నిక్షిప్తం చేశాడు. అంతే కాని ''సకలమైన వానిని ఇచ్చెడి ప్రియమైనవాడు'' అని ''విశ్వదాభిరామ'' కు అర్థంను సూచించడంలో ఔచిత్యం లేదు.

**4)** శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ గారి వివరణ ప్రకారం:

'విశ్వదుడు విశ్వంలో గల అందరినీ ఖండించిన వాడు అగుటచే అభిరాముడు, వేమన. అనగా అన్ని జాతుల వారి పద్ధతులను జంకు లేక ఖండించిన వాడగుటచే అందరును తమను

తిట్టిన పద్యములను మరచి, ఇతరులను తిట్టినవి మాత్రం చెప్పుకొని సంతోషించుచున్నారు. కనుక వేమన అందరికినీ అభిరాముడే. ఇట్టి టీకలకేమిలెండు సహజమైన అర్థము దీనికిది వరకు లభింపలేదు' – శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ

5) డా॥ ఎస్. గోపి గారి వివరణ ప్రకారం :

'సంస్కృత సర్వనామ శబ్దాలలో రెండవది విశ్వ. ఇది విశేషణం. కాబట్టి విశ్వద అన్నప్పుడు వెనక అందరు చెప్పినట్టు విశ్వదుడవైన అని అర్థం చెప్పుకోవచ్చును. అటువంటి వాడికి ఇష్టుడన్నమాట వేముడు. అంటే మిగతా వారికి ఇష్టుడైనా కాకున్నా సృష్టి కర్తకు ఇష్టుడైనవాడు అని ధ్వనించినాడని భావించ్చును' – డా॥ ఎస్. గోపి.

అనగా 'విశ్వదాభిరామ' ను సృష్టికర్తకు ప్రియమైన అని వివరించారు. అనగా బ్రహ్మకు ప్రియమైన వాడు వేమన అని తెలియజేశారు. కాని వేమన

**ఆ॥ బ్రహ్మ జంపి విష్ణు భాగంబులో గల్పి**
**విష్ణు జంపి శివుని వెలయ గల్పి**
**శివుని జంపి తాను శివయోగి గావలె**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

అని తన పద్యంలో తెలియజేశాడు. దీని ప్రకారం వేమనకి శివయోగి కావడం యందే ఆసక్తి కలదని తెలియబడుచున్నది. కాని సృష్టికర్తయగు బ్రహ్మ యందు ఏవిధమైన భక్తిని ప్రదర్శించలేదు. అంతేగాక త్రిమూర్తులకు మూలమైనది కర్మయని ఈ క్రింది పద్యంలో తెలియజేశాడు.

**ఆ॥ మూల మెవ్వరనుచు ముగ్గురి లోపల**
**మూల మెరుగ లేరు మూఢ జనులు**
**మూలమందరకును ముఖ్యమౌ కర్మము**
**విశ్వదాభిరామ వినుర వేమ॥**

కనుక డా॥ గోపి గారు సూచించిన మకుటార్థం కూడా సమగ్రంగా లేదనడంలో సందేహం లేదు. ఇంకనూ అనేకులు అనేక రకాలుగా ఈ మకుటార్థంను చెప్పారు.

6) అభిరామయ్య అను ఒక స్వర్ణకారున్ని వేమన మోసం చేసినాడని, యోగి అయిన తర్వాత, ఆ పాప పరిహారార్థం ఆ అభిరామయ్యను తలుస్తూ మకుటంలో సంబోధించాడని చెప్పారొకరు. ఇందులో ఎంత మాత్రం నిజం లేదు. ఇది ఒక కట్టు కథ మాత్రమే. వేమనంతటి యోగి అసందర్భంగా ప్రవర్తించడు. ఆత్మజ్ఞానాన్ని అందించే సమయంలో బోధనా పరమైన, ఆచరణ యోగ్యమైన సందేశం మాత్రమే వుంటుంది. కాని పశ్చాత్తాపంను ప్రకటించడం కూడదు.

7) విశ్వద వేమనకు ప్రియమైన ఒక వేశ్య పేరనీ, దానిపై మక్కువతో ఇట్లా పేర్కొన్నాడని వివరిస్తూ వేమన యోగాన్ని తగులబెట్టారు కొందరు. దీనిలో ఎంత మాత్రం సత్యంలేదు. పూర్తిగా ఖండించ తగిన వ్యాఖ్యానం . ఇదెవరో వేమనంటే గిట్టని వారు పుట్టించిన వదంతి మాత్రమే.

ఈ విధంగా 'విశ్వదాభిరామ వినుర వేమ' అను మకుటానికి సరియైన , సమగ్రమైన అర్థాన్ని పూర్వపు పండితులు అందించ లేక పోయారు. దీనికి కారణం వేమన యొక్క పూర్తి స్వరూపం తెలియకపోవడం. ఆతని సిద్ధాంతాన్ని సమగ్రంగా అర్థం చేసుకోకపోవడమేనని తెలియబడింది.

వేమన 'విశ్వదాభిరామ వినుర వేమ' అనే మకుటంలో ఏదో ప్రాపంచికమైన, సరళమైన విషయాన్ని ఇమడ్చలేదు. కేవలంగా తాత్విక పరమైన ఆతని సిద్ధాంత రహస్యాన్ని మాత్రమే ఆ మకుటంలో నిక్షిప్తం చేశాడు. అందువల్లనే ఈ మకుటం చాలా ప్రాచుర్యం పొందింది. ఇప్పటికినీ ఈ మకుటార్థం శ్రీ శివరామ దీక్షితీయ అచల పరిపూర్ణ రాజయోగ సాంప్రదాయకులలో వ్యాప్తిలో వున్నది. ఎవరేమి చెప్పుకున్నా 'విశ్వదాభిరామ వినుర వేమ' అనే మకుటం వేమన పద్యాలకు మణి కిరీటమే.

మూడవ అధ్యాయం

# గురువు

సాధారణంగా కవులందరు కావ్యాల లేక గ్రంథాల ప్రారంభం ముందుగా దైవ ప్రార్థన చేస్తారు. ఎవరెవరి ఇష్టదైవాన్ని వారు వారు స్తుతిస్తారు. కాని వేమన మాత్రం ఏ దైవాన్ని ఎచ్చటా తన పద్యాలలో స్తుతించలేదు. పైగా విగ్రహారాధనలను, మతవిధానాలను, మరియు యజ్ఞయాగాది క్రతు విధానాలను వేమన నిర్ద్వంద్వంగా ఖండించాడు. వేమన సిద్ధాంతం ప్రకారం ప్రపంచంలో వున్న సర్వజీవులలో ఉత్కృష్టమైన వాడు మానవుడే. ఒక్క మానవుడే మాధవుడూ కాగలడు. రాక్షసుడూ కాగలడు. మానవుడు సర్వశక్తి సంపన్నుడు. త్రిమూర్తులను సైతం పతివ్రతా ధర్మంతో పసిపిల్లలనుగ మార్చిన అనసూయదేవి మానవ మాత్రురాలే. యమధర్మరాజును సైతం ఒప్పించి భర్త ప్రాణాలను సాధించుకొన్న సతీసావిత్రీ మానవ మాత్రురాలే. దేవేంద్రున్ని సైతం శపించిన గౌతమమునీ మానవమాత్రుడే. తండ్రి వాక్య పరిపాలనం, ఒకే బాణం, మరియు ఒకే మాటగా ప్రవర్తించిన శ్రీరాముడూ మానవుడే. సృష్టికి ప్రతిసృష్టి చేసిన విశ్వామిత్రుడూ మానవుడే. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ప్రపంచానికి గీతామృతాన్ని పంచిన శ్రీకృష్ణుడూ మానవుడే. ఈ మహనీయులందరు వారి వారి గురువుల నుండి బ్రహ్మతత్వమును గ్రహించి, దానిని ఆచరించి ప్రపంచ ప్రసిద్ధిగాంచిన వారే. గురువులు లేకుండా ఆ మహానుభావులందరు ఉత్తమ స్థానమును పొందియుండక పోవుదురు. గురువు లేకుండా గురువు యొక్క విగ్రహమును ఆరాధించుచు , విద్య నేర్చిన ఏకలవ్యుడు పొందిన గతి లోకమునకు విదితమే కదా. శివునికైననూ, కృష్ణునికైననూ గురువున్నది లోకమునకు తెలిసినదే. కనుక ఎంతటి వారికైననూ గురువు అవసరమే. కావున ఉత్తమ గ తిని కలుగజేయు గురువు యొక్క ఆవశ్యకతను గూర్చి వివరించుచు, నిజమైన గురువెవరో తెలియజేయుటే ఈ మూడవ అధ్యాయం యొక్క లక్ష్యము.

కనుక ఎవరైతే బ్రహ్మతత్వమును తెలిసికొని లోక శ్రేయస్సుకోసం తమ తమ బలధన విద్యలను ధారపోస్తారో వారందరూ మాధవులే. అంటే దేవుళ్ళే. మరియు ఎవరైతే తమ స్వార్థం కోసం బలధన విద్యలను దుర్వినియోగ పర్చి లోక కంటకులుగా మారుతారో వారే రాక్షసులు. కనుక సమాజ శ్రేయస్సు కోసం శ్రమించే తత్వజ్ఞుడైన మానవుడే పూజనీయుడు. ఆతడే దైవము. కనుక వేమన తన పద్యాలను తన గురువగు లంభికా శివయోగిని స్తుతిస్తూనే మొదలు పెట్టాడు.

కం॥ శివ కవులకు నవ కవులకు
శివ భక్తికి తత్త్వమునకు చింతామణికిన్
శివలోక ప్రమథులకును
శివునకు గురునకు శరణు సేయర వేమా ॥ 1

శివ అనగా ప్రకాశము. ఈ ప్రకాశము అగ్ని సంబంధమైనది కాదు. సర్వమునకు మూల కారణమై స్వయం ప్రకాశరూపమైనది ఆత్మయే. కనుక ఆత్మయే శివం. ఆత్మయే సర్వమునకు ప్రకాశమిచ్చునదియై యున్నది. అట్టి ఆత్మను గూర్చి సంపూర్తిగా తెలిసికొని, ఆచరించు కవులను శరణుసేయుమని వేమన చెప్పుచున్నాడు. ఇచట కవియనగా ఆత్మతత్వమును తెలిసికొని తెలియచేయువాడని అర్థము.

స్వయం ప్రకాశ స్వరూపమైన ఆత్మయే నవవిధ ద్రవ్యములుగా పరిణామము చెంది అండ, పిండ, బ్రహ్మాండ రూపముగా కనిపించుచున్నది. నవవిధ ద్రవ్యములు ఏవి యనగా ఆత్మ, మనస్సు, కాలము, దిక్కులు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వీ. వీటి యొక్క పదార్థ నిర్ణయము సద్గురువుచే ఉన్నది వున్నట్లు తెలిసికొని, తెలియజేయువారే నిజమైన నవ కవులు. కాని ఏవో కొన్ని ప్రాపంచిక సంబంధమైన పద్యములో, గద్యములో వ్రాసిన వారు కవులు కారు. కనుకనే 'క్రాంత దర్శియే కవి' యని వైదిక నిర్వచనము. కనుక స్వయం ప్రకాశ బ్రహ్మమును గూర్చి వస్తు నిశ్చయ పద్ధతిగా స్థాన, స్వరూప, స్వభావములను నవవిధ ద్రవ్యముల యందు ఉన్నది వున్నట్లుగా తెలియజేయు నవ కవుల శరణుజేరి ముక్తి మార్గము వైపు పయనించుమని వేమన ప్రబోధించుచున్నాడు.

తత్ అనగా సర్వమునకు ఆధారమైన స్వయం ప్రకాశ బ్రహ్మము (శివము). త్వం అనగా ఆధేయ రూపముగా నున్న జీవుడు. ఇవి రెండు ద్వంద్వ పద్ధతిగా కనిపించుచున్ననూ, విచారించి చూడగా ఏకముగా తెలియబడును. ఇలా అభేద దృష్టితో చూడటమే శివ భక్తి. భక్తి అనగా ఏకత్వము. విభక్తి అనగా అనేకత్వము. కనుక సర్వజీవరాశుల యందు ఆత్మను, ఆత్మయందు సర్వజీవరాశులను చూడటమే శివ భక్తి యని చెప్పనొప్పును.

ఇదియే తత్వం = తత్+త్వం. ఇలా భక్తి పద్ధతిని తెలిసికొని, ప్రకాశ పద్ధతియందు ప్రవర్తించువారు 'చింతామణి'ని కలిగి యున్నవారౌదురు. చింతామణి అనగా చింతనా ధోరణి యందు ప్రకాశ (మణి) పద్ధతి కలిగియుండుట. కనుక ఆత్మతత్వమును సంపూర్తిగా తెలిసికొని, ఆ పద్ధతి యందు ప్రవర్తించు వారు ఎల్లప్పుడు చింతామణిని కలిగియున్న వారౌదురు.

ఇక శివలోక ప్రమథులకును శరణుసేయుమని వేమన చెప్పుచున్నాడు. శివలోక ప్రమథులనగా నెవరు? శివతత్త్వము ( ఆత్మ తత్త్వము)ను తెలిసికొని, ఆచరణ విధానము కలిగిన వారే శివలోక ప్రమథులు. అట్టివారి శరణు పొంది, ఆత్మతత్త్వమును తెలియుండని వేమన బోధించుచున్నాడు. శివలోకమునే కైలాసమని కూడా అంటారు. కైలాసము అనగా విలాసములు లేనిది.

శివునకు శరణు పొంది ఆత్మ ఆత్మతత్త్వమును తెలిసికొనవలెను. శివుడనగా ఎవరు? శివుడు అనగా ఆత్మ. ఆత్మతత్త్వమును తెలిసికొని, దాని యందు అహంకారమును వర్జించి అణగి మణగి యుండుటే శరణుపొందటము. ఇక గురువు అనగా ఎవరు?

**'శ్లో॥ గుకారశ్చ గుణాతీతం రుకారం రూపవర్జితం ।**
**గుణరూప విహీనత్వ గురురిత్యభిధీయతే ॥ ' (గురుగీత)**

అనగా గుణరూపములను నశింపజేయువాడే గురువు.

శివతత్త్వమునెరిగి గుణరూపములను రహితము చేయు గురువు యొక్క శరణుపొందిన వానికి మాత్రమే శాశ్వతముగ జననమరణ భ్రాంతి రహితము కాగలదు. కనుక అట్టి గురుమూర్తిని చేరి శరణు పొందుమని వేమన మేల్కొల్పుచున్నాడు.

**ఆ॥ వేమ ననగ యోగి వెలసె లోకములోన**
**పూజ లిడుడు పుణ్య పురుషులార**
**పూజ లిడిన యంత భుక్తి ముక్తుల నిచ్చు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 2**

వేమన పై పద్యాన్ని శిష్యులకు బోధనా క్రమంలో మొట్టమొదటగా చెప్పిన పద్యమై వుంటుంది. సృష్టికి మూలకారణమైన పదార్థమేదో దాని స్థాన, స్వరూప, స్వభావాలను ఉన్నదున్నట్లు తెలిసికొన్న వారే ఋషులు. తెలిసికొన్న విధానాన్ని ఆచరణలో పెట్టిన వారే యోగులు. ఆ విధంగా యోగియైన వేమనను పూజించిన పుణ్యపురుషులకు భుక్తి ముక్తులు కలుగ గలవు. వేమన భాషలో తాను బోధించిన విధానాన్ని, శిష్యులు ఆచరించడమే తనకు పూజ. ఈ విధంగా వేమనను పూజించిన వారికి భుక్తి ముక్తులు కలుగును. వారే పుణ్యపురుషులు. అలా కాక వేమన ఫోటో పెట్టుకొని

పుష్పగంధాక్షతాదులతో, శ్లోక పఠనాదులతో కొబ్బరికాయలు కొట్టడం నిజమైన పూజ కానేరదు. అది బాహ్యామైనదేయగును.

శిష్యుని ప్రథమ కర్తవ్యము గురుని పూజించుట. శిశు తరగతికి పోయే విద్యార్థికి ఉపాధ్యాయునికి నమస్కారం చేయాలని తెలియదు. కాని ఉపాధ్యాయుడే తనకు నమస్కారం చేయుమని ఆ విద్యార్థి బాగు కోరి నేర్పిస్తాడు. అయితే ఇది ఉపాధ్యాయుని ఆత్మస్తుతికాదు. అట్లానే, వేమన తనను పూజించుమని అంటే తాను ఉపదేశించిన విధానాన్ని ఆచరించుమని చెప్పాడు. అందువల్ల మీకు భుక్తి, ముక్తులు ఆ పూజా ఫలంగానే ఇవ్వబడతాయని చెప్పాడు. అంటే ఎంత మేరకు ఆచరిస్తే అంతే ఫలం వస్తుందని అర్థం.

కనుక వేమన ఇతర కవులవలె ప్రారంభంలో ఇతర దేవతల స్తుతి చేయనేలేదు. వేమన గురువును మించిన దైవము లేడని, గురువునే పూజించుమని తెలియజేశాడు. కనుకనే 'ఎన్న గురుని కన్న ఎక్కువ లేరయా?' అని వేమన వాక్యము.

'సర్వ శరీరస్థ చైతన్య బ్రహ్మ ప్రాపకో గురు రుపాస్యః' అని నిరాలంబ ఉపనిషత్తు చెప్పుతుంది. కనుక సర్వజీవుల శరీరములందు వున్న చైతన్యబ్రహ్మమును పొందించు గురువు వేమనార్యుడు గనుక పూజించదగినవాడు. కనుకనే వేమన గురువునకు విశిష్టమైన స్థానమును ఇచ్చాడని తెలియనగును.

**ఆ॥ ఉత్తమోత్తముండు తత్వజ్ఞుడిల మీద**
**మహిమ జూపు వాడు మధ్యముండు**
**వేషధారి యుదర పోషకుడధముండు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 3**

సర్వజీవరాసులలో మానవుడు ఉత్తమమైనవాడు. అయితే మానవులలో ఎవరు ఉత్తమోత్తముడు? అంటే తత్వజ్ఞానియే ఉత్తమోత్తముడని వేమన సమాధానం. తత్వజ్ఞుడు ఎవరు? అంటే, తత్వవిచారణ ద్వారా సృష్టి, స్థితి, లయాలకు కారణభూతమైన బ్రహ్మమును స్థాన, స్వరూప, స్వభావ నిర్ణయం చేసిన జ్ఞానియే తత్వజ్ఞుడు. ఇట్టి తత్వజ్ఞుడే నిజమైన గురువు. ఇతను

ఉన్నదున్నట్లుగా, వస్తు నిశ్చయంగా సకలంను గ్రహించి వుంటాడు. వీరి యొక్క ఆచరణ లోక సంగ్రహంగా వుంటుంది. కీర్తి, కాంతా, మరియు కనకములకు వీరు దాసోహులు కారు. లేనిపోని మహిమలు చూపించరు. మహత్తులు అసలే చేయరు. ఉన్నది ఉన్నట్లు, లేనిది లేనట్లు చూపువాడే సత్యవాది. పాలను పాలగాను, నీరును నీరుగాను చూపువాడే ఋజువర్తనుడు. ఇట్టివాడే నిజగురువు. ఇక వేమన చూపులో మహిమ జూపే వాడు మధ్యముడే.

ప్రకృతి పరిశోధన చేసి మహిమలను సంపాదించి ప్రజలను ఆకర్షించి ధనాన్ని, కీర్తిని పొందగలడు, కాని ఆతడు సత్యాన్ని తెలిసికోలేడు. లేనిది ఉన్నట్లు, ఉన్నది లేనట్లు ప్రజలను భ్రమింప చేయకలడు. కాని ఆతడు పరమార్థాన్ని తెలిసికోలేడు. పై పెచ్చు స్వార్థం పెరిగినచో, ఆ మహిమలను స్వార్థం కోసం ఉపయోగించి రాక్షసుడుగా మారగలడు.

అణిమాది అష్ట సిద్ధులనే మహిమలను సాధించిన ఆంజనేయుడు, ఇవి తెలియని శ్రీరాముని ముందు శిష్యునిగా తల వంచాడు. ఎందుకోసం? ఉత్తమోత్తమమైన అధ్యాత్మ విద్య కోసమే కాదా? కనుక మహిమ జూపువాడు మధ్యముడే. ఇక కూటికోసం వేషాలు వేసేవాడు అధముడు. కొందరు సులభంగా భుక్తిని సంపాదించుట కొరకు వివిధ రకాల వేషాలు వేస్తుంటారు. వీరికి తత్వవిచారణ తెలియదు, మహిమలూ రావు. వీరు అధములు. కనుక తత్వజ్ఞుడగు గురువే ఉత్తమోత్తముడు అని వేమన నిర్ణయం.

**ఆ॥ లోకములకు గురువు లోకులకును గురు**
**వదియు దెలసి మోక్షమందరోరి?**
**గురుని గనక నరక కూపము బొందిరి**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 4**

వేమన గురువునకు విశిష్ఠ స్థానం ఉందని గుర్తించాడు. లౌకిక విద్యలకే గురువు అవసరం. ఇక పారమార్థిక విద్యకు గురువు అత్యవసరం. గురువు లేకుండా గురుతు నిలువదంటాడు. గురువు లేకుండా నేర్చిన విద్య నీళ్ల మీద వ్రాసిన వ్రాత వంటిందంటాడు, వేమన. వేమన గురువు సాధారణ గురువు కాడు. ఈతడు లోకములకు గురువు. అంటే లోకాలన్నింటిని అధిగమించిన వాడు. వాటిలో వున్న లోకులకును గురువు. అట్టి గురువును వెదికి చేరి తత్వాన్ని తెలుసుకొన్నవారికే మోక్షం. అట్టి గురువును చేరని వారు దుఃఖ భూయిష్టమైన ఈ

సంసారసాగరం(నరక కూపం)లో కొట్టు మిట్టాడుచూనే వుంటారు. 'గురూన్ముఖేన జ్ఞాతవ్యం నాఽన్యథా గ్రంథకోటిభిః' - గురువు వల్లనే జ్ఞానం సిద్ధిస్తుంది. కాని కోటి గ్రంథాలను చదివినను జ్ఞానం సిద్ధించదు. కనుక గురువు ప్రాముఖ్యతను గుర్తించవలసివున్నది.

**కం॥ సద్గురు కృప జ్ఞానంబున**
**సద్గతి దీపింపుచున్న చాలా చదువుల్**
**సద్గతి గలుగగ జేయును**
**సద్గురువే దైవమనుచు జాటర వేమా ॥** **5**

సద్గురు కృపలేక జ్ఞానము కలుగదు. సద్గురు కృపచేత శిష్యునికి జ్ఞానము కలిగి, అభివృద్ధి చెంది సద్గతిని పొందుచున్నాడు. ఆ శిష్యునికి ఇంకా చదువవలసిన చదువులు లేవు. కనుక శిష్యునికి సద్గతిని కలుగచేసెడి సద్గురువే దైవమనుచు వేమన చాటించుచున్నాడు. ఈ విషయమునే

**'శ్లో॥ యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ ।**
**తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥'**

అని శ్రీ శంకర భగవానుడు కూడా పార్వతీదేవికి గురు గీతయందు బోధించియున్నాడు. దీనినే గీతాచార్యుడు

**'శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥'**

అని ఉపదేశించాడు.

కనుక బ్రహ్మాతత్వమును ఉపదేశించి, సద్గతిని కలుగ జేసెడి సద్గురువే దైవమని వేమన నిర్ణయం.

**ఆ॥ ఎచట జూడ్కి నిలిపి యెందాక చూచిన**
**నచట దోచు కళల నంద రాదు**
**అచల వ్యక్తి యరగి యందుట మోక్షంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **6**

మోక్షాపేక్షగల మానవులు ఆత్మ సాక్షాత్కారం కోసం అష్టాంగయోగాలను, ముద్రలను ఎంతో కష్టముతో చేసిననూ ఆత్మయొక్క నాద, బిందు, కళలను తెలుసుకోలేరు. ఆత్మతత్వమును అచల ఋషులను చేరి తెలుసుకుంటే మోక్షము సులభంగా కలుగుతుందని వేమన తెలియచేశాడు. ఇచట అచల వ్యక్తి అనగా ఎవరు? చలనము లేనిదే అచలము. ఎరుక (బ్రహ్మము) కదలనట్టు అనిపించిననూ, నిరంతరము రాగి చెట్టు ఆకులవలె కదలికను కలిగివుంది. భూమిపైన వున్న మనకు భూమి నిశ్చలంగా వున్నట్టు అనిపిస్తుంది. కాని భూమి నిశ్చలంగాలేదు. నిరంతరం క్షణమైననూ ఆగకుండా తన చుట్టూ తాను తిరుగుచూ సూర్యుని చుట్టూ తిరుగుతూ వుంది. ఇదే అకర్మలో కర్మ.

అలాగే అనేక పనులను మన శరీరం కదులుతూ చేస్తుంది. కాని విమర్శన చేస్తే శరీరం ఆత్మచైతన్యం లేకుండా ఏ ఒక్క పనైననూ చేయలేదు. కనుక ఆ ఆత్మచైతన్యమే తాను కదులుతూ, ఈ జడమైన శరీరాన్ని కదిలిస్తుందని తెలియబడింది. ఇదే కర్మలో అకర్మ. ఇచట కర్మ, అకర్మలు సాపేక్షికాలు మాత్రమే. నక్షత్ర మండలాల నుండి పరమాణువులలోని అతిసూక్ష్మ కణాల వరకు కూడా సర్వము కదలిక కలిగే వున్నాయి. కనుక ఎరుక అంతయూ కదలిక కలిగియున్నది. కదలిక లేనిదే అచలము. అదే పరిపూర్ణ బ్రహ్మము. దానినే అచల వ్యక్తి(అచల గురువు) అనగా అచలాన్ని దర్శించిన గురువు ద్వారా తెలుసుకున్నప్పుడే మోక్షము సిద్ధించగలదని అచలర్షి అయిన వేమన యోగి వివరించుచున్నాడు.

**ఆ॥ రాజయోగమూని తేజమందుట ముక్తి**
**తేజమందకున్న దేబె లరయ**
**మర్మరహిత గురుని మరి చేర వలెనయా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **7**

రాజయోగ మార్గమును అనుసరించు మర్మరహితుడగు గురువును చేరి ఆత్మ తత్వమును తెలుసుకొనుటచే ముక్తి. ఇలా ఆత్మ తత్వమును తెలుసుకోలేని వాడు వ్యర్థుడని వేమన తెలిపినాడు. ఇచట మర్మరహిత గురుడు అనగా ఎవరు? ఒక చోట వేమన 'మర్మమెరుగలేక మతముల గల్పించి' అని అన్నాడు. కనుక మర్మము అనగానేమి?

మర్మము అనగా రహస్యం. గీతా శాస్త్రమునందు దీనినే 'రహస్యం హ్యేతదుత్తమమ్' అని చెప్పబడివుంది. రహస్యమైనది బ్రహ్మమేనని తెలియవలెను. ఆ బ్రహ్మమునే ఎరుక అనియూ, మర్మమనియూ వేమన పలుపద్యాలలో తెలియజేసి వున్నాడు. కనుక ఇచట మర్మరహిత గురుని అనగా ఎరుక రహిత గురునిగా అర్థము చేసుకోవలెను. కనుక ఏ గురువైతే ఎరుక తత్వాన్ని సంపూర్తిగా తెలుసుకొని ఎరుకను విడిచి వున్నాడో, ఆ గురువే శిష్యునికి ముక్తి నొసగగలడు. కాని మిగతా గురువులు అందరూ ఎరుకలోని వారేనని తెలియవలెను. కనుక మర్మరహిత గురున్ని మాత్రమే దరిజేరుమని వేమన ఉద్బోధించుచున్నాడు.

**ఆ॥ గురువులేక విద్య గురుతుగా దొరకదు**
**నృపతి లేక భూమి తృప్తిగాదు**
**గురువు విద్యలేక గురుతర ద్విజుడౌనె?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 8**

గురువులేకుండా విద్య గురుతుగా నిలువదంటున్నాడు వేమన. నృపతి(రాజు) లేకుండా రాజ్యములో శాంతి వుండదు. గురువు విద్యలేక జనుడు ద్విజుడు కాలేడని వేమన బోధించుచున్నాడు.

**ఆ॥ దైవ మతుల నరులు తమవంటి వారని**
**యరసి గూఢ తత్వ మరయ లేరు**
**ఇట్లు మాయ పడిన నెట్లు మర్మము దెల్సు?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 9**

గురువే దైవము. సాక్షాత్తు దేవుళ్లైన గురువులను మనుజులు తమవంటి సాధారణ మానవులేనని తలంచి, వారిని సేవించి నిగూఢతత్వమును తెలిసికోరు. ఇలా మాయలో చిక్కిన మనుజునికి మర్మము ఎలా తెలియును ? తెలియదు అని వేమన వచించుచున్నాడు.

**తే॥ సకల శాస్త్రంబులెల్లను జదువు వారు**
**చదువుకోనట్టి వారితో సమము గారె?**
**గురుముఖంబున ననుభవం బరయకున్న**
**విశ్రుతంబుగ జగమున వినుర వేమ ॥ 10**

గురుముఖమున పరమాత్మ తత్త్వమును స్థాన స్వరూప స్వభావ నిర్ణయంగా తెలిసికొన్న వారు సకల శాస్త్రములను చదివిన వారితో సమానము. గురువు లేకుండా, స్వయంగా సకల శాస్త్రాలను చదివి, కంఠస్తం చేసిననూ వారు ఏ చదువులు చదువుకోనట్టి వారితో సమానము. అట్టి వారికి అనుభవ జ్ఞానము సున్న. కనుక ఆధ్యాత్మిక తత్వవిచారమునకు గురువు అత్యవసరమని వేమన నొక్కి చెప్పుచున్నాడు.

ఆ॥ **గురువు యనెడు పేరు గురువయి యుండును**
**గురువు చేత గాదె గురుపదంబు**
**గురువు యెన్న జ్యోతి గూడగా వలె గదా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 11**

'గురువు' అని పేరు ఒక వ్యక్తికి ఎప్పుడు వచ్చును? ఆ వ్యక్తి గురుతత్త్వమును ఎరిగి గురుస్వరూపంను పొందినప్పుడని చెప్పవచ్చును. అసలు 'గురువు' అనగానెవరు? గురు- అనగా పెద్దది. దేనికన్న పెద్దది? అన్నింటికన్నా పెద్దదని అర్థం. అన్నింటికన్నా పెద్దది ఈ బ్రహ్మాండమే. కనుక ఈ అఖండ బ్రహ్మాండమంతయూ తానేనని, జీవతత్త్వమును విడిచి పరమాత్మ స్వరూపంగా యున్నవాడే నిజమైన గురువు. అట్టి వానికన్నా బలవంతుడులేడు. అట్టి పరమాత్ముని స్వరూపంగా వున్న గురువు వ్యక్తి రూపంగా కనుబడుచుంటాడు సామాన్య మానవులకు. ఆ సామాన్య మానవులు ఈ గురువు చేతనే గురుపదంబు (అఖండరూపమైన, ఏక స్వరూపమైన గురుపదము)ను గాంచగలరు. అజ్ఞానాంధకారంలో యున్న మానవులకు గురువే జ్యోతి యగు చున్నాడు. కనుక గురువును చేరుకొని జ్ఞాన మార్గం వైపు పయనించుమని వేమన హితవు చెప్పుచున్నాడు.

ఆ॥ **గురుచరణము బట్ట కుక్కలు గరుచునా?**
**గురు చరణము విడువ కుక్క గరుచు**
**కుక్క కున్న గుణము గురునకు లేదురా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 12**

పరమాత్మ తత్త్వమును బోధించు గురువు పరమాత్ముడే గాని అన్యుడుగాడు. అట్టి గురువును చేరి వారి శ్రీపాదమును పట్టినచో కుక్కలు కరువవు. ఇచట కుక్కలు అనగా రజోగుణ సంబంధములైన ఆశలు. కనుకనే వేమన 'కుక్క వంటి యాశ కూర్చుండ నివ్వదు' అని అన్నాడొక చోట. ఇచట 'చరణము' అని ఏక వచనము ఉపయోగించారు వేమన. చరణమనగా పాదము.

ఒకే పాదము ద్వంద్వరూప ఏకత్వమును సూచిస్తుంది. మనకు రెండు పాదములున్ననూ ఒకే నడక. రెండు చెవులునన్ననూ ఒకే ధ్వని. రెండు కన్నులున్ననూ ఒకే చూపు. రెండు నాలుకలున్ననూ ఒకే మాట. అదే విధంగా ప్రకృతీ పురుషులు, జ్ఞానాజ్ఞానములు, ప్రకాశాప్రకాశములు, దేహీ దేహోలు, సగుణనిర్గుణములు, ఆకారనిరాకారములు, జీవేశ్వరులు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములన్నియు అఖండరూప బ్రహ్మాండ నిర్ణయమందు ఏకమగు గురు స్వరూపముగా తెలియబడును. అట్టి గురునకు ఒకే పాదము అని నిర్ణయము. అట్టి ఏకత్వ నిర్ణయపద్ధతిని ఆచరించుటే గురుచరణమును పూజించుట. ఇట్లు గురువును పూజించు నరున్ని కుక్కయనే ఆశ కరువబోదు. అనగా బాధించదు. అలా గురువు జూపిన ఏకత్వ నిర్ణయమును వదలి వ్యష్టి భ్రాంతులకు లోనై సంచరించువాడు ఆశల సుడిగుండంలో పడి కుక్కలచే కరువబడిన పిచ్చివాడి వలె తిరుగుచూ గమ్యము తెలియక ఈ సంసార సాగరం నుండి తరించలేడు.

కుక్క కున్న గుణమేది? కుక్కకు రజోగుణమున్నది. ఎందుకనగా కుక్క మాంసమును మిక్కిలి ప్రీతితో తినును. రజోగుణము వల్ల రాగాదులు పుట్టును. రాగాదులు అనగా ఆశ, ఆసక్తి, మమకారము మొదలగునవి. ఇట్టి రజోగుణ సంబంధమైన రాగము మనిషిని కర్మ ప్రవృత్తియందు బద్ధుని గావించుచున్నది. కాని సద్గురువై నటువంటి వాడు గుణాలకు అతీతుడు గనుక కుక్క కున్న రజోగుణము గురునకు లేదని వేమన నుడువుచున్నాడు. కనుక ఆశలేని వాడే నిజమైన గురువని వేమన ప్రవచించుచున్నాడు.

**కం॥ గురుడనగా మొదలంతకు**
**గురుశిష్యు లనంగ నెల్ల కొమ్మలు కాగా**
**గురువును గానగ జాలరు**
**ధర లోపల మనుజు లెల్ల తలపరు వేమా ॥ 13**

గురుడనగా ఈ సృష్టియంతటికీ మూలమైన వాడు. అనగా ఈ సంసార వృక్షమునకు గురువు బీజము వంటివాడు. ఆ బీజమే వృక్షమై శాఖోపశాఖలుగ విస్తరించియున్నది. ఆ వృక్షమునకు చివరన యున్న కొమ్మలే అనగా జీవులే శిష్యులు. ఆ పరమాత్మ స్వరూపమైన గురువు నుండియే జీవరూపమైన శిష్యులు ఉదయించిరి. అయిననూ ఆ గురుపరమాత్మను గాంచలేరు. అట్టి పరమాత్మను మానవరూపములో నున్న వాడికి, పరమాత్మ స్వరూపమును పొందిన గురువే చూపించగలడుగాని అన్యులకు తరముగాదని వేమనార్యుడు బోధించుచున్నాడు.

ఆ॥ గురువు చెప్ప విద్య గురునకు దెలుసును
గురువు చెప్ప విద్య గురువు యెరుగు
గురువు మహిమ పరమ గురునకు దెలుసును
విశ్వదాభిరామ వినుర వేమ ॥ **14**

గురువు చెప్పు విద్య మరొక గురునకే తెలుసును. కాని వేరొకరికి తెలియదు. పూర్ణ గురువు చెప్పు విద్య గురుతత్వము పొందిన గురునకే తెలియబడను. గురువు (అఖండరూప బ్రహ్మాండము) యొక్క మహిమ (రహస్యము) పరమ గురువగు పరిపూర్ణ గురునకే తెలుసునని వేమన వక్కాణించుచున్నాడు.

ఆ॥ నరుడటు పరమాత్మ గురుని జేరినపుడు
హస్త మందు మోక్ష మపుడె చూపు
విరివి సంపదలను వి|రవీగిన జీవి
పర మెరుగక యముని పాలు వేమ ॥ **15**

అజ్ఞానాంధకారంలో మ్రగ్గుచున్న నరుడు పరమాత్మ స్వరూపుడైన గురుని చేరి సేవించినచో, ఆ గురు పరమాత్ముడు వాడికి అరచేతిలో మోక్షాన్ని చూపును (అనగా అతి దగ్గరలోనున్న పరిపూర్ణ బ్రహ్మమును చూపును). వాడు ఏ గుడిగోపురాలను, తీర్థక్షేత్రములను తిరుగకయే గురువు చెప్పు విద్య ద్వారా మోక్ష పదవిని పొందగలడు. అలాగాక బల ధన విద్యా మదములతో విఱ్ఱ వీగువాడు దైవస్వరూపుడగు గురువును తన వంటి నరుడేనని తలచి; వారిని చేరి, సేవించి, నిగూఢ తత్వమగు పరమును తెలిసికోలేరు. అట్టివారు చివరకు యముని పాలుగాక తప్పించుకోలేరని వేమన ప్రవచించుచున్నాడు.

ఆ॥ తాను విమలుడైన తన గుణమంతయు
శివుని కీని గురువు చెడుగు గురువు
గుడ్డి గు|రమెక్కి గుడి దిర్గి నట్లౌను
విశ్వదాభిరామ వినుర వేమ ॥ **16**

తాను విమలుడు కావలెనన్నచో తన గుణములన్నింటికి మూలమైన ఎరుక (బ్రహ్మము)ను లంభికా శివయోగికి గురుదక్షిణగా దానమీయవలెను. అలా ఇవ్వని గురువు చెడ్డ గురువు. అట్టి

గురువు తన శిష్యులను కూడా చెడగొట్టిన వాడగును. గుడ్డి గుఱ్ఱాన్ని ఎక్కి మనుజుడు ఏ విధంగానైతే గుడి చుట్టు తిరుగలేడో, అట్లే త్రిగుణస్వరూపమైన ఎరుకచే కప్పబడిన చెడుగు గురువు ద్వారా శిష్యుడు సత్యమైన నిత్యమైన పరిపూర్ణ బ్రహ్మమును గాంచ లేడని వేమన ఉదహరించుచున్నాడు.

ఆ॥ మతము కొక్క గురుని మరియు గల్పించుక
ముక్తి నొక్క డైన మొనయ లేడు
సిగ్గులేని గురుల జేరి పూజింతురు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ । 7

ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క గురువుని కల్పించుకొనినాడు మానవుడు. అట్టి మతగురువులను చేరుకొని ఏ ఒక్కడైననూ ముక్తిని బడయలేడు. కనుకనే వేమన 'మతములందు ముక్తి వెదకిన లేదయా' అని మరో చోట చెప్పియున్నాడు. కనుక అట్టి సిగ్గు లేని మత గురువులను పూజించుట వ్యర్థమని వేమన హితవు చెప్పుచున్నాడు. కాని మతాలన్నింటికి అతీతుడైన అచల పరిపూర్ణ గురు రాజయోగి మాత్రమే మానవునికి ముక్తి నొసగ గలడని వేమన యోగి అభిప్రాయము.

ఇచట మతగురువులను సిగ్గులేని గురువులని చెప్పినాడు వేమన యోగి. ఎందుకనగా అచల పరిపూర్ణ బ్రహ్మములో లేని ఎరుకను లేనే లేదనక, ఎరుకలో కొంత లేని మాయ వున్నదని, పిదప మహావాక్య నిర్ణయించే ఆ మాయ లేదనుచు సిగ్గులేక కొందరు మతగురువులు చెప్పినారు. ఇది శరీరానికి తానే పీతి పూసుకొని మరల పనిపూని కొంచమైననూ సిగ్గులేక కడుక్కొనుటవలె నున్నది. ఇంకొక విధంగా విచారించినచో, ఆ అచల పరిపూర్ణబ్రహ్మమునందు తానే లేనని తెలిసి తనకే సిగ్గై తానే శూన్యమని యూరకయుండును అచలయోగి. మతవాదులట్లుగాక ఎరుక శూన్యమని తెలిసికోక, దానియందే అనేక మతములు కల్పించుకొని, తమ లేమి ఎరుగక సిగ్గులేని వారలుగా ప్రవర్తించుచుందురు. అజ్ఞాన దశలో యుండి తన స్వస్వరూపము గాంచని బాలుడు సిగ్గులేక నగ్న చేష్టలు చేయు విధమున, మతగురువుల చేష్టలున్నాయని వేమన యోగి ప్రవచించుచున్నాడు.

ఆ॥ గురువు తానయైన హరుని దా జూపును
బ్రహ్మ లోక మతడు పార జూపు
శిష్యు నరసి పట్టి చీకటి బాపురా
విశ్వదాభిరామ వినుర వేమ ॥ । 8

మామూలు మానవుడే గురుతత్వమును గురువు ద్వార గుర్తెరిగి గురుస్వరూపమును పొంది గురువు తానుయైన హరున్ని( శివ రూపమును) శిష్యులకు చూపించగలడు. బ్రహ్మాది లోకములను కూడ చూపించి వాటియందలి భ్రమలను పోగొట్టగలడు. ఆ లోకములన్నింటికి అతీతంగా వున్న పెంజీకటిని కూడా బాపివేసి శిష్యునికి ఆత్మజ్యోతిని గురువు చూపించగలడని వేమన వచించుచున్నాడు. కనుక గురువు యొక్క విశిష్ఠత గుర్తించవలసి యున్నది.

ఆ॥ తల్లి దండ్రు లెన్న తన మొదలి గురులు
పార్వతీ భవులును పరమ గురులు
కూలి కాండ్ల జగతి గురులన ద్రోహంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 19

ఎంచి చూడగా తన తల్లిదండ్రులే తనకు మొదటి గురువులు. ఎందువల్లననగా తాను పుట్టినదాదిగా తనకు లోకవ్యవహారమునకు సంబంధించిన విషయ పరిజ్ఞానమును బోధించి, ఆచరింప చేయుదురు గనుక. ఆ పిదప పారమార్థికమును గూర్చి ప్రబోధించిన శివయోగి, ఆతని సతీమణి పార్వతి వేమనకు పరమ గురువులు. ఈ పరమ గురువులు లోకశ్రేయస్సుకై నిస్వార్థముగా పరతత్వమును బోధించియున్నారు. వారే నిజమైన గురువులు. అలాగాక డబ్బు కొరకు ఉపదేశాలిచ్చువారిని గురువులని చెప్పుట ద్రోహమని వేమన బోధించుచున్నాడు. ఇచట ఆత్మ తత్వమును ఉపదేశించు గురువే శివుడు మరియు ఆతని భార్యయే పార్వతి యని తెలియవలెను.

ఆ॥ కల్ల గురుడు గట్టు నెల్ల కర్మంబుల
మధ్య గురుడు గట్టు మంత్రచయము
ఉత్తముండు గట్టు యోగ సామ్రాజ్యంబు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 20

కల్ల( అధమ) గురుడు కర్మములను మూట కట్టుకొనుటకు బోధించును. ఆ కర్మల వల్ల జన్మ పరంపర పెరుగునేకాని తరుగదు. మధ్యమ గురుడు మంత్రములను ఉపదేశించి, వాటిని ఉచ్చరింపజేయును. ఫలములను పొందుటకై అనేక మంత్రములు ఉచ్చరించుట, కామ్యకర్మలకు దారితీయును. ఆయా దేవతా మంత్రములను జపించి స్వర్గలోకాదులను పొందినను; 'క్షీణే

పుణ్యే మర్త్యలోకం విశన్తి' అను న్యాయమున తిరిగి భూలోకంలో పుట్టవలసినదే. కనుక మంత్రములు అహమును నశింపజేయలేవు.

ఉత్తముడైన గురుడు శిష్యునికి యోగసామ్రాజ్యమును పట్టాభిషేకము చేయును. యోగ సామ్రాజ్యము ఎక్కడుంది? యోగము అనగానేమి? సామ్రాజ్యము అనగానేమి? యోగము అనగా కలయిక (ఏకత్వము). వేటి మధ్య కలయిక? తత్(బ్రహ్మము), త్వం(జీవుడు). ఇవి రెండూ కలిసియే వున్నవని, ఇవి ఏకమని తెలుసుకొనుటే యోగము. సామ్రాజ్యము అనగా తన్మయ శరీరము. కనుక అజ్ఞానావరణములో వున్న శిష్యునికి తారక, సాంఖ్య,అమనస్క, మహావాక్యముల ద్వారా తాను(జీవుడు) ఆ బ్రహ్మమేనని తెలియజేయు గురుడే ఉత్తమ గురుడు. తత్ + త్వం = తత్వము. ఇదే తన్మయ శరీరం. దీనిని పొందినవాడు త్రిలోకాధిపతియగు ఇంద్రున్ని కూడా చిల్లిగవ్వలేని వానిగా చూచును. ఇక చక్రవర్తుల లేక ప్రధానమంత్రుల సంగతి చెప్పనవసరం లేదు.

**ఆ॥ మిరెపు గింజ జూడ మీద నల్లగ నుండు**
**కొరికి చూడ లోన చురుకు మనును**
**సజ్జనులగు వారి సారమిట్టులనుండు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** 21

'వేషము మోసము కొరకే'. కనుక సజ్జనుడైన గురువు వేషభాషాడంబరములతో ఆకర్షణగా వుండడు. తనవద్దకు వచ్చిన వారిని డబ్బుకొరకు వూరికే పొగడడు. పైగా ప్రవర్తన సరిగాలేనిచో తిట్టడానికైననూ వెనుకడుగు వేయడు. దీనినే ఉదాహరణతో వేమన చెప్పుచున్నాడు. మిరెపు (మిరియపు)గింజ మీద చూస్తే ఆకర్షణగా వుండదు. నోటిలో వేసుకొని కొరికి చూస్తే చురుకుమనును. అలానే వీరు చెప్పు సత్యసారము లోకులకు చురుకువలె నుండును. 'సత్యం జనవిరోధాయ, అసత్యం జనరంజకం'. కనుక మిరెపు గింజవలె సజ్జనులు ఉంటారని వేమన ప్రవచించుచున్నాడు.

**ఆ॥ కస్తురియట చూడ కాంతి నల్లగ నుండు**
**పరిమళించు దాని పరిమళంబు**
**గురువులైన వారి గుణములీలాగురా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** 22

కస్తూరిని చూస్తే దాని కాంతి నల్లగ వుండును. కాని అది ఒక ఇంటిలో వుంటే దాని సువాసన ఆ వీధి అంతా గుభాళించును. అదే విధంగా గురువుల యొక్క గుణములు వుంటాయి. కనుక సద్గురువును వేషభాషాడంబరములను బట్టి గుర్తించలేము. కాని గుణముచే గుర్తించవలెను. కనుక సద్గుణములు లేని గురువు వేషభాషాడంబరములతో ఉన్ననూ గౌరవనీయుడు కాడు. 'ఇంటి పేరు కస్తూరి వారు. ఇంట్లో గబ్బిలాల వాసన'. కనుక అట్టివారికి దూరంగా వుండవలెనని వేమన బోధించుచున్నాడు.

**ఆ॥ శివమతమునకైన వివరింపగా గుర్వు**
**హరిమతమునకైన నరయ గుర్వు**
**గురువు నెరుగలేని గుణహీనుడేమెర్గు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥** **23**

విచారించి చూడగా, శివమతమును వివరించుటకు శైవులకు గురువు అవసరమే. అలాగే వైష్ణమతమును తెలియజేయుటకు వైష్ణవులకు గురువు అవసరమే. ప్రతి మతమునకు గురువు అవసరమైనప్పుడు, ఇక మతాలకు అందని సూక్ష్మమైన భావమును బోధించు 'అచల పరిపూర్ణ రాజయోగము'నకు గురువు అత్యంతావసరమై యున్నాడని వేమన యొక్క భావము. కనుక గురువును చేరుకొని ఆత్మతత్వమును తెలిసికోనివాడు గుణహీనుడని వేమన నుడువుచున్నాడు.

**ఆ॥ వాక్కు యందు గుర్వు వాక్తత్వమును గుర్వు**
**చీకటిలో గుర్వు చిక్కియుండు**
**నఖిలమునకు గురువు యాధారమైయుండు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥** **24**

బ్రహ్మతత్వమును తెలిసికొని, ఆ బ్రహ్మమే తానని అధిష్ఠానరూప సమిష్ఠి కర్మాచరణ కలిగియున్న వాడే నిజమైన గురువు. అట్టి గురువు బ్రహ్మమునకన్నా వేరు కాడు. కనుక ఆ గురుడే బ్రహ్మము. ఆ బ్రహ్మమే ఈ గురుడు. కనుక గురువు సమస్తమునకు ఆధారమైయున్నాడు. బ్రహ్మమే అవ్యక్తముగా మారినది. కనుక ఆ గురువే అవ్యక్తరూపము (చీకటి) గా యుండి విచారించిన వారికి చిక్కును. మనస్సుయందు అవ్యక్తరూపముగా యున్న ఆ గురువే వాక్కు ద్వారా తత్వమును వ్యక్తపరచుచున్నాడు. వ్యక్త పరచబడిన తత్వము కూడా గురుస్వరూపమని వేమన బోధించుచున్నాడు. కనుక సర్వజగద్రూపము గురు స్వరూపమని నిర్ణయము.

తే॥ గురు పరంపర నీ విద్య గూఢ మెఱిగి
పరమ పరిపూర్ణ మందుట పరవశంబు
నిరుపమానంద సుఖకేళి నెరుప వలెను
విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥ 25

'గురువులేని విద్య గ్రుడ్డి విద్య'. కనుక సాంప్రదాయక గురు పరంపరగా వచ్చుచున్న గురువులను చేరి, వారి నుండి నిగూఢమైన బ్రహ్మతత్వమును ఎరిగి, ఆ పిదప పరమ పరిపూర్ణబ్రహ్మమును తెలుసుకోవలయును. ఇట్టి విధానమునెరిగిన వాడు సర్వ వేళల తన మనస్సును అఖండరూప అధిష్ఠాన బ్రహ్మమునందు లీనము చేసి యుండును. కనుక ఆతని మనస్సు వ్యష్ఠిరూప భ్రాంతులకు లోను గాదు. ఆతడు సర్వము తానేనని ఏక దృష్ఠి కలిగియుండును. ఇదియే సహజామనస్క రాజయోగం. దీని వలన కలిగే ఆనందమే బ్రహ్మానందము. ఇట్టి విధానంను ఆచరించువాడు నిరతము ఆనంద స్వరూపుడును, నిత్య సంతోషియును అయి సర్వము జగన్నాటకముగా తలంచి, సర్వభ్రాంతి రహితమును చేసికొనునని విమలగుణ సంపన్నుడునూ, రాజయోగీంద్రుడునూ అయిన వేమనార్యుడు బోధించుచున్నాడు.

ఆ॥ గురువు చిల్లగింజ కుంభమీ దేహంబు
ఆత్మ కలుష పంక మడుగు బట్ట
తెలసి విరిచెనేని దివ్యామృతము తేరు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 26

చిల్లగింజను మురికి నీరున్న కుండలో వేసినచో; కలుషిత పదార్థమంతయూ అడుగున బట్టి స్వచ్ఛమైన నీరు మీద తేరును. అదే విధముగా గురువును చిల్లగింజతోను, దేహమును కుండతోను, స్వచ్ఛమైన నీటిని దివ్యామృతముతోను; ఆత్మ కలుషమును మడ్డితోను వేమన పోల్చుచున్నాడు. కనుక గురువు అందించు జ్ఞానముతో మాత్రమే ఆత్మశుద్ధి కాగలదు. కనుక గురువునకు విశిష్ఠమైన స్థానమున్నదని గ్రహించవలెను.

కం॥ గురుడనగా పరమాత్ముడు
పరగంగా శిష్యుడనగ పటు జీవుడగున్
గురు శిష్య జీవ సంపద
గురుతరముగ గూర్చు నతడు గురువగు వేమా ॥ 27

గురుడెవరు? గురుడు అనగా పరమాత్ముడే? శిష్యుడెవరు? శిష్యుడు అనగా జీవుడే. ఈ గురు శిష్యులను గురుతరముగా ఏకము చేయువాడే గురువు. అనగా జీవ పరమాత్మల ఏకత్వమును బోధించి, గుణరూపములను నశింపజేయువాడే గురువు. కాని మిగతా గురువులు గురువులు కారు అని వేమన వచించుచున్నాడు.

కం॥ పరిపాకియైన శిష్యుని
నుపమందలి బయలు జూపి యుద్ఘాటముగా
పరిపూర్ణ మంద జేసెడు
గురుడు పరబ్రహ్మమైన గుణనిధి వేమా ॥ 28

పరిపాకియైన శిష్యుడెవరు? తత్వన్నిర్ణయమును తెలిసిన వాడే పరిపాకియైన శిష్యుడు. తత్వము అనగా ఏమిటి? సర్వము బ్రహ్మమయమనియూ, ఆ బ్రహ్మమే తాననియూ లెస్సగా తెలుసుకొనుట తత్వము. అట్టి పరిపక్వత చెందిన శిష్యునికి బ్రహ్మమునకు ఉపముగా (సమీపంగా) వున్న బయలు(పరిపూర్ణ బ్రహ్మము)ను చూపి పరిపూర్ణ భావమును బోధించు గురుడు పరబ్రహ్మ స్వరూపుడే గాని అన్యుడు కాడని వేమన ప్రబోధించుచున్నాడు.

తే॥ హరి హరాదులకైన నయ్యాత్మ విద్య
గురుకటాక్షము బొందక నెరుకపడదు
పరమ పరిపూర్ణ భావంబు బయలుగాదె?
విశ్వదాభిరామ యిదియు వినుర వేమ ॥ 29

'ఇదేమైనా బ్రహ్మవిద్యయా?' అని లోకులు అంటుంటారు. అనగా బ్రహ్మ(ఆత్మ) విద్య సామాన్యమైన విద్య కాదు. గురువు లేకుండా సాధించబడనిది. కనుకనే అట్టి ఆత్మ విద్య హరిహరాదులకైననూ గురుకటాక్షము లేక ఎరుకపడదు అని వేమన వచించుచున్నాడు. ఆ ఆత్మ విద్యకు మించినది పరవిద్య. ఆ పరవిద్య పరమ పరిపూర్ణభావమును గూర్చి బోధించును. కనుక ఆత్మ విద్యకే గురువు అవసరమైనప్పుడు, పరవిద్యకు గురువు అత్యంతావసరమై వున్నాడని వేమన గురువు యొక్క విశిష్ఠత గూర్చి నొక్కి వక్కాణించుచున్నాడు.

**ఆ॥ వెదుక వెదుక దొరుకు వేదాంత వేద్యుండు**
**వెదుకు వాని దాను వెదుకు చుండు**
**వెదుక నేర్చి నట్టి వెరవర్లు గలరకో?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 30**

పరమ పరిపూర్ణ భావమును బోధించి వెతలు దీర్చు గురువే వేదాంత వేద్యుడు. వారు నిరాడంబరముగా ఎక్కడో ఓ చోట వుంటారు. అట్టివారు వెదుకంగ, వెదుకంగ దొరుకుతారు. ఆ వేదాంత వేద్యుడు తన కోసం వెదుకువాని కొరకు వెదుకుతాడే తప్ప దొరికిన ప్రతివాడికి సోది చెప్పడు. కనుక ఎవరైనా వెదుక నేర్చి నట్టి సత్యాన్వేషకులు వున్నారా? వారి కోసమే ఈ పద్యాలు అని వేమన యోగి ప్రవచించుచున్నాడు.

కనుక వేమన యోగి వేదాంతమునునుసరించి ఈ అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతమునందు ఏ విధమైన ఊహాపోహలు పనికిరావు. గ్రంథాలచే ఎవరు కూడా ఆ పరిపూర్ణ బ్రహ్మమును గాంచలేరు. అయిననూ అట్లు గాంచుటకు పూనుకొనిన అది శూన్య పద్ధతియే అగును. స్వయం శక్తిచే దీనిని సాధించదలచిన వాడు తాను చెడుటయేగాక, తనను ఆశ్రయించిన వారిని కూడా అధోగతి పాలు చేసిన వాడగును.

కనుకనే యాజ్ఞవల్కి ఎంతటి బ్రహ్మవేత్తయైననూ సూర్యభగవానుని ఆశ్రయించి అచల పరిపూర్ణ బ్రహ్మమును దర్శించవలసి వచ్చెను. జనకుడు ఎంతటి జ్ఞానియైననూ యాజ్ఞవల్కిచే జ్ఞానాజ్ఞానములను రహితముచేయు ఈ పరిపూర్ణ బోధ వినక తప్పలేదు. బ్రహ్మర్షి వ్యాసుని పుత్రుడు శుకుడు ఎంతటి త్యాగియైననూ రాజర్షియగు జనకునిచే ఈ పరమ రహస్యమైన పరిపూర్ణ రాజయోగమును గ్రహింపక శాంతి పొందలేదు. శ్రీకృష్ణుడు ఎంతటి దైవస్వరూపుడైననూ సాందీపిని మహర్షిచే జ్ఞానకర్మములను రహితపరచు అచలతత్వమును గ్రహించవలసి వచ్చెను.

గురువులేకుండా పరమ పరిపూర్ణ భావము తెలియబడదని వేమనయోగి నిశ్చితాభిప్రాయము. కనుక చాటు మార్గములు, దొంగ త్రోవలు అచల పరిపూర్ణ రాజయోగమునకు పనికి రావు. ఉన్నది వున్నట్లు గురువు ద్వారా తెలుసుకొనుటే రాజమార్గము. మరియు ఉన్నది వున్నట్లు, లేనిది లేనట్లు తెలియజేసి జన్మభ్రాంతిని తొలగించువాడే నిజమైన గురువని వేమనయోగి వేదాంతము.

నాలుగవ అధ్యాయం

# దైవము

జిజ్ఞాసియైన మానవుడు దేవుని కోసం అనాదిగా వెదకుచూనే వున్నాడు. ఆ అన్వేషణ వల్లనే ప్రకృతియే దైవమని కొందరు, సూర్యుడే దైవమని మరికొందరు, శక్తియే దైవమని ఇంకొందరు తవు తవు ఇష్టానుసారం నిర్ణయించుకున్నారు. ఇంకా కొందరు సృష్టి పరిశోధన చేసి ఆత్మతత్వమును తెలియజేయ ప్రయత్నించిన మానవులనే దేవుళ్ళని నిర్ణయించుకున్నారు. ఆ కోవకు చెందినవారే యేసు, అల్లా మొదలగువారు. క్రైస్తవులకు యేసు ఒక్కడే దైవము, మహమ్మదీయులకు అల్లా ఒక్కడే దైవము. కాగా హిందువులు ఆయా కాలాలలోని ఆనాటి దైవమతులనే దైవమనియెంచి వారిని చేరుకొని, సేవించి, సత్యాన్వేషణగావించారు. ఆ కోవకు చెందిన వారే శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మొదలగువారు. శ్రీరాముడు విష్ణువుయొక్క అవతారస్వరూపుడైననూ బ్రహ్మర్షి వశిష్ఠుని రప్పించుకొని , సేవించి ఆత్మతత్వమును తెలిసికొన ప్రయత్నించెను. శ్రీరాముని యోగం పరిపూర్తి చెందక పోవుటచే ద్వాపర యుగంలో శ్రీకృష్ణావతారముగా వచ్చియున్నాడు. శ్రీకృష్ణుడు భగవత్స్వరూపుడైననూ సాందీపిని మహర్షి చరణ సన్నిధిని ఆశ్రయించి పరబ్రహ్మతత్వమును తెలిసికొని ముక్తి పొందెను. కనుక విచారించి చూడగా సామన్య మానవుడే సద్గురువును చేరుకొని ఆత్మతత్వమును చక్కగా తెలిసికొన్నచో దైవమే అగుచున్నాడు. అట్లుగాక ఎన్నడో వేల సంవత్సరాల క్రితం జీవించిపోయిన వారి విగ్రహాలను దైవమనుకొని పూజించుట వల్ల సత్యం అవగతం కాదు. అట్లుగానిచో శ్రీకృష్ణుడేల విగ్రహారాధన చేయలేదు. మహనీయులందరు సజీవంగా ఉన్న వారి గురుదేవుల నుండియే ఆత్మజ్ఞానమును పొందుటకు ప్రయత్నించిరే గాని, విగ్రహాల ద్వారా కాదు. కనుక నిజమైన దైవమెవరో నిర్ణయించుటే ఈ అధ్యాయం యొక్క లక్ష్యం.

**ఆ॥ దేవుడనగ వేరె దేశమందున్నాడె**
**దేహి తోడ నెపుడు దేహమందె**
**వాహనముల నెక్కి వడిదోలుచున్నాడు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 3 ।**

దేవుడనే వాడు వేరే లోకాలలో లేడు అని వేమన తెలుపుచున్నాడు. ఇచటనే మన శరీరములందే

చైతన్య రూపము(దేహి)గా వుండి జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములనే అంతరేంద్రియములతో కూడుకొని; సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన వాయువులనే ప్రాణేంద్రియములను వాహనములను ఎక్కి; శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణములనే జ్ఞానేంద్రియములను చేరుకొని బయట నున్న శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధములనే విషయేంద్రియములను గ్రహించి; వాక్కు, పాణి, పాదము, గుహ్యాము, గుదములనే కర్మేంద్రియముల ద్వారా వచన, దాన, గమన, విసర్జన, ఆనందములను పనులను చేయుచున్నాడని వేమన వివరిస్తున్నాడు. కనుక సర్వమును తెలిసికొని, సర్వమును ఆచరించు దేవుడు మనయందే వున్నాడని వేమన ప్రబోధించుచున్నాడు.

**ఆ॥ తోలు కడుపులోన దొడ్డ వాడుండగ**
**రాతిగుళ్ళలోన రాశిబోయ**
**రాళ్ళు దేవులైన రాసుల మ్రింగవా?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 32**

'దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవస్సనాతనః'. ఈ తోలు శరీరంలో సర్వోత్కృష్టమైన ఆత్మ వుండగా, మానవుడు దానిని తెలిసికోలేక, రాళ్ళతో నిర్మించిన దేవాలయాలలో రాతి విగ్రహాల ముందు రాసులు పోస్తే, రాళ్ళే దైవుళ్ళైనచో ఆ రాసులను మ్రింగవా? అని వేమన చమత్కరించుచున్నాడు.

దీనిని బట్టి వేమన విగ్రహారాధనను పూర్తిగా ఖండించాడని తెలియబడింది. మరియు ఈ శరీరంలో వున్న జీవుడినే దేవునిగా తెలిసికొని, ఆ జీవుడినే హింసించకుండా కాలప్రకారంగా, నియమప్రకారంగా ఆహారమిడినచో ప్రాణం వృద్ధి చెంది ఆత్మ తేజస్సు కలుగుతుందని వేమన పరోక్షంగా తెలియజేయుచున్నాడు.

దీనినే శ్రీకృష్ణభగవానుడు ఉత్తర గీతయందు

**'శ్లో॥ అగ్నిర్దేవో ద్విజాతీనామ్ మునీనాం హృది దైవతమ్**
**ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శనమ్ ॥'** అని ప్రబోధించెను.

ద్విజులకు అగ్నియే దైవము. మునులకు హృదయమునందు ఉన్న చైతన్యమే దైవము.

స్వల్పబుద్ధులకు విగ్రహాలే దైవమని బోధించాడు. దీనినే వేమన

ఆ॥ హృదయమందు నున్న యీశుని దెలియక
శిలలకెల్ల మ్రొక్కు జీవులార
శిలలనేమి యుండు జీవులందే కాక?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 33

అని ఉద్ఘాటించాడు. కనుక హృదయమందున్న ఈశున్ని తెలుసుకోక శిలలను మ్రొక్కు అజ్ఞాన జీవులారా, దేవుడు జీవుల హృదయములందే ప్రతిష్ఠమై వున్నాడని తెలుసుకోండని వేమన బోధించుచున్నాడు.

ఇలా మానవుడు తనయందే వున్న దైవాన్ని ఎరుగక దైవం ఎచ్చటో వున్నాడని పరుగులిడుతూ వుంటాడని వేమన ఈ క్రింది పద్యంలో చెప్పుచున్నాడు.

ఆ॥ మేక చంక బెట్టి మెలగుచు మందలో
భ్రమసి తిరుగు గొల్ల పగిది గాక
దైవమెరుగక పరదైవతముల దల్చు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 34

గొల్లవాడు మేకను తన చంకలోనే పెట్టుకొని, తనవద్ద లేదని భ్రమసి మందలో దాని గూర్చి తిరుగుచున్నట్టు, అజ్ఞానులు తమ హృదయంలో వున్న దైవాన్ని ఎరుగక పరదైవములను తల్చుచుంటారని వేమన ఉదహరించుచున్నాడు.

ఆ॥ వెన్నచేత బట్టి వివరంబు దెలియక
ఘృతము గోరునట్టి యతని భంగి
తాను దైవమయ్యు దైవంబు దలచును
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 35

వెన్నను చేతిలోనే పట్టుకొని, దానినుండి నెయ్యిని ఎలా తీయాలో తెలియనటువంటి వాని

వలె, మనుజుడు తానే దైవము అయినప్పటికినీ, ఆ విధము తెలుసుకోలేక, దైవము వేరే చోట కలడని వెదకుచుంటాడని వేమన వివరించుచున్నాడు.

**కం॥ పడి పడి మ్రొక్కగ నేటికి**
**గుడి లోపల కఠిన శిలల గుణములు చెడునా?**
**గుడి దేహమాత్మ దేవుడు**
**చెడు రాళ్లకు వట్టి పూజ సేతురు వేమా ॥ 36**

గుడిలోపలికి వెళ్లి పడి పడి మ్రొక్కుచు వుంటారు కొందరు. అందువల్ల ఆ కఠిన శిలల గుణములు మారుతావా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు. మారవు. దేహమే గుడి, ఆత్మయే దైవము. జడములైన రాళ్లకు పూజచేయుట నిష్ఫలమని వేమన తెలుపుచున్నాడు.

**ఆ॥ ఉపవసముల నున్న నూర పంది పుట్టు**
**తపసియై దరిద్రతను వహించు**
**శిలకు మ్రొక్కనగును జీవమడుగు బొమ్మ**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 37**

ఉపవాసములు చేస్తే వూరపందగును మానవుడు. ఎందుకు? కడుపులో అన్నం లేనప్పుడు, జఠరాగ్ని పెద్ద ప్రేగులలో నున్న మలమును తినును. తపము చేస్తే దరిద్రుడగును. ఎందుకు? జీవన భృతి వుండదు గనుక. మూగవాని స్నేహం చేస్తే మూగతనం వచ్చును. నత్తివాని సహవాసం చేస్తే నత్తి వచ్చును. అలానే మరి శిలలకు మ్రొక్కిన మానవుడు ఏమగును? చైతన్యమును కోల్పోయి శిలయేయగునని వేమన హితవు చెప్పుచున్నాడు.

**ఆ॥ తత్వమెరుగువాడు దైవంబు నెరుగును**
**సర్వసారములను జంపజేయు**
**కదళి మ్రింగువాడు గరళంబు మ్రింగునా?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 38**

తత్వ నిర్ణయం తెలిసిన వాడికి దైవమును గూర్చి పూర్తిగా తెలియును. సర్వసారములు ఆతనికి సౌలభ్యము. కదళిని మ్రింగువాడు, గరళమును మ్రింగడు కదా? అని వేమన దైవ నిర్ణయమును గూర్చి బోధించుచున్నాడు.

ఆ॥ జీవ లింగ పూజ సేసిన వారికి
శిలల రూపమందు చింతయేల?
చెలగి మధువు గ్రోల చేదు రుచించునా?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 39

తన స్వస్వరూపమును తానెరిగి, తానే ఆ పరమాత్మ స్వరూపమని తెలిసికొని, తన యందున్న జీవాత్మ (జీవలింగ) పూజ చేసిన వారికి శిలలయందు ఆలోచనే రాదు కదా? అట్లే మధువు గ్రోలు వానికి చేదు రుచించునా? రుచించదని వేమన దైవమును గూర్చి బోధించుచున్నాడు.

ఆ॥ రాతి బొమ్మకేల రంగైన వలువలు
గుళ్లు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుడు?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 40

రాతిబొమ్మలకు రంగురంగుల వస్త్రములను చుట్టి, అలంకరించి, వాటిని గుడిగోపురములలో పెట్టి, వాటికి కుండలయందు అన్నం పెట్టి సమర్పించుట ఎందుకు? నిజమైన దేవుడు తనకు కూడు, గుడ్డలు కావాలని కోరుతాడా? అని వేమన ప్రశ్నించుచున్నాడు. అంతట నిండివున్న నిజమైన దేవుడు (అచల పరిపూర్ణ బ్రహ్మము) దేనినీ కోరడు. కూడు, గుడ్డలు మనిషికి అవసరం. కాని చైతన్యంలేని రాతి బొమ్మలకు ఎందుకు? అవసరం లేదు. కూడు, గుడ్డలు తినడానికి తిండి లేక అలమటించుచు, చలికి తాళలేక గజగజ వణకుచున్న దరిద్రనారాయణునికి అవసరం అని వేమన తెలియజేయుచున్నాడు. దీనిని బట్టి వేమన విగ్రహారాధనను ఖండించాడని తెలియబడింది.

ఆ॥ శైవ వైష్ణవాది షణ్మతంబుల కెల్ల
దేవుడొక్కడనుచు దెలియలేరు
తమకు భేదమయిన తత్వంబు భేదమా?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 41

శైవము, వైష్ణము, శాక్తము, గాణాపత్యము, సౌరము, కాపాలము అను షణ్మతములయందు ప్రవర్తించువారు దేవుడొక్కడనుచు అనగా ఏకరూపముగు ఆత్మస్వరూపము ఒక్కటియే అని

తెలిసికోలేరు. ఆత్మను గాంచలేక శైవాది మతముల వారు భిన్నభిన్నమైన మతాభిప్రాయములను కల్పించుకున్నారు. వారి వారి భావములు భేదమైనంత మాత్రమున తత్వము భేదమా? కాదు అని వేమన వచించుచున్నాడు.

ఆ॥ శివుడు గలడటంచు శిలలకు మ్రొక్కెడి
వెఱ్ఱి జీవులార వెతల విడుడి
జీవులందె కాక శిలల యే మున్నది?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 42

పరమశివుడు శిలలందున్నాడని శిలలకు మ్రొక్కుచుంటారు కొందరు. వారి వెతలు చెప్పుటకు వలను పడదు. అట్టి వారిని వెఱ్ఱి జీవులని వేమన చెప్పుచున్నాడు. ఎందుకనగా శిలలలో ఉత్కృష్టమైన చైతన్యము లేదు. అవి మానవునిని జ్ఞాన మార్గము వైపు తీసుకొని పోలేవు. కాని చైతన్యముగల మరొక జీవియే ఇంకొక జీవిని మేల్కొల్పగలదు. కనుక శిలలకన్నా చైతన్యమును కలుగజేయు మానవునిని మ్రొక్కుటే ఉత్తమ మార్గమని వేమన ప్రవచించుచున్నాడు.

ఆ॥ రాతి ప్రతిమ దెచ్చి రాజసంబున నుంచి
పూజ సేయు నరుడు బుద్ధిమాలి
భావమందు పరము భావించనేరడో?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 43

నరుడు రాతి విగ్రహములను తీసుకవచ్చి, వాటిని అనేక రకాలుగా అలంకరించి, రాజస గుణ సంబంధమైన కోరికలను తన యందుంచుకొని పూజిస్తుంటాడు. అట్టివానికి బుద్ధి నిశ్చయజ్ఞానము అసలు వుండదు. ప్రతిమ దైవమా? అనే విమర్శన చేయు బుద్ధి లోపించి వాడు జడత్వము వైపు పయనించును. తన భావమునందే అనగా తన హృదయమునందే వున్న దైవము (పరము)ను ఎరిగి, దానిని పూజించనేరడని వేమన వివరించుచున్నాడు.

ఆ॥ పలుగు రాళ్ల దెచ్చి పరగ గుడుల గట్టి
చెలగి శిలల సేవ జేయ నేల?
శిలల సేవ జేయ ఫలమేమి గల్గురా?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 44

పలుగు రాళ్లతో మహా సుందరంగా గుడులు గట్టి, వాటిలో శిలా ప్రతిమలు బెట్టి పూజలు చేయుట ఏల? శిలలకు సేవ చేసినచో ఏమైనా ఫలము కల్గునా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు. వాటికి చైతన్యము లేదు గనుక ఏమియునూ మానవున కవి బోధించలేవు. కనుక చైతన్యముగల గురువును సేవించినచో మానవునికి జ్ఞానము కలుగునని వేమనార్యుడు బోధించుచున్నాడు.

**ఆ॥ శిలను ప్రతిమ జేసి చీకటింటను బెట్టి**
**మ్రొక్క వలదు వెఱ్ఱి మూఢులార!**
**యుల్ల మందు బ్రహ్మ యుండుట దెలియరు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 45**

ఇష్టదేవతా శిలా ప్రతిమను చీకటి గదిలో (గర్భగుడిలో) పెట్టి మ్రొక్క వలదు వెఱ్ఱి మూఢులార అని వేమన గట్టిగా చెప్పుచున్నాడు. అలాగాక తమ హృదయాలయందే యున్న బ్రహ్మమును తెలుసు కోరాదా? అని వేమన హితవు చెప్పుచున్నాడు.

**ఆ॥ కాశి కాశి యనుచు కదు వేడ్కతో బోదు**
**రందు గలుగు దేవుడిందు లేడె?**
**యిందు నందు గలడు హృదయంబు లెస్సైన**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 46**

కాశి, కాశి యనుచు భక్త జనులు కొందరు బహు వేడ్కతో దేవుడి కోసం కాశి పోవుచుంటారు. దేవుడెక్కడో గలడని మరికొందరు వెదకుచుంటారు. హృదయాన్ని పరిశుద్ధము చేసికొన్నచో, దైవము తన హృదయమందును, సర్వజీవులయందును కనిపించునని వేమన బోధించుచున్నాడు

**ఆ॥ దేవ పూజ సేయ దివ్య భోగము గల్గు**
**తత్వ మెరిగె నేని దైవ సముడె**
**యేమి లేని నరున కేగతి లేదుర**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 47**

గురువే దైవమని తెలిసికొని, ఆ గురునికే పూజ చేసినచో ఆత్మ చైతన్యము కలిగి, తద్వారా దివ్యమైన సర్వ భోగములు సిద్ధించును. ఆ గురూపదేశముచే తత్వమెరిగినచో, తాను కూడా ఆ గురుస్వరూపమును పొంది దైవమగును. అలాగాక యేమిలేని నరునకు ఏ గతియూ లేదని నాస్తికుని యొక్క గమ్యమును తెలుపుచున్నాడు వేమన. ఈ పద్యం వల్ల వేమన నాస్తికుడు కాడని తెలియబడుచున్నది.

**ఆ॥ రాజయోగి మహిమ రాజయోగికి గాక**
**నితర జనుల కెల్లనేమి దెలుసు**
**తాను దేవుడైన దైవము గొలుచునా?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 48**

'జ్ఞాని మరుగు సుజ్ఞాని కెరుక, అజ్ఞానికే మెరుక'. అలాగే రాజయోగి విశిష్ఠత మరొక రాజయోగికే తెలుస్తుంది. కాని ఇతరులకు తెలియదు. వేమన ప్రబోధించిన రాజయోగ విధానమందు, తత్వవిచారణ చేసిన వారికి తామే దైవ స్వరూపులమని తెలియబడుతుంది. కనుక తానే దైవం అయినపుడు ఇంక వేరే దైవాన్ని కొలుచుట చక్రవర్తి పోయి సేవకుని కాళ్లు పట్టుకొనుట వంటిదగును. కనుక మానవుడే మాధవుడని గ్రహించవలెను. వేమన సిద్ధాంతమును అనుసరించువారు తమ గురువులను తప్ప వేరే దైవాన్ని ధ్యానించరు. ఈ పద్యం వల్ల వేమన రాజయోగి అని స్పష్టమైనది.

కనుక ఆత్మతత్వము నెరిగి ఆ విధానమందు సంచరించు గురువగు మానవుడే దైవమని వేమన నిర్ణయం. ఆనాడు జనకుడు సజీవంగా వున్న యాజ్ఞవల్కిని, అర్జునుడు సచేతనంగా వున్న శ్రీకృష్ణుడిని చేరుకొని ఎలా ఆత్మతత్వమును తెలిసికొన్నారో; అదే విధంగా ఈనాడు కూడా బ్రహ్మతత్వమును ఉపదేశించు గురువులను వెదకి, వారిని చేరుకొని సేవించి, వారి ద్వారా బ్రహ్మతత్వమును పొందవలెనని వేమన సిద్ధాంతం. కాని విగ్రహములు దైవములు కావు. వానిని పూజించినచో మానవుడు జడత్వమువైపు పయనించును. కనుక చైతన్యమును కలుగజేయు గురుడే దైవము. ఆ గురువు ద్వారా తత్వమెరిగిన వాడు దైవమే అగుచున్నాడు. అట్లు గాక దేవుడు ఎక్కడో వున్నాడు, తనను రక్షించగలడు అను విషయం ఒక భ్రమ మాత్రమేనని వేమన యొక్క నిశ్చితాభిప్రాయం. అంతియేగాక దేవుడే లేడనియూ లేక దేవు(డు) ంటే వుండనీయని, దేవుడితో తనకేమి సంబంధము లేదని చెప్పువారికి ఏ గతియూ లేక ర ః నరక కూపంలోనే వారు తిరుగుచూ వుంటారని వేమన యోగి వేదాంత నిర్ణయం.

అయిదవ అధ్యాయం

# అచల పరిపూర్ణ బ్రహ్మము

''అచల పరిపూర్ణ బ్రహ్మము లేదంటే అంతటా వున్నది. ఉన్నదంటె కానరానిది, ఆకాశం వంటిది''అని అచల పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి వేమనయోగి సాంప్రదాయకుడైన శ్రీ శివరామదీక్షితులు (సుమారు క్రీ.శ. 1690-1791) తాను వ్రాసిన 'బృహద్వాశిష్ఠము' అను గ్రంథంలో చెప్పియున్నారు.

అచల పరిపూర్ణ బ్రహ్మము పుట్టనిదీ చావనిది. మొదలు కొనలేనిది. పట్టువిడుపులు లేనిది. స్వజాతీయ విజాతీయ స్వగత భేదాలు లేనిది. సదసత్తులు గానిది. జ్ఞాన కర్మాలు లేనిది. పంచభూతాహంకారమయమైన జడాజడాత్మక ప్రపంచమును ఎరుగనిది. జడచేతనముల కలయిక చేత నరుకబడనిది. క్రియా శూన్యమైనది. ఖోం చేయనిది. ఒక్కటైనా వికారం లేనిది. వస్తురూపం కానిది. ఆత్మ బ్రహ్మలు కానిది. తాను పుట్టనిది. ఒక దానిని పుట్టించనిది. దృగ్దృశ్యాలు గానిది. జీవేశ్వరులు గానిది. కార్యకారణములు గానిది. గుణాలు లేనిది. క్షరాక్షర విలక్షణమైనది. జీవన్ముక్తి, విదేహముక్తి, నిత్యముక్తి లేనిది. లోపట బయట అనే అరమరిక లేక సమస్తమైన వస్తువులందు చలించక దేనిని స్పృశించక వున్నది. వస్తువుల యందువున్న జడచేతనములుపోతే ఇది పోయేది కాదు. ఆ జడచేతనములతో దీనికి ఏ సంబంధం లేదు. ఇది అచ్ఛేద్యమైనది, అదాహ్యామైనది, అక్లేద్యమైనది, అశోష్యమైనది. ఎందరు లేదులేదన్నా వున్నది. క్షేత్ర క్షేత్రజ్ఞ ద్వయ దోష రహితమైనది. క్షరాక్షరోపాధి ద్వోయ దోష రహితమైనది. ప్రకృతి పురుష ద్వయ దోష రహితమైనది. విషయీ విషయ ద్వయ దోష రహితమైనది. సాక్ష్యసాక్షి ద్వయ దోష రహితమైనది. షట్కోశ రహితమైనది.

ఇదే జ్ఞానాతీతం. వ్యాప్యవ్యాపకాతీతం. అహం బ్రహ్మము అనే అనుభవం లేనిది. స్థూల సూక్ష్మ కారణ మహాకారణములనే దేహచతుష్టయము, జాగ్రత స్వప్న సుషుప్తి తురీయములనే అవస్థాచతుష్టయము, విశ్వ తైజస ప్రాజ్ఞ ప్రత్యగాత్మలనే అభిమాన చతుష్టయము కలసి పన్నెండు లేనిది. ఇదే 'క్షరాక్షరాభ్యాం విలక్షణః' అని చెప్పబడినది. ఇది చేసేది కాదు, చేయించేది కాదు. ప్రపంచం తనలో వున్నా ప్రపంచంతో సంబంధం లేనిది. సుఖ దుఃఖాలు లేనిది. సర్వగతమైనది. స్థాణువైనది. అచలమైనది. సనాతనమైనది. బంధమోక్ష శూన్యమైనది.

తెలిసికోనిది, తెలియబడనిది. ఇంతా అంతా అని ప్రమాణం లేనిది. నేను ఉన్నాను, నేను లేను అనే జ్ఞప్తి లేక వున్నది. ద్వైతాద్వైతవిశిష్టాద్వైత రహిత పరమతత్వమైనది. ఇరువది అయిదు తత్వాలకు ఆవలిది. తత్వాతీతమైనది. ఆకృతి నిరాకృతులు కానిది. నిర్ణయానికి రానిది. నిర్ణయం చెయ్యనిది. ఏమి అడిగినా చెప్పనిది. ఏమి కానిది. శరీరం ఉన్నప్పుడు శరీరం నవ్వితే నవ్వనిది, శరీరం ఏడిస్తే ఏడ్వనిది, శరీరం తింటే తిననిది, శరీరం నడిస్తే నడవనిది, శరీరం మాట్లాడితే మాట్లడనిది. సాక్షి కానిది. కర్త కానిది. భోక్త కానిది. విద్యావిద్యలకు మూలం కానిది. నేననే మూలమాయ, నేననే అంతఃకరణ లేనిది. పంచ ప్రాణములు, దశేంద్రియములు, అంతఃకరణ రూపమైన జ్ఞానము కలసి షోడశ వికారములు లేనిది. దేహీ దేహములు కానిది.

ఇదే సచ్చిదానందరూపమైన సర్వసాక్షిణి అనే మాయలేనిది. సగుణ నిర్గుణములు కానిది. పిండ బ్రహ్మాండములు కానిది. నిరతము ఎడతెగక వున్నది. నాదము లేనిది. చెప్పి చూపించరానిది. ఇరవై ఆరోది. సంకోచ వ్యాకోచములు లేనిది. ఏమి అనుకోనిది. సంకల్ప వికల్పాలు లేనిది. తలపు తలపమి లేనిది. ఈ నామ రూపాలు లేని దానికి ఆత్మయని, బ్రహ్మయని, జ్ఞప్తి అని పేర్లు కల్ల గురువులు పెట్టి నారు. ఇది శూన్యము కానిది. ఇదే బట్టబయలు. సర్వ ద్వంద్వాతీతం. సర్వ త్రిపుటీ ర హితం. కదలనిది మెదలనిది. దగ్గరదీ కానిది, దూరపుదీ కానిది. ఉత్పత్తి స్థితి లయాలు లేనిది. కృష్ణునికి(హరికి), శంకరునికి(హరునికి) మెప్పైనది. గురు సూచన లేనివారికి కనుక్కోరానిది. ఏకమనేది అనేకమనేది లేక వున్నది. ఇదే పూర్ణము. శుద్ధము. నిరంజనము. నిరవయవము. నిర్మలము. నిత్యము. నిర్విషయము. నిరుపాధికము. విక్షేపావరణములంటని స్థానమే అచల పరిపూర్ణ బ్రహ్మము. ఇదే గురుశిష్యరహితం. నిరాభాసం. నిరుపద్రవం. నిష్కళంకం. నిష్ప్రపంచం. నిర్హేతుకం. వృత్తిశూన్యం. అనంతం. అగోచరం. అఖండం. ఇదే కేవలాత్మ. శ్రవణ మనన నిధి ధ్యాసలను ఎరుగనిది ఇదే. ఉపాస్యోపాసకములు కానిది ఇదే. దీనిని ఊరకయుండియే తెలిసికోవలయును. ఇదే వేమనయోగి వేదాంతము.

దీనినే వేమనయోగి పలుపద్యాలలో వివరించియున్నాడు. వాటిని గూర్చి విచారించి అచల పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి వేమన యొక్క అభిప్రాయమును తెలిజేయుటయే ఈ అయిదవ అధ్యాయం యొక్క ప్రధానాశయము.

కం॥ నిరతం బెడతెగకుండన్
బరిపూర్ణ బ్రహ్మామాత్మ పదమున నుంచన్
నిరవద్యమైన పదవిని
జరియించును జగమెరుంగ సత్యము వేమా ॥ 49

పరిపూర్ణ బ్రహ్మము ఎల్లవేళలా ఎడతెగక పరిపూర్ణమై ఒప్పి వున్నది. దీనిని తన ఆత్మ పదమున అవగతం చేసుకున్నవాడు నిరవద్యమైన అనగా అనింద్యమైన అనపేక్షనీయమైన ఉత్తమోత్తమ పదవిని అలంకరించి ఈ జగత్తు యందు చరిస్తూ వుంటాడు. ఇది సత్యమని వేమన వివరించుచున్నాడు.

పరిపూర్ణ బ్రహ్మము నందు ఈ జగత్తు ఎలా వుంది? అని ప్రశ్నిస్తే, పరిపూర్ణ బ్రహ్మమునకు జగత్తునకు ఎలాంటి సంబంధం లేదు. అయితే ఈ జగత్తుకు మూలకారణం ఏది? ఈ జగత్తుకు మూలకారణం బ్రహ్మము. ఈ బ్రహ్మమే స్వయం ప్రకాశమై సర్వభ్రాంతులకు సర్వమాయలకు కూాకటి వేరై వున్నది. అయితే పరిపూర్ణ బ్రహ్మము, బ్రహ్మము అని రెండు బ్రహ్మములు వున్నాయా? ఉన్నాయి. పరిపూర్ణ బ్రహ్మము నిరతంబెడతెగకుండి సర్వలక్షణ విలక్షణమై వుంది. బ్రహ్మము సర్వలక్షణమై జగద్రూపముగా వుంది. దేనికవే రెండు బ్రహ్మములు పూర్ణ స్వరూపములుగా వున్నాయి.

దీనినే

'శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥'

అని శుక్లయజుర్వేద బృహదారణ్యక ఉపనిషత్తు ఉద్ఘోషించుచున్నది.

దీని భావము: అదీ పూర్ణమే. ఇదీ పూర్ణమే. ఈ పూర్ణము కన్నా ఆ పూర్ణము విశేషమైనది. ఆ పూర్ణము నుండి ఈ పూర్ణమును తీసివేస్తే ఆ పూర్ణమే మిగులును. ఇచట అదీ అనగా పరిపూర్ణ బ్రహ్మము. ఇదీ అనగా బ్రహ్మము.

పరిపూర్ణ బ్రహ్మముః ఇది వర్ణనకు అతీతమైనది. అనగా పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి నోటితో చెప్పలేము. మనసుతో ఊహించలేము. చక్షువులతో చూడలేము.

'యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్ స బిభేతి కదాచనేతి'

దేనినైతే తెలిసికొనజాలక వాక్కు, మనస్సు వెనకకు మరలినవో, అట్టి పరిపూర్ణ బ్రహ్మము నెరిగినవాడు దేనికీ భయపడడు అని పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి తైత్తిరీయోపనిషత్తు తెలుపుతుంది.

కనుక అట్టి పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి మాటలతో చెప్పడం కష్టం. అయినా శిష్య ప్రబోధార్థం శ్రీ శివరామ దీక్షితులు పరిపూర్ణ బ్రహ్మమును ఈ విధంగా సూచన చేశారు. అది పుట్టనిదీ - చావనిదీ, రాకడ-పోకడ లేనిదీ, సకల దేశాలయందు, సర్వకాలాల యందు, సమస్త వస్తువులందు తనకు తానే స్వతస్సిద్ధమై ఉన్నది. ఇంతకంటే సమగ్రంగా పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి చెప్పలేము. ఇది కూడా పరిపూర్ణ బ్రహ్మమునకు నిర్వచనం ఎంత మాత్రమూ కాదు. ఇది శిష్యునికి బోధపడుటకు చెప్పినది మాత్రమే. కనుక పై సూచన ద్వారా వేమన నుడివిన నిరతంబెడతెగకుండిన పరిపూర్ణ బ్రహ్మము ఆత్మపదమున అవగతం కాగలదు. కనుక అదీ పూర్ణమే.

బ్రహ్మము: 'బ్రహ్మవిదాప్నోతి పరం, తదేషాఽభ్యుక్తా సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్, సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి, తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నమ్, అన్నాత్పురుషః' (తైత్తిరీయోపనిషత్తు)

దీని భావము: బ్రహ్మము నెరిగిన వాడు బ్రహ్మమునే పొందుచున్నాడు. ఆ బ్రహ్మము సత్యమైనది, జ్ఞాన స్వరూపమైనది, అనంతమైనది. ఆ బ్రహ్మమును తన హృదయమందు ఎవడెరుగునో ఆతడు బ్రహ్మ స్వరూపుడై సమస్త భోగ్యములను అనుభవించును. అట్టి బ్రహ్మము నుండి ఆకాశము కలిగెను. ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృథివి, పృథివి నుండి అన్నము, అన్నము నుండి పురుషుడు కలిగెను. కనుకనే 'అన్నం బ్రహ్మేతి వ్యజానాత్' - అన్నంను బ్రహ్మముగా తెలుసుకొనుము. కనుక నామ రూపాత్మకమగు ఈ ప్రపంచమంతయు బ్రహ్మమే అయివున్నది. ఈ జగత్తు దానినుండియే

కలిగినది. దానియందే లయమగుచున్నది. దాని యందే ప్రతిష్ఠితమై వున్నది. దీనినే 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత...' అని ఛాందోగ్యోపనిషత్తు తెలుపుచున్నది. 'మనసైవాను ద్రష్టవ్యం' ఈ బ్రహ్మమును మనస్సు చేత చూడదగును అని బృహదారణ్యక ఉపనిషత్తు ఘోషిస్తుంది.

'పాదోస్య విశ్వభూతాని త్రిపాదస్య అమృతం దివి'. కనుక నాలుగు పాదములుగా వున్న ఈ బ్రహ్మములో ఒక పాదముతో ఈ విశ్వభూతములు ఏర్పడినాయి. మిగతా మూడు పాదములు అమృత స్వరూపమైన ఆత్మ స్వరూపంగానే వున్నాయి. కనుక ఒక పాదముగా వున్న జగత్తును పూర్ణము అనరాదు. ఈ నాలుగు పాదములు కలిసి అఖండ రూపముగా వున్న బ్రహ్మము పూర్ణముగానే వుంది. కనుక ఇదీ (బ్రహ్మము) పూర్ణమే.

కాని ఈ రెండు పూర్ణములకు ఒకే సమయాన వుండుటకు సాధ్యమా? లేదు. ఏదో ఒక పూర్ణవముండుటకు మాత్రమే అవకాశం కలదు. కనుక తత్వవిచారణ చేసినవాడికి సర్వద్వంద్వములకు, సర్వ త్రిపుటులకు నిలయమైన బ్రహ్మము మాయా స్వరూపమైనదని తెలియబడును. కనుక పరిపూర్ణ బ్రహ్మమునందు లేని బ్రహ్మమును ( ఇహపరములను) తీసివేయగా పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే శేషించును.

ఈ రెండు పూర్ణ బ్రహ్మములనే అమృత బిందూపనిషత్తుయందు

**'ద్వేవిద్యే వేదితవ్యే తు శబ్దబ్రహ్మపరం చ యత్**
**శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి'**

అని రెండు విద్యలుగా తెలుపబడివుంది. దీని భావము: రెండు విద్యలను కూడ తెలిసికోవలెను. 1) శబ్ద బ్రహ్మమును గూర్చి, 2) పరబ్రహ్మమును గూర్చి. శబ్ద బ్రహ్మమును చక్కగా తెలిసికొన్నవాడు పరబ్రహ్మము (అచలము)ను సులభంగా తెలిసికోగలడు.

కదలిక వున్నపుడే శబ్దము రాగలదు. శబ్దము రెండు రకాలుగా వుంది. 1) ధ్వన్యాత్మకము 2) వర్ణాత్మకము. మన చెవులకు వినపడనంత మాత్రాన శబ్దము లేదనుట తప్పు. శబ్దము మనకు వినపడని తరంగ రూపములో కూడా వుంటుంది. కనుక శబ్ద బ్రహ్మమునే

'తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే
తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యత : '

అని ఈశావాస్య ఉపనిషత్తు తెలుపుతుంది. దీని భావము: ఆత్మ కదులుతుంది. కదులుట లేదు. దూరముగా ఉన్నది. దగ్గరగానూ ఉన్నది. అన్నింటికీ అంతరంగా వున్నదీ, బాహ్యంగానూ వున్నది.

కనుక సమస్తమునకు కారణమైన ఈ బ్రహ్మము నిరంతరము కదలిక కలిగివున్నది. కనుక దీనిని శబ్ద బ్రహ్మము అని నిర్ణయించవలసి వచ్చినది. కనుక ఈ శబ్ద బ్రహ్మమే బ్రహ్మమని చక్కగా తెలిసికొన్న వాడు దీనికి అతీతంగా వున్న పరిపూర్ణ బ్రహ్మమును సులభంగా తెలిసికోగలడు అని వేమన ప్రబోధించుచున్నాడు.

ఆ॥ పరము పరమటంచు పలుకుదురందరు
పరము నందు నేమి ప్రబలమయ్యె?
పరముడిందు నందు పరిపూర్ణుడే కదా?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 50

పరము పరము అనుచు అందరు పలుకుచుంటారు. ఆ పరమునందే మాయ ప్రబలమయ్యి ఈ జగత్తు కనిపిస్తుందని ప్రబోధిస్తుంటారు మతవాదులు కొందరు. కాని వేమన యోగి ప్రబోధించిన పరములో ఏదియూ ప్రబలము కాలేదు. ఆ పరము పరిపూర్ణము. దానిలో వేరే పదార్థమేదీ పుట్టనే లేదు. పుట్టదు. ఇక పుట్టబోదు. కనుక అది సర్వకాల సర్వావస్థలయందు పరిపూర్ణమై వుంది. ఆ పరిపూర్ణం తప్ప ఇంకేమి లేదు.

పరమునందు నేమి ప్రబలమయ్యె? నని ఇచట వేమన అద్వైతులను ప్రశ్నించుచున్నాడు. అద్వైత మతోద్ధారకుడు శ్రీ శంకరాచార్యుడు బ్రహ్మమునే పరము అని సిద్ధాంతీకరించాడు. మరి ఆ బ్రహ్మమునందే మాయ ప్రబలమయ్యె నని మాయా వాదాన్ని ఉద్ధరించాడు. అంతేగాక మాయను నిర్వచించలేనని అన్నాడు. కనుక శ్రీ శంకరాస్వాముల బ్రహ్మమునకు, వేమన పరమునకు అత్యంత విభిన్నత్వము కనపడుచున్నది. వేమన చెప్పిన పరమునందు; శ్రీ శంకరాచార్య చెప్పిన బ్రహ్మమునందు మాయ ప్రబలమైనట్లు, ఏదియూ ప్రబలమూ కాలేదు.

ఆ॥ జీవ మేదనుండు? భావమెక్కడనుండు?
కాపురంబు యేడ గదిసి యుండు?
తనరుచున్న రెంటి స్థలమేల తెలియరు?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 51

జీవము ఎచ్చట నున్నది? భావము ఎచ్చట నున్నది? ఈ రెండు ప్రశ్నలకు నిక్కమైన జవాబు తెలిసినచో తదుపరి తెలిసికోవలసిన జ్ఞానం లేదు. ఆతనికి ముక్తి కరతలామలకము.

జీవమెచ్చట నున్నది? స్థూలశరీరంను ఆశ్రయించి జీవమున్నది. మరి జీవమునకు ఆధారమై చైతన్యమును ఇచ్చునది ఏది? అదియే భావము (ఆత్మ). ఈ ఆత్మ ఎచ్చట నున్నది? ఈ ఆత్మ బ్రహ్మాండమంతటా వున్నది. జీవము, ఆత్మ రెండు కలిసినప్పుడే కాపురం కలుగుతుంది. అనగా కర్మ ఉద్భవించును. ఆత్మ ఒక్కటే పని చేయలేదు. జడమైన జీవము ఆత్మ కలిసినప్పుడే వివిధ క్రియలు చేయబడుచున్నవి. ఎలా? కరంటు ఒక్కటే దానంతట అది పనులు చేయదు. యంత్రాలు కావలెను.

అయితే ఈ జీవము, ఆత్మ రెండూ ఏ స్థలంలో తనరుచున్నవి? ఆ స్థలము జీవమూ కాదు, ఆత్మయూ కాదు. ఆ రెంటికి విభిన్నంగా వున్న పరిపూర్ణ బ్రహ్మము వాటికి రంగస్థలముగా వున్నది. దానిని ఈ మనుష్యులు ఏల తెలిసికోరు? అని వేమన ప్రశ్నిస్తున్నాడు. ఇచట వేమన పరిపూర్ణ బ్రహ్మమును జీవాత్మ మరియు పరమాత్మలకు రంగస్థలముగా ఉదహరించుచున్నాడే తప్ప, అది దేనికి ఆధారముగాదు, అధిష్ఠానముగాదని గ్రహించవలసివుంది.

కం॥ నాదము బ్రహ్మంబనుచును
వేదములను చదువవచ్చు విని కని నంతన్
నాదంబు లేని బయలున
నాదాంతము పూర్ణ పదవి నయముగ వేమా ॥ 52

నాదము అనగా ఓంకారము. వేదములను వినినను, చదివినను, కనినను, ఓంకారమే బ్రహ్మమని తెలియబడుచున్నది. ఓంకారము లేని బయలు (పరిపూర్ణ బ్రహ్మము) నాదాంతమనియూ, పూర్ణ పదవి అనియూ వేమన బోధిస్తున్నాడు.

దీనినే శ్రీకృష్ణ పరమాత్మ గీతయందు ' ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' = ఓం అను ఏకాక్షరమే బ్రహ్మము అని నాద బ్రహ్మమును గూర్చి ప్రవచించినాడు.

**'ప్రణవో ధనుశ్శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్'**

అనగా ''ప్రణవము ( ఓం కారము) ధనుస్సు; జీవుడు బాణము; పరబ్రహ్మము (అచల పరిపూర్ణ బ్రహ్మము) లక్ష్యము అని చెప్పబడుచున్నది. సాధకుడు అప్రమత్తుడై ఏకాగ్రచిత్తముతో లక్ష్యమగు పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనవలెను. అపుడు జీవుడు ఇట్టి దట్టిదనరాని పరబ్రహ్మమును జేరును'' అని ముండక ఉపనిషత్తు ఉవాచ.

కనుక ఓం కారమను బ్రహ్మమునే ధనుస్సుగా ఆధారం చేసికొని, జీవుడనే బాణమును ఎక్కుపెట్టి; పరబ్రహ్మమనే లక్ష్యమును చేరుకొనవలెను.

ఇచట పరబ్రహ్మము అనగా బ్రహ్మమునకు పరముగా ఉన్నది. అనగా ఓంకారమునకు అంత్యముగా, అన్యముగా ఉన్నది. అదియే పరిపూర్ణ బ్రహ్మము. అదే బయలు. అదే అచలము. బయలులో నాదం అనగా ఓంకారము లేదు. ఓంకారము (బ్రహ్మము)నకు, జీవునకు అన్యంగా ఉన్నదే పరిపూర్ణ బ్రహ్మము. అదే నాదాంతము. అదే వేదాంతము. అదే పూర్ణ పదవి. అదే పరమ గమ్యము. అదే లక్ష్యము అని వేమన బోధించుచున్నాడు. కాని కొందరు మతవాదులు 'ఓం తత్ సత్' అని ఓంకార బ్రహ్మమునే లక్ష్యముగా నిర్ణయించుకున్నారు. అయితే వారి యొక్క గమ్యము బ్రహ్మము ( ఓంకారము) వరకే కాని ముండక ఉపనిషత్తు ప్రతిపాదితమైన పరబ్రహ్మము (అచల పరిపూర్ణ బ్రహ్మము) వరకు కాదు. కనుక 'ఓం తత్ సత్' అనుట సరికాదని వేమన ప్రబోధించుచున్నాడు.

**కం॥ చెప్పియు జూపగరానిది**
**మెప్పగ మదిలోన జూచి మెలకువ తోడన్**
**త్రిప్పలను బడక చూచిన**
**నొప్పగ జగమెల్ల నిండి యుండును వేమా ॥ 53**

'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత' అని ఛాందోగ్య ఉపనిషత్ తెలుపుతుంది. అనగా నామరూపాత్మకమగు ఈ ప్రపంచమంతయు బ్రహ్మమే అయివున్నది. ఈ జగత్తు దాని నుండే కలిగినది. దానియందే లయమగుచున్నది. దానియందే ప్రతిష్ఠితమై వున్నది.

కనుక కనుపించే సర్వము బ్రహ్మమే అయినప్పుడు, సులభంగా ప్రతీ వస్తువులో అదే వున్నదని చెప్పి చూపించవచ్చును. కాని వేమన చెప్పియు, జూపగ రానిది ఒకటి వున్నది అన్నాడు. కనుక అది బ్రహ్మము కాదు. అయితే అది ఏమిటి? అది పరిపూర్ణబ్రహ్మము. సర్వ లక్షణ విలక్షణమైనది. కనుక దానిని చెప్పి చూపించలేము. అయినప్పటికి గురుబోధ ద్వారా మన మదితో ఆ పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి విచారించి చూచిన సర్వత్రా అది నిండి యున్నదని తెలియబడునని వేమనయోగి బోధించుచున్నాడు.

**తే॥ సర్వమచలంబు గానెంచి సత్యముగను**
**నిర్వహించిన వాడె పో నిర్మలుండు**
**పర్వులిడకయె పూర్తియై పరగుచుండు**
**విశ్వదాభిరామ యిదియు వినుర వేమ ॥ 54**

సర్వమున నిండి వున్నదే సర్వము. ఆ సర్వము అచలము అనగా సర్వమున నిండివున్నది కనుక కదులదు. అదే ఏమికాని పరిపూర్ణ బ్రహ్మము. అద్దానిని తెలుసుకొని లోక కళ్యాణము గూర్చి కర్మలు ఆచరించు కర్మయోగియే నిర్మలుడు. ఆ యోగి రాగాదుల వెంబడి పరుగులిడడు. మరి వైరాగ్యము చేత మానుకొనియుండడు. శాంతంగా తన పనులను తాను నిర్వహించుచుండును. ఇట్లు సర్వమున వున్న అచలమును గాంచిన యోగి స్థితిని వేమన తెలుపుచున్నాడు.

**ఆ॥ ఏమి కాని దాని నెరుగుట లక్ష్యంబు**
**సాము చేసినట్లు సాధ్య పరచి**
**నియమ నిష్ఠ వదలి నిర్గుణ మందరా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 55**

ఏమి కానిది ఏమిటి? ఏమికానిది పరిపూర్ణ బ్రహ్మము. ఎందుకనగా పరిపూర్ణ బ్రహ్మమును వాక్కుతో వర్ణించలేము. మనస్సుతో ఊహించలేము. కనులతో చూడలేము. చెవులతో వినలేము.

చర్మముతో స్పృశించలేము. ముక్కుతో దాని వాసన చూడలేము. నాలుకతో దాని రుచి చూడలేము. అయితే అది ఆకాశమా? అదియూ కాదు. ఎందుకనగా ' ఆకాశస్య గుణః శబ్దః' ఆకాశానికి గుణము శబ్దము. అయితే అది ఆత్మా? కాదు. ఆత్మయే సర్వజీవోపాధులు. కనుక ఆత్మ ఏమి కానిది కాదు. అయితే అది శూన్యమా? అది శూన్యమూ కాదు. ఎందుకు? అది శూన్యమని నిర్ణయించు వాని రహితమునందే అది స్వతః సిద్ధమై యున్నది గనుక. కనుక ఏమి కానిది, సర్వ లక్షణ విలక్షణమైనది పరిపూర్ణ బ్రహ్మమేనని తెలియబడుచున్నది.

అయితే దానిని ఎరుగుట ఎలా? పూర్ణ గురువును దరిజేరి, శుశ్రూషలు చేసి, బోధక్రమము ద్వారా కనుపించే సర్వమూ ఆత్మయేనని పదార్థ నిర్ణయం తెలుసుకోవలెను. ఇది అంత సులువైన పనికాదు. ప్రతిరోజు సాము అభ్యాసం చేయువానివలె, పరిపూర్ణ బ్రహ్మమును తెలియగోరు జిజ్ఞాసి బోధ క్రమమును అభ్యాసపరుచవలెను. అందుకు పనికిరాని నియమ నిష్ఠలు (మూఢాచారాలు) అవసరం లేదు. వాటిని విడనాడి, గురువు చెప్పు విద్యయందు మనస్సును ఏకాగ్రత చేసి సగుణ స్వరూపం నుంచి నిర్గుణ స్వరూపంవైపు పయనిస్తూ సగుణ-నిర్గుణములు కాని, ఏమికాని పరిపూర్ణ బ్రహ్మమును ఎరుగుమని వేమన నుడువుచున్నాడు.

**ఆ॥ మక్కాకు బోనేల మగుడ తా రానేల?**
**యేకమైన కర్త యిందు లేడె ?**
**అన్నిట పరిపూర్ణుడల్లా మహమ్మదు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 56**

ముస్లిములు తమ జీవిత కాలంలో ఒక్కసారైన మక్కాకు వెళ్ళాలని పోవుచున్నారు. పోయినవారు మరి తిరిగి వచ్చుచున్నారు. ఇలా ఎక్కడికో వ్యయప్రయాసలకోర్చి పోయి, తిరిగి రావడం దేనికి? వినోద విజ్ఞానాల కోసమైతే సరే. కాని ముక్తి కోసమైతే అది శుద్ధ దండుగ అంటున్నాడు వేమనయోగి. తనలోనే సర్వోత్కృష్టమైన ఆత్మ వుండగా ఎక్కడికో పుణ్యక్షేత్రములకు పోయి తిరిగిరావడం కాళ్ళ తీటేనని వేమనయోగి అభిప్రాయము. జడ చేతన రహితమైన అచల పరిపూర్ణ బ్రహ్మము అన్నిట పరిపూర్ణమై ఒప్పియున్నదని, అదే 'అల్లా మహమ్మదు' అని వున్న చోటనే వుండి తెలిసికోరాదా? అని వేమన ప్రవచించుచున్నాడు.

తే॥ ఎన్ని విద్యలు నేర్చిన నెరుగరాదు
తన్ను నిర్గుణ జ్ఞప్తిలో దాక వలెను
నిర్ణయో నాస్తి సర్వదా నిండి యుండు
విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య ॥ 57

ఎన్ని విద్యలను నేర్చినను, పరిపూర్ణ బ్రహ్మమును ఎరుగరాదు. ఎందుకు? పరిపూర్ణ బ్రహ్మమును మన వాక్కుచే వర్ణించలేము. కనులచే చూడలేము. మనస్సుచే ఊహించలేము. దీనినే 'యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అని తైత్తిరీయ ఉపనిషత్తునందు చెప్పబడింది. మరి ఈ పరిపూర్ణ బ్రహ్మమును ఎలా దర్శించవలెను? నేనే గుణస్వరూపుడును. నేను బ్రహ్మమునకు వేరుగా లేను. కనుక బ్రహ్మము గుణములతో నిండి యున్నదని అవగతమగుచున్నది. కనుక బ్రహ్మము ఆత్మ స్వరూపంగా వున్నప్పుడు నిర్గుణంగా, నిర్మలంగా వుంటుంది. ఆ ఆత్మయే ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథ్వీ, అన్నం, పురుషునిగా మారినప్పుడు సగుణంగా తెలియబడింది. కనుక ఆత్మయే సగుణ- నిర్గుణ రూపంగా వుంది.

ఆత్మస్థానంలో సృష్టికి కారణమైన ధర్మాలున్నవి. కనుక ఆత్మ సగుణ స్వరూపం అనే తేలుతుంది. కనుక, ఇచట వేమన 'నిర్గుణ జ్ఞప్తిలో దాకవలెను' అన్నాడు. అనగా ఆత్మకు అతీతంగా వున్న పరిపూర్ణ బ్రహ్మము శుద్ధ నిర్గుణము. దానిని తెలుసుకోండని చెప్పుచున్నాడు. మరి ఆ పరిపూర్ణ బ్రహ్మము ఎలావుంది? అంటే దాని యందు ఏ నిర్ణయం లేదు. సర్వదా అంతటా నిండియున్నదని వేమన నుడువుచున్నాడు. అది నిర్గుణమూ కాదు, సగుణమూ కాదు. బీజమూ కాదు, వృక్షమూ కాదు. ప్రకృతీగాదు, పురుషుడూ కాదు. మృతమూ కాదు, అమృతమూ కాదు. ఎందుకు? అది ఇటువంటిదని నిర్ణయం చేయుటకు నిర్ణయం చేసేవాడే లేడు. కనుక దానికి ఏ నిర్ణయం లేదు. అయితే దానికి నిర్గుణమని ఏల చెప్పిరి? నిర్గుణము - సగుణము మొదలగు ద్వంద్వములన్నియు సాపేక్షికములే. అవన్నియూ ఆత్మ(ఎరుక) స్వరూపములే. అయితే శిష్య ప్రబోధార్థం అలా చెప్పిరి. కనుక పరిపూర్ణ బ్రహ్మము నిరపేక్షమైనదని తెలియవలెనని విమలగుణ సంపన్నుడునూ, రాజయోగీంద్రుడునూ అయిన వేమనాచార్యుడు బోధించుచున్నాడు.

దీనినే 'శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మ దేహోనాస్తి కదాచన ।
అస్తినాస్తీతి కోవేద నిర్ణయోనాస్తి సర్వదా ॥ '

అనే భ్రాంతి రహిత శ్లోకము చెప్పుచున్నది.

దీని భావము: ఆత్మకు అతీతమైనది కేవలాత్మ. కేవలాత్మ అనగా పరిపూర్ణ బ్రహ్మము. దేహము ఎప్పుడూ లేదు. అనగా ఆ పరిపూర్ణ బ్రహ్మములో దేహము లేదు. కనుక ఆ స్థితిలో ఇది వున్నది, అది లేదు అని ఎవరు తెలుసుకోగలరు? ఎవరునూ తెలిసికోలేరు. కనుక ఆ పరిపూర్ణ బ్రహ్మమునకు ఎల్లప్పుడునూ నిర్ణయమే లేదు. కనుకనే దానిని గూర్చి నిర్ణయం చేయడమే మహాపాపమని శ్రీ శివరామదీక్షితులవారు బోధించియున్నారు.

**ఆ॥ అచట నిచట జూడ నమరదు గురుభక్తి**
**ప్రచురముగ నాత్మ బయల జేసి**
**రుచిరముగను జూడ నచలమై దోచురా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 58**

గురుభక్తి యొక్క మహిమ గొప్పవారికే తెలుసు. అష్టసిద్ధులను సాధించిన ఆంజనేయుడు శ్రీరాముని యందుంచిన గురుభక్తి జగద్విదితమే కదా? గురువు యందు భక్తి లేనిచో గురువు బోధించు విద్య శిష్యునికి అతుకదు. గురుభక్తి లేనిచో గురుతు రహితం కాదు. కనుక గురుభక్తిని హృదయంలో శిష్యుడు పెంపొందించుకోవాలి. అలా పెంపొందించుకున్న గురుభక్తి శిష్యునికి ఎలా అమరగలదు? అనగా గురువు బోధించిన విద్య శిష్యునికి ఎలా అతుకగలదు? శిష్యునికి పెక్కు శాస్త్రములతో పనిలేదు. సచ్ఛాస్త్రము ఒక్కటి చాలు. సచ్ఛాస్త్రము ఏది? ఎచ్చట కలదు? అది ఎచ్చటనో లేదు. అది మనముందే వుంది. వస్తునిర్ణయంగాచేయు విశ్వ పరిశోధనమే సచ్ఛాస్త్రము. ఇది ప్రత్యక్ష ప్రమాణమే. అలా ప్రత్యక్ష ప్రమాణ పద్ధతితో గురువుద్వారా తెలుసుకున్నప్పుడే గురుభక్తి అమరగలదు. కనుక శిష్యుడు పెక్కు విషయాల యందు మనసును పోనీయక గురుభక్తిని హృదయంలో నుంచుకొని అంతరేంద్రియాలను అంతర్ముఖం చేసి గురువు బోధించు విషయంపై కేంద్రీకరించవలెను. అప్పుడే గురువుయొక్క అనుగ్రహ భాషణంతో ఆత్మయొక్క స్థాన, స్వరూప, స్వభావములు అవగతం అవుతాయి. ఆత్మను పరిశోధించి చూడగా చివరికి ఆత్మయే లేకుండా అయి అచలము కనిపించునని శ్రీ వేమన యోగి వక్కాణించుచున్నాడు.

**కం॥ పరదేశిక చరణంబుల**
**నురమున ధరియించి మిగుల నుత్సాహముతో**
**గురువరుని వేడినంతట**
**పరిపూర్ణము నొక్కి చూపు పదిలము వేమా॥ 59**

ఈ పరిపూర్ణమును స్వయంగా చూడదలచినవాడు భ్రష్టుడే కాగలడు. అందువల్ల దానిని చూడదలచిన వాడు పరిపూర్ణబ్రహ్మమును దర్శించిన పరదేశికుడైన గురుచరణంబులను తన శిరస్సున ధరియించి, మిగుల ఉత్సాహముతో ఆ గురువర్యున్ని వేడుకొన్నచో పరిపూర్ణమును చూపించగలడని వేమనయోగి వచించుచున్నాడు. కనుక గురు సూచన వల్లనే పరిపూర్ణ బ్రహ్మము తెలియబడునని వేమన అభిప్రాయం.

ఆ॥ **ఆకృతి నరయగ నిరాకృతియు దగు ని**
**రాకృతి నొగిదగును యాకృతిట్లు**
**యవియు రెండు లేక నప రూపమై యుండు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **60**

బ్రహ్మము ( ఆత్మ ) నిరాకృతిగా యుండును. ఆ బ్రహ్మమే పరిణామము చెంది ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వీ, ఓషధులు, అన్నము క్రమముగా వచ్చినవి. ఆ అన్నము నుండియే జీవులు ఏర్పడినవి. కనుక విచారించి చూడగా నిరాకృతిగల బ్రహ్మము నుండియే ఆకృతిగల జీవులు ఏర్పడినాయి. మళ్ళీ ఆ జీవులే ఊర్ధ్వ పరిణామము చెంది వాటి ఆకృతిని కోల్పోయి, నిరాకృతిగల బ్రహ్మముగా మారును. కావున విజ్ఞాని ఆకృతియందు నిరాకృతిని, నిరాకృతియందు ఆకృతిని నిరంతరము చూచుచుండును. ఆ ఆకృతి, నిరాకృతి అను ద్వంద్వ పద్ధతి దేనియందు లేదో అదియే సర్వలక్షణ విలక్షణమైన పరిపూర్ణ బ్రహ్మము. ఆ పరిపూర్ణ బ్రహ్మమును నిరాకృతి అనరాదు. ఆకృతి అనరాదు. అవి రెండూ దానియందు లేవు.

ఆ॥ **మనసులేని తావు మరగిన శూన్యము**
**శూన్యమనగ రాదు సూటిగాను**
**బయలులోన రవము ప్రకటితముగ లేదు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **61**

ఎరుకే మనస్సు . మనస్సు ఏ స్థానమందు లేదో, ఆ స్థానమును శూన్యమని చెప్పుదురు. ఆ స్థానమును శూన్యమనరాదని వేమన చెప్పుచున్నాడు. ఆ స్థానమును బయలు ( అచల పరిపూర్ణ బ్రహ్మము) అని వేమన తెలియపరచుచున్నాడు. ఆ బయలు యందు రవము ( శబ్దము) లేనేలేదు.

కొందరు ఆకాశమునే బయలని చెప్పుచున్నారు. కాని ఆకాశమునందు రవమున్నది. కనుక అది 'నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే' అని చెప్పబడే అచల పరిపూర్ణ బ్రహ్మము కాజాలదని వేమన స్పష్టపరచుచున్నాడు. ఇచట ఎరుకే శూన్యమని గుర్తించనగును.

ఆ॥ అచల తత్త్వమనగ ననుభవ గమ్యంబు
చూపి చెప్పరాదు సూక్ష్మమదియె
మదికి దోచుగాని మర్మమెన్నగరాదు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 62

అచల తత్త్వమును అనుభములేని అనుభవము ద్వారా తెలిసికొనదగినది. ఆ అచల పరిపూర్ణ బ్రహ్మమును చూపించి, దానిని గూర్చి వర్ణించి చెప్పలేము. అది సూక్ష్మదృష్టి కలవారికి తెలియుబడును. కాని దానియొక్క మర్మము గురువులేక తెలియుబడదని వేమనయోగి ప్రవచించుచున్నాడు. కనుక అచల తత్వమును అచల గురుని ద్వారా తెలిసికొని అనుభవములో చూసుకోవలయును. అట్లు కాక స్వయంగా అచల తత్వమును గ్రహింపబూనువాడు అధోగతి పాలగును.

కం॥ మూటికి మూలంబైనది
ధాటిగ గుర్తించిమించి ధావళ్యమునన్
సూటిగమించిన తత్వము
చాటింతురె యచలమనుచు సరసత వేమా॥ 63

సత్వరజస్తమో గుణముల మూడింటికి మూలమైనది ఆ ఎరుకయే యని గుర్తించవలెను. ఆ ఎరుకయే ప్రకాశస్వరూపమైన జ్ఞానము. 'సత్వాత్సంజాయతే జ్ఞానం'. కనుక ఎరుక వున్నంత వరకు ఈ త్రిగుణాల వల్ల జ్ఞానాజ్ఞానములు కలుగుచూనే యుండును. ఈ త్రిగుణాల వల్లనే జనన మరణములు కలుగుచున్నవి. కనుక ఈ త్రిగుణాలకు మూలమైనది ఆ ఎరుకయేనని గుర్తించి, దానిని అతిక్రమించవలెనని తెలుపుచున్నాడు వేమన. ఆ ఎరుకను మించిన తత్వమును అచలతత్వమని తెలియజేయుచున్నాడు. ఇచట అచలము త్రిగుణాతీతం అని వేమనయోగి ప్రకట పరచుచున్నాడు.

ఆ॥ చచ్చువారి జూచి చావని పుట్టని
తత్వమెల్ల నాత్మ దలపు జేసి
యరసి చూచి నట్టి యతనికి మోక్షంబు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 64

మన కళ్ళముందే చనిపోయిన వారిని చూస్తూ, మనం మాత్రం శాశ్వతంగా బ్రతుక గలమని చావు మరచి వెర్రి పనులు చేస్తూ వుంటాం. కాలం అమూల్యమైనది. కనుక చచ్చువారిని చూచి, చావని పుట్టని తత్వమెల్ల ఆత్మ తలపు చేసిన వాడికి మోక్షము సులభము అని వేమన ప్రవచించుచున్నాడు.

చావని పుట్టని తత్వమేదీ? ఆ పరిపూర్ణ బ్రహ్మము చావనిదీ, పుట్టనిదీ అలా ఎందుకు వివరించవలసి వచ్చినది? ఆ పరిపూర్ణ బ్రహ్మము అద్వైతుల మాయలాగ గిట్టదు, 'స్వయంభు' = ఆత్మలాగ పుట్టదు. కనుకనే ఈ తత్వమును చావనిదీ, పుట్టనిదీ అని చెప్పిరి. ఈ తత్వమును ఆత్మ విచారము చేసినవాడికి మోక్షము కరతలామలకమని వేమన వివరించుచున్నాడు.

తే॥ వేదశాస్త్ర పురాణముల్ వెదుకనేల
యాది యంత్యము లేనిదే యచలమగును
సాధు మదిలోన వెలిగెడు సత్యమౌను
విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య ॥ 65

ఎన్నియో వ్యయప్రయాసల కోర్చి వేదములు, శాస్త్రములు, పురాణములు ఎన్నియో చదివిననూ, వాటియందు వెదకిననూ అచలము అంత సులభంగా తెలియబడదు. ఎందుకనగా శాస్త్రముల జ్ఞానము బుద్ధిని చలింపచేయునే కాని; బుద్ధిని నిశ్చల తత్వము వైపు పోనీయదు. పైగా సంశయములు పెచ్చు పెరిగి, 'సంశయాత్మ వినశ్యతి' అను న్యాయమున అధోగతి పాలు గాక తప్పదు. కనుక ఈ తత్వమును తెలియగోరు మనుజుడు అచల గురుని చేరి తరించవలయును.

అచలము(పరిపూర్ణ బ్రహ్మము)నకు మొదలు గాని చివరగాని లేదు. కనుక మధ్యమమూ లేదు. అట్టి తత్వమును సాధించిన వాడే సాధువు. అట్టి సాధువు మదిలో వెలిగెడు ఈ తత్వము సత్యమని వేమన నొక్కి వక్కాణించుచున్నాడు.

తే॥ చూపు లోచూపు వెలిచూపు చూడనేల
ఆది యంతము లేనట్టి దచల మగును
వేద గురుమూర్తి మదినుంచు వేగముగను
విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య ॥ 66

చూపులోని చూపు ఏది? అందరూ అనుకొంటుంటారు ఈ మాంస చక్షువులతో చూస్తున్నామని. కొందరు కన్నులు సరిగా వున్ననూ బజారులో పోతూ వున్నప్పుడు ఎవరో ఒకరు కలిసి; ఫలానా వ్యక్తిని ఈ మార్గంలో చూచితిరా? అని అడిగినపుడు జవాబు చెప్పలేక నేను వేరే ఆలోచనలో వున్నాను. చూడలేదు, అని సమాధానం ఇస్తారు. అయితే వారు కళ్ళు వుండి కూడా ఎందుకు చూడలేకపోయారు? కళ్ళు లేవా? అంటే వున్నవి.

కనుక కను చూపు వేరు. ఆ కనుల చూపు ద్వారా బయటి వస్తువులను చూసే చూపు వేరు. ఆ చూపే జ్ఞానము. ఆ జ్ఞానమే కనురంధ్రముల ద్వారా రూపమును చూస్తుంది. ముక్కు రంధ్రముల ద్వారా వాసనను ఎరుగుతుంది. చర్మరంధ్రాల ద్వారా స్పర్శను తెలుసుకుంటుంది. నాలుక రంధ్రాల ద్వారా రుచిని తెలుసుకుంటుంది. చెవుల రంధ్రాల ద్వారా శబ్దాన్ని వింటుంది. కనుక పరిపూర్ణ బ్రహ్మమును తెలుసుకోగోరువాడు చూపు, లోచూపు, వెలిచూపులను చూడనొల్లడు. ఎందుకు? చూపు అనునది దృక్కు. లోచూపు అనునది ద్రష్ట. వెలిచూపు అనునది దృశ్యము. ద్రష్ట- దృక్- దృశ్యము అనే త్రిపుటీ రహితమునందే అచలము స్వతస్సిద్ధము. కనుక వీటితో ఆ అచలమును చూడలేము. ఆ అచలము మొదలు కొన లేనట్టిది. కనుక ఆ అచలమును తెలుసుకోగోరువాడు దానిని తెలిసిన గురుమూర్తిని వేగముగా చేరుకొని సేవించి, బోధక్రమము ద్వారా ఆ అచలమును గాంచ వలయునని విమలగుణుడునూ, రాజయోగీంద్రుడునూ అయిన వేమనాచార్యుడు బోధించుచున్నాడు.

కం॥ ఇరువదియారవ తత్వం
బరుదుగ జీవాత్మ దాని యా పరమాత్మన్
యిరువంద గూర్చి గురుపద
మరయంగా యోగియందు రాతని వేమా ॥ 67

అచల పరిపూర్ణ బ్రహ్మము ఇరువది ఆరవది. జీవాత్మ పరమాత్మల ఏకత్వమును ( ఇరువది అయిదవది) సాధించిన బ్రహ్మజ్ఞాని, పరిపూర్ణ గురువును చేరుకొని బ్రహ్మోతీతమైన పరిపూర్ణ బ్రహ్మమును తెలిసికొన్నచో, ఆతనినే యోగియని అందురని వేమన యోగి ప్రకట పరచుచున్నాడు.

ఈ పద్యం వల్ల వేమన అచల యోగి అని స్పష్టమైనది. ఎందుకనగా ఇరవై ఆరోదని ఏ మతములోనూ కూడా పరిపూర్ణబ్రహ్మమును గూర్చి చెప్పబడలేదు. అద్వైతులు ఇరవై అయిదోదే (జ్ఞానమునే) బ్రహ్మమని చెప్పారు. అదే ఎరుక అని వేమన చెప్పాడు. కనుక వేమన అద్వైతి కాడని తెలియబడుచున్నది.

**కం॥ బ్రహ్మమేడదనుచు పలుమారు నాడేరు**
**వెర్రి మూర్ఖ జనుల విధము జూడ**
**బ్రహ్మ మన్నిటందు పరిపూర్ణమై యుండు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 68**

పరిపూర్ణ బ్రహ్మమును కనుగొనలేని మందమతులు పరిపూర్ణబ్రహ్మము ఎచ్చట నున్నదని పలుమార్లు ప్రశ్నించుచుంటారే తప్ప, దానిని తెలిసికోలేరు. ఆ పరిపూర్ణ బ్రహ్మము అన్నింటి యందు నిండి నిబిడీకృతమై పరిపూర్ణమై ఒప్పియున్నదని వేమనయోగి తెలియజేయుచున్నాడు.

**కం॥ దేహికి దేహంబిల్లని**
**మోహముచే దేహమందు మురియుచు నుండున్**
**దేహియు దేహములంటని**
**దేహమె గద బట్టబయలు తెలియగ వేమా ॥ 69**

దేహికి దేహము ఇల్లు. ఈ దేహమును ఇల్లు యందే దేహి మోహముచే మురుస్తూ వుంటున్నది. అయితే బట్టబయలు( పరిపూర్ణ బ్రహ్మము ) ఈ దేహీ దేహములలో ఏది? దేహీ దేహములు బట్టబయలు కాదు. దేహీ దేహములను అంటక వున్నదే ఆ బట్టబయలు అని వేమన తెలియజేయుచున్నాడు.

కనుక ఆ పరిపూర్ణ బ్రహ్మము దేహి దేహములకు అతీతంగా వున్నదని వేమన తెలియపరచుచున్నాడు. అది దేహమూ కాదు, దేహియూ కాదు.

**ఆ॥ ఊరకుంట దెలియ ఉత్తమయోగంబు**
**మానసంబు కలిమి మధ్యమంబు**
**ఆసనాది విధులు అధమయోగంబురా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 70**

ఈ అచల పరిపూర్ణ బ్రహ్మమును ఊరకనేయుండి తెలిసికొనుటచే ఉత్తమయోగము. మనోసంబంధమైన యోగము వలన మానసిక శక్తులను కలుగజేయు కొన్ని రకాల సిద్ధులు కలిగిననూ, అవి అశాశ్వతము. కనుక అట్టియోగము మధ్యమమే. ఇక ఆసనాది విధులు శరీరారోగ్యము కోసమేగాని, మోక్షసాధనకు పనికిరావు. కనుకనే ఆసనాది విధులను 'జెట్టి సాము కన్న చింతాకు తక్కువ' అని వేమన యోగి మరో చోట చెప్పియున్నాడు. కనుక మనస్సుచే, శరీరముచే చేయు యోగముల ద్వారా ఆ అచల పరిపూర్ణ బ్రహ్మము తెలియబడదు. అద్దానిని ఊరకనేయుండి, గురు సూచన ద్వారా తెలిసికొని తెలివి మరచి యుండుటచే 'ఉత్తమ యోగము' అని శ్రీ వేమనయోగీంద్రుడు ప్రవచించుచున్నాడు.

వేరొక విధంగా 'ఊరకుంట దెలియ' అనగా కర్తృత్వరహిత కర్మాచరణయే ఉత్తమయోగమని వేమనార్యుని అభిప్రాయము గుర్తించనగును.

**ఆ॥ నేరనన్నవాడు నెరజాణ మహిలోన**
**నేర్తునన్నవాడు వార్తకాడు**
**యూరకున్నవాడె యుత్తమోత్తముడెందు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 71**

ఆ అచల పరిపూర్ణ బ్రహ్మము వాక్కుకు, మనస్సుకు అందనిది అని నిర్ణయంచేసి, అది వున్నది కాని నాకు తెలియబడనిదని చెప్పువాడు నెరజాణ అనగా నేర్పరి. ఆ అచల పరిపూర్ణ బ్రహ్మమును నేను చూసినాను, అది నాకు తెలిసినది అని చెప్పువాడు వార్తకాడు. అనగా

వాగుడుకాయ. అట్లుగాక తానే (ఎరుకే) శూన్యమని తెలిసికొని, ఆ పై నున్న అచల పరిపూర్ణ బ్రహ్మము వున్నదని గాని, లేదని గాని (తెలిసినదని గాని, తెలియలేదని గాని) నిర్ణయం చేయక యూరకయున్నవాడే ఉత్తమోత్తముడని వేమనయోగి వేదాంతము.

ఇట్లు శ్రీ వేమనయోగి అచల పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి తన పద్యాలలో స్పష్టముగా తెలియజేసియున్నాడు. దీని వలన వేమన యొక్క వేదాంతము ద్వైతాద్వైతవిశిష్టాద్వైతరహితమైన పరమతత్వమని తెలియబడుచున్నది.

ఆరవ అధ్యాయం

# ఎరుక

''ఎరుక మెరుపు వలె వున్నాననిపించి వెంటనే యేమి లేక పొయ్యేది. కల వంటిది'' అని శ్రీ వేమయోగి గురుసాంప్రదాయకుడగు శ్రీ శివరామదీక్షితులు (సుమారు క్రీ.శ. 1690-1791) తమ 'బృహద్వాశిష్ఠము' అను గ్రంథంలో తెలిపియున్నారు.

ఎరుకే పిండ బ్రహ్మాండములు. ఇదే జీవేశ్వరులు. ఇదే దేహిదేహాలు. ఇదే ఖండం, అఖండం. ఇదే నీవు నేను. ఇదే ఆత్మానాత్మలు. ఇదే సదసత్తులు. ఇదే శివశక్తులు. ఇదే పంచభూతాహంకారమయమైన జడాజడాత్మక ప్రపంచము. ఇదే నాదబిందు కళలు. ఇదే దేహేంద్రియములు. ఇదే జ్ఞానాజ్ఞానములు. ఇదే ప్రకృతీ పురుషులు. ఇదే తెలివి. దీనికి అచల పరిపూర్ణ బ్రహ్మమునకు ఏ మాత్రము సంబంధం లేదు. సర్వ సృష్టికి మూలం ఇదే. పుట్టి చచ్చేదిదే. రాకడ పోకడలు దీనికే గలవు. నేను నేనే అనేది ఇదే. నీవు నేనే అనేది ఇదే. దేవుడు నేనే అనేది ఇదే. వేదశాస్త్రాలు వ్రాసుకున్నది ఇదే. భాష్యాలు వ్రాసుకున్నది ఇదే.

ఇదే సచ్చిదానందము. ఇదే మూలమాయ. ఇదే నేనునే అంతఃకరణ గలది. ఇదే సర్వద్విపుటులు. ఇదే సర్వత్రిపుటులు. ఇదే ద్వైతము. ఇదే అద్వైతము. ఇదే విశిష్టాద్వైతము. ఇదే సాక్షి. ఇదే కర్త. ఇదే భోక్త. ఇదే భోగ్యము. తాను ఒక్కటే అయివుండి తనలో తానే అనేకముగా భ్రమించుచున్నది. ఇదే త్రిగుణాత్మకమైనది. దీనికే సిగ్గు. దీనికే ఆకలి. దీనికే అభిమానం. దీనికే గుర్తు. ఇదే వెలుగు. ఇదే చీకటి. నిర్ణయాలు చేసేది ఇదే. నిర్ణయానికి దొరికేది ఇదే. పుట్టేదిదే, పుట్టించేదిదే. క్షణమైన వూరికే వుండక ఏదో ఒక వ్యవహారం చేస్తుండేది ఇదే. ఏకం ఇదే. అనేకం ఇదే. ఇదే జనకుడు లేనట్టి మాయ. శూన్యమై పోయేది ఇదే. తనకు మొదలు లేదని ఎరిగేది ఇదే. కొనకు వుండేటందుకు ఏమిలేదని ఎరిగేది ఇదే. వచ్చినప్పుడు నీవు ఎక్కడినుండి వచ్చావు, పోయేటప్పుడు ఎక్కడికి పోతావు అని అడిగే దిక్కులేనిది. ఇదే వచ్చినప్పటి నుండి సుఖమైనా దుఃఖమైనా అనుభవించి పోయేది. నమ్మేది ఇదే, మోసపోయేది ఇదే. దేహమే తాననుకునేది ఇదే. దీని రాకడే ప్రపంచోత్పత్తి. దీని పోకడే ప్రపంచ ప్రళయము. దీనికి మూలములేదు. కాని అన్నింటికి మూలము ఇదే. సర్వక్రియలకు ఇదే కర్త . ఇదే ఓంకారము. ఇదే విక్షేపావరణములు. ఇదే బీజవృక్షములు.

దేహమును విడిచి దేహికి ఉండేందుకు చోటు లేదు. దేహిలేకుంటే దేహమును ఎరిగేవారు లేరు. దేహి లేక దేహము రాలేదు. కనుక దేహీ దేహాలు ఒక్కటే. ఈ రెండు వేరు కావు. రెండు కలిసి వచ్చుచున్నాయి, కలిసి పోవుచున్నాయి. ఈ దేహీ దేహాలకు అంటకయున్నదే పరిపూర్ణ బ్రహ్మము.

ఎరుకే జ్ఞానరూపము. ఇదే కర్మరూపము. ఇదే జ్ఞానకర్మల ముడియైన భక్తి రూపము. ఇదే ఇచ్ఛారూపము. ఇదే ఇరవై అయిదవ తత్వం. మిగిలిన ఇరవై నాలుగు తత్వాలు ఇదే. జ్ఞానకర్మ రూపమైన శరీరము ఇదే. ఇది తప్ప అంతా పరిపూర్ణబ్రహ్మమే.

షణ్మతములను కల్పించినది ఎరుకే. తన మతము తనకే సమ్మతముగాని, యే మతమును నమ్మనిది ఇదే. వాదోపవాదాలు చేసేది ఇదే. ఇది పరిపూర్ణబ్రహ్మము కాదు. పరిపూర్ణబ్రహ్మము ఇది కాదు. సర్వ సామర్థ్యములు ఎరుకకే కలవు. ఇదే శిష్టు. ఇదే భ్రష్టు. ఇదే ఇహపరములు. ఇదే జీవేశ్వర జగత్తులు. ఇదే గురు శిష్యులు. శరీరం అబద్ధం, నేను నిబద్ధి అనేది ఇదే. నేను వేరే, ఈశ్వరుడు వేరే అనేది ఇదే. సకల భ్రమలకు మూలం ఇదే. దీనికే అధిక నీచాలు. దీనిని నిల్పేవారికంటే, నిలుపుకునేవారికంటే వేరే భ్రాంతికులు లేరు. ఇదే అనేక కోటి బ్రహ్మాండములున్నవని భ్రాంతి పెడుతుంది. తనకు మూలం లేదని ఎవరితోను చెప్పదు. అందరూ తానే అయివున్నది. దీని వల్లనే కర్మలు పుట్టును.

ఎరుకే శరీరము. శరీరమే ఎరుక. ఈ రెంటిని వేరనేదే వెర్రి. ఎరుకచే పుట్టని చావని పరిపూర్ణబ్రహ్మమును వుండజూచి ఎరుకను ఏమీలేదని నిశ్చయించి వుంటేచాలు. ఏ సాధనా అవసరం లేదు. ఏ సాధన చేసినా ఇది విడిపోదు. ఇదే కంటిలోని నలుసు, చెవిలోని జోరీగ, కాలిలోని ముల్లు, చెప్పులోని రాయి, ఇంటి (శరీరము)లోని పోరు. ఇదే మేడి పండు వంటిది. ఇదే పట్టుపురుగు కాయవంటిది. ఇదే పుట్టలోని భుజంగము వంటిది. ఇదే వూర్ణనాభి (సాలెపురుగు) వంటిది. ఇదే రాలిన ఆకువంటిది. వాయువు వంటిది. మృగజలము వంటిది. రజ్జు సర్ప భ్రాంతి వంటిది. ఇదే మొగుడులేని ముత్తైదువ తనం. ఇదే తెగిన గాలిపడగ. ఇదే ఆసుకొయ్య. ఇదే కాలే బొగ్గువంటిది. ఇదే గగన పుష్పములాంటిది. ఇదే ఇసుక బావిలాంటిది. ఇదే తిలలందు తైలమున్నట్లుంది. ఇదే నీళ్లలోని మొసలి వంటిది. ఇదే గాజు యింటనున్న కుక్క వంటిది. (కుక్కయే బ్రహ్మజ్ఞాని). ఇదే కుందేటి కొమ్మువంటిది. నీళ్ల మీది ఓడవంటిది. ఇదే ప్రజ్ఞానం బ్రహ్మ. అహం బ్రహ్మోస్మి ఇదే. తత్వమసి బ్రహ్మ ఇదే. ఇదే అయమాత్మా

బ్రహ్మ. ఇదే ఓమిత్యేకాక్షరం బ్రహ్మ. ఇదే బ్రహ్మైవాహమస్మి. ఇదే సచ్చిదానంద బ్రహ్మ. ఇదే సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ.

పైన వివరించిన ఎరుక స్వరూపమునే వేమన పలు పద్యాలలో తెలియజేశాడు. ఈ ఎరుకను వేమన పద్యాల ద్వారా నిర్ణయం చేయడమే ఈ ఆరవ అధ్యాయము యొక్క లక్ష్యము.

**ఆ॥ బ్రహ్మమనగ వేరె పరదేశమున లేదు**
**బ్రహ్మమనగ తానె బట్టబయలు**
**తన్ను దా నెరిగిన తానె పో బ్రహ్మంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 72**

బ్రహ్మమనగా అది సామాన్యమా? అది ఏదో లోకంలో వుందని అక్కడికి వెళ్లి ఎవరు చూశారని అంటుంటారు కొందరు. దీనికి సమాధానంగా వేమన పై పద్యాన్ని చెప్పాడు. బ్రహ్మమనగా ఎక్కడో పరాయి దేశంలో గాని, వేరే లోకంలో గాని లేదనియూ; బ్రహ్మమే తానని బట్టబయలు చేస్తున్నాడు వేమన. మరియు తన్ను తాను తెలుసుకొన్నచో తానే బ్రహ్మమని తెలియునని వేమన బోధిస్తున్నాడు.

'అహం బ్రహ్మాస్మి' అనే మహావాక్యం దీనినే తెలుపుచున్నది. కనుక పరలోకాల భ్రమల యందున్న వారు భ్రమలందే తిరుగుచుందురు.

**ఆ॥ బ్రాహ్మవాదులెల్ల బ్రహ్మంబు యనగను**
**యరసి తెలసి చూడ యొద్ద నుండు**
**ముందు యున్న యట్టి ముద్రిక గానరో?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 73**

బ్రహ్మవాదులందరు బ్రహ్మమును గూర్చి వాదోపవాదాలు చేయుచూవుంటారు. విచారించి చూడగా, ఆ బ్రహ్మము ఎచ్చటో లేదు మనముందే వున్నదని తెలుపుచున్నాడు వేమన. ముద్రల ద్వారా ఆ బ్రహ్మమును చూచెదమని కొందరు ప్రయత్నించుచున్నారు. కాని విచారించగా ఆ ముద్రలు చేయువాడు, ముద్రిక కూడా ఆ బ్రహ్మమేనని తెలుసుకోరాదా? అని వేమన ప్రశ్నించుచున్నాడు.

ఆ॥ బ్రహ్మవేత్తలమని పౌరుషమాడేరు
బ్రహ్మమనగ దాని భావమేమి?
తెలుపా నలుపా యెరుపా తెలసిన బలుకుడి?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 74

మతవాదులందరూ తాము బ్రహ్మవేత్తలమని గొప్పగా చెప్పుకొనుచూ వుంటారు. బ్రహ్మమనగ దాని భావమేమిటి? మరియూ వస్తువు ఏమిటి? అది తెలుపా, నలుపా, ఎరుపా తెలిసినచో సమాధానమివ్వండని వేమన వారిని ప్రశ్నించుచున్నాడు. ఇచట బ్రహ్మము యొక్క స్థాన, స్వరూప, స్వభావములేమిటని వేమన ప్రశ్నించుచున్నాడు. జీవేశ్వర జగత్తును తనయందు గర్భీకృతం చేసుకున్న బ్రహ్మము యొక్క వర్ణము పాటలీ వర్ణము. దాని యొక్క రూపము సర్వాకారము. దానియొక్క స్థానము శూన్య స్థానము అని సిద్ధాంత నిర్ణయం.

ఆ॥ గురము గూడు జేసి గుణము వత్తిగ జేసి
సరవి కర్మ సమితి జమురు జేసి
మూల నొక్క జ్యోతి ముట్టించి చూడరా!
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 75

శరీరమును గూడు (ప్రమిద) గా, గుణమును వత్తిగా, కర్మ సమితిని చమురుగా జేసి ఆత్మజ్యోతిని వెలిగించుమని వేమన బోధించుచున్నాడు. కనుక ఆత్మయనేది ఎచ్చటనో లేదు. తనయందే ఆత్మను గాంచుమని వేమన ప్రవచించుచున్నాడు.

కం॥ ఏక బ్రహ్మము నిత్యము
వైకల్పికమైన యట్టి వస్తువు లెల్లన్
యేకత్వంబని యెరిగిన
శోకములే కల్ల ముక్తి సులభము వేమా ॥ 76

తాను కోరుకున్నది దొరకనప్పుడు మానవునికి శోకం కలుగుతుంది. ఈ శోకం ఎందుకు కలుగుతుంది? జ్ఞాన శూన్యత వల్ల కలుగును. తత్వజ్ఞానమే జ్ఞానము. మిగతాది సామాన్య జ్ఞానము. అయితే శోకాన్ని రాకుండా చేసుకోవడం ఎలా? తత్వవివేచనా జ్ఞానం పొందడం ద్వారా శోకాన్ని త్యజించవచ్చును. తన చుట్టూ వున్న అనేక వస్తువులను కోరుకుంటాడు మానవుడు.

కోరుకునే వస్తువులు వేరు, తాను వేరు అనుకుంటున్నాడు. విమర్శించి చూచినచో వస్తువులకు మూలం ఏమిటి? దానిలో వున్న అణువులు. అణువులకు మూలమేమిటి? పరమాణువులు. పరమాణువులకు మూలం ఏమిటి? దానిలో వున్న మౌళిక కణాలు. నా శరీరానికి మూలం ఏమిటి? సంయుక్త బీజకణము. దానికి మూలకారణం ఏమి? డి.ఎన్.ఎ., ఆర్. ఎన్.ఎలను పరమాణువులు. వీటికి మూలం ఏమిటి? వాటిలోని మౌళిక కణాలు. అయితే అనేక వస్తువులకు నాకు భేదం ఎందుకు ఏర్పడింది? వస్తువుల లేక జీవకణాల భౌతిక, రసాయనిక, జీవ ధర్మాలు పరమాణువుల అమరికపై ఆధారపడి వున్నాయి. కనుక పరమాణువుల విభిన్న నిర్మాణాలననుసరించి విభిన్న పదార్థాలు గోచరిస్తున్నాయి. అయినా వాటిలో ఉన్న మౌళిక కణాలు ఏకత్వమునే సూచిస్తున్నాయి. కనుక పదార్థాలన్ని ఏక రూపమే. పదార్థాలన్నింటిని శక్తిగా మార్చవచ్చును. శక్తిని పదార్థముగా కూడ మార్చవచ్చును. కనుక పదార్థమూ, శక్తియూ ఏక రూపమే. అదే ప్రకృతి. ఇక తెలుసుకొనే తెలివే పురుషుడు. ఈ ప్రకృతీ పురుషులు ఓతప్రోతములయ్యే వున్నారు. అదే శివశక్తులుగానున్న ఏక బ్రహ్మము. అదే ఎరుక. ఈ ఏక బ్రహ్మము అనిత్యమైన పదార్థములను కలిగియున్న నిత్య వస్తువే కాని, నిత్యానిత్యములు కాని పరిపూర్ణ బ్రహ్మము కాదు.

అన్నియూ తన కన్న వేరుగానప్పుడు; అన్నియు తానే అను నిర్ణయం తెలుసుకున్నప్పుడు; ఇంకా మానవుడు దేని కోసం శోకించవలెను. ఏది జరుగుటలేదని దుఃఖించవలెను. కనుక ఇట్టి అద్వైత సిద్ధి పొందిన తర్వాత దాని యందే సృష్టికారణం వుందని, దాని నుండి ముక్తి కోసం ప్రయత్నించిన వాడికి ముక్తి సులభము అని వేమన ప్రబోధించుచున్నాడు.

**ఆ॥ ఇట్టి కనుల బ్రహ్మమెట్టు చూడగ వచ్చు**
**జూచు కనులు వేరు చూపు వేరు**
**చూపులోన నుంచి చూడంగ వలవదా?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 77**

ఈ మాంస చక్షువులతో ఆ బ్రహ్మమును చూడవచ్చునా? చూడలేము. ఎందుకు? చూచు కనులు వేరు, చూపు వేరు. చూపులేనిచో కన్నులు వున్ననూ చూడలేము. చూపు అనేది జ్ఞానము. ఆ జ్ఞానమే కన్నుల ద్వారా చూస్తుంది. చెవుల ద్వారా వింటుంది. ముక్కు ద్వారా వాసన చూస్తుంది. చర్మం ద్వారా స్పర్శకంటుంది. నాలుక ద్వారా రుచిని ఎరుగుతుంది. కనుక జ్ఞానమే లేనిచో ఇవేవి జరుగవు. కనుక అట్టి జ్ఞానము ద్వారానే బ్రహ్మమును చూడుమని వేమన బోధించుచున్నాడు.

కనుకనే 'విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞాన చక్షుషః' అని గీతా వాక్యము. అనగా విమూఢులైన వారు బ్రహ్మమును చూడలేరు. జ్ఞాన చక్షువులు గలవారే బ్రహ్మమును చూడ గలుగుచున్నారని గీతాచార్యుడు గీతయందు దీనినే బోధించియున్నాడు.

**ఆ॥ ఒక్క తోలు దెచ్చి యొరవు బొమ్మను జేసి**
**యాడునట్లు జేసి యట్టివేసె**
**తన్ను దిప్పువాని దానేల కానడో?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 78**

మానవుడు తోలు బొమ్మలను తయారుచేసి వాటిని ఆడించుచుంటాడు. అది మానవుని వినోదం కోసమే. అటులనే ఈశ్వరుడు 'లీలా దేవతు కైవల్యం' అను రీతిగా తన లీలకోసం ఈ **84** లక్షల జీవరాసులను సృజించి, వాటిచే ఆటలాడించుచున్నాడు. కనుక తనను తిప్పుచున్న ఈశ్వరున్ని ఈ మానవుడేల తెలిసికోడు? అని వేమన ప్రశ్నించుచున్నాడు. ఆ బ్రహ్మమే (ఎరుకే) ఈశ్వర రూపమున ఈ ఆటలన్నింటికి కర్తగా యున్నాడని వేమన భావము.

**ఆ॥ తన్ను వెదకి చూడ దానె పో జీవుండు**
**తత్వమరసి చూడ దానె యాత్మ**
**మన్ను మిన్ను లేదు మాయ తా లేదయా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 79**

నేను ఎవరినని వెదకి చూస్తే నేను జీవుడనని తెలియును. ఇక తత్వవిచారణ చేసి చూస్తే నేను ఆత్మయని తెలియును. ఆత్మయే మన్ను, నీళ్ళు, అగ్ని, గాలి, మిన్ను మరియు జీవుడుగా మారి అనేక విధములుగా భిన్న భిన్నములుగా కనిపిస్తుంది. కనుక మన్ను మిన్నుగా కనిపించినప్పటికి ఇదంతా ఆత్మయేనని తెలియవలెను. బంగారంతో తయారైన గాజులు, వడ్డాణము ఉంటాయి. గాజులు, వడ్డాణము లనేవి ప్రత్యేకంగా లేవు. అవన్నియు బంగారం అనే నిర్ణయం ఉండాలి. కనుక వేమన మన్ను మిన్ను లేదని అన్నాడు. వీటికి కారణం మాయ అని కొందరు మతవాదులు వెర్రివాదనలు చేశారు. కాని వేమన మాయా వాదాన్ని అంగీకరించలేదు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ'. కనుక అంతా ఆత్మయే అని వేమన బోధించుచున్నాడు.

కనుక ఈ పద్యం ద్వారా మాయ నుండి ప్రపంచం పుట్టినదని, ఆత్మ అందుకు కారణం కాదని వాదించువారిని వేమన ఖండించాడని గుర్తించనగును.

**ఆ॥ ఆత్మబుద్ధి వలన నఖిలంబు తానయ్యె**
**జీవ బుద్ధి వలన జీవుడయ్యె**
**మోహబుద్ధి లయము ముందర గనుగొను**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 80**

ఆత్మతత్వమును తెలిసికొనినవాడు అఖండరూపమగు బ్రహ్మాండమంతయూ తానేననియూ, అఖిలంబు తానై వుండును. ఆతడే జీవ బుద్ధి వలన కించిజ్ఞత్వ స్వరూపుడై జీవుడై వుండును. సర్వ సంకటములకు మోహమే మూలము. కనుక మోహమును ఎలా లయము చేయుటో ముందర తెలుసుకొనుమని వేమన బోధించుచున్నాడు.

**కం॥ జీవుని దెలసిన దనుకను**
**దేవుని భ్రమ బొదలు నరుడు దేవుడు దలపన్**
**జీవుండని వివరించిన**
**భావింపగ ముక్తి బట్టబయలుర వేమా ॥ 81**

జీవుడు తత్వమును తెలియక దేవుడి కోసం భ్రమలలో ఉంటాడు. దేవుడెవరని ఆత్మవిచారము చేసినవాడికి ఈ జీవుడే ఆ దేవుడు అని తెలియును. అట్టి వానికి ముక్తి సులభ సాధ్యము అని వేమన ప్రవచించుచున్నాడు.

**ఆ॥ నిన్ను జూచెనేని తన్ను తా మరచును**
**తన్ను జూచెనేని నిన్ను మరచు**
**నేవిధమున జనుడు నెరుగు నిన్నును దన్ను?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 82**

అహంకార పద్ధతితో నేనుగా ఉన్నప్పుడు, ఆ బ్రహ్మతత్వమును మరచి వుందును. మరి ఆ బ్రహ్మతత్వమును తెలిసికొని దానిలో లీలమై వున్నప్పుడు, నేను నాది అనే ఎరుక(స్ఫురణ) వుండదు. కనుక జనుడు ఏవిధంగా నిన్నును, తన్నును తెలిసికొనును? అని వేమన ప్రశ్నించుచున్నాడు.

ఆ॥ మంటి కుండ వంటి మాయ శరీరంబు
చచ్చు నెన్నడైన జావదాత్మ
ఘటము లెన్నియైన గగనంబు యేకమే
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 83

ఈ స్థూల శరీరము మట్టి కుండ వంటిదని తెలుపుచున్నాడు వేమన. చావు శరీరానికే గాని ఆత్మకు లేదు. కుండలు ఎన్ని అయినప్పటికిని వాటిలో తెగకుండ నున్నది ఆకాశము ఒక్కటే. అలానే శరీరాలు ఎన్ని వున్నా వాటన్నింటియందు ఆత్మ ఏక స్వరూపంగానే వుందని వేమనార్యుడు ఆత్మ స్వరూపాన్ని తెలుపుచున్నాడు.

శరీరంను మాయ అని ఎందుకన్నాడు? శరీరం పుట్టినప్పటినుండి చచ్చేవరకు, క్షణం కూడా ఆగకుండా మారుతూ వుంటుంది. చచ్చిన తర్వాత కుళ్ళిపోయి, రూపాన్ని కోల్పోతుంది. కనుక ఎక్కడ నుండియో వచ్చి కొంతకాలం కనపడి ఆ తర్వాత కనిపించుట లేదు. అందువల్లే దీనిని మాయ అన్నాడు వేమన. కనుక దేహమే నేను అనుకొనుచు అజ్ఞానాంధకారంలో వున్న మానవులను వేమన మేలుకొల్పుచున్నాడు. ఆత్మ స్వరూపాన్ని తెలిసికొని అమృతత్వము (అచలత్వము) వైపు పయనించుమని పరోక్షంగా బోధించుచున్నాడు వేమనయోగి. దీనినే గీత యందు

'శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరివేదనా ॥'

అని శ్రీకృష్ణ పరమాత్మచే చెప్పబడినది. శరీరములు మొదట కనిపించుట లేదు. మధ్యలో కనిపించుచున్నవి, తదుపరి కనిపించుటలేదు. కనుక అట్టి శరీరాల గూర్చి దుఃఖించనవసరం లేదనియూ, కాని వాటియందున్న ఆత్మ ఎప్పుడూ వుంటుందని శ్రీకృష్ణుడు అర్జునునికి బోధించెను. ఇచట శరీరము జీవునికి వున్న అజ్ఞానావరణమని (మాయయని) వేమన యోగి ప్రవచించుచున్నాడు.

ఆ॥ మరి యుదధిని ఘృతము మానులందనలంబు
చారు సుమము లందు సౌరభంబు
తిలల తైలమట్లు దేజరిల్లు జిదాత్మ
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 84

ఆత్మ ఎలా వుందని అడుగువారికి వేమన యోగి ఇచట కొన్ని ఉపమానాలు ఇచ్చుచున్నాడు. పెరుగు యందు వెన్న, చెట్ల యందు అగ్ని, పూవులందు సుగంధము, నువ్వులలో నూనె ఎట్లు వున్నవో అలాగే సర్వ వస్తువులయందు ఆత్మ (ఎరుక) వున్నదని వేమన యోగి ప్రవచించుచున్నాడు.

ఆ॥ తనువు దా ననుకొను తను వాసన దగిలి
జనన మరణములను జిక్కి చిక్కి
పొలుపు నొందెరుగక పొర్లాడు చుండెటి
భ్రాంతి జీవి కేటి పరము? వేమ ॥ 85

ఈ దేహమే నేను అనుకొని దేహవాసనను తగిలించుకొని మనుజుడు జనన మరణములను పొందుచూ అనేక నరకయాతనలు పడుచూ చిక్కి చిక్కి శల్యమైననూ సుఖభ్రాంతులకై పరుగులిడుచున్నాడు. ఈ జీవితమే భ్రాంతి అని తెలుసుకోక దేహములో పొర్లాడుచుండేటి భ్రాంతి జీవికి ఈ ఆత్మ తత్వము ఎందులకు? అని వేమన ప్రశ్నించుచున్నాడు.

కం॥ తొమ్మిది కంతల తిత్తికి
నిమ్మగు సొమ్ములును కులము నేటికి జెపుమా?
నమ్మకు దేహము నాదని
బమ్మము నేననుచు దెలసి బలుకర వేమా ॥ 86

తొమ్మిది కంతలు (రంధ్రాలు) గల ఈ తోలు తిత్తికి వివిధ రకాలైన ఆభరణములు, కులము ఏటికి చెపుమా? అని వేమన ప్రశ్నించుచున్నాడు. అనేక క్రిములతో కూడినదై; శ్లేష్మ రక్త కఫ మాంసాదులతోను, దుర్గంధ మలమూత్రములతోను కూడినదై; పైకి అందముగా ఆకర్షణగా యున్ననూ ఈ శరీరము శాశ్వతమా? కాదు. కనుక ఈ శరీరమును నాది అనుకొను సంకుచిత బుద్ధిని వదలి, నేను ఆ బ్రహ్మమునని తెలుసుకొని బ్రతుకనేర్చుకో అని వేమన ప్రబోధించుచున్నాడు.

ఆ॥ మోదమునను గురుని ముఖ్యకరుణచేత
తొమ్మిది స్థలముల దొడ్డుబాయ
సర్వ జీవుడాయె సర్వము దానాయె
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 87

గురుని కృపలేకుండా కించజ్ఞత్వ స్వరూపుడైన జీవుడు ఈ నవద్వారములు గల తోలుతిత్తినుండి తన పరిధిని విశాలమొనర్చు కొనలేడు. కాని ఆ జీవుడే నిత్య సంతోషియగు సద్గురుని కరుణచేత తనయందు సర్వమును, సర్వమునందు తనను చూడగలిగి, దేహమే తానను భావనను వదలియుండునని వేమనయోగి ప్రబోధించుచున్నాడు.

కం॥ నీవాడిన నేనాడుదు
నీవుండిన నేను నుందు నిర్విణ్ణడనై
నీవు దలంచిన దలపుదు
నీవు నగిన నేను నగుదు నిజముగ వేమా ॥ 88

మూర్ఖుడు అంతా తానే స్వశక్తితో చేస్తున్నానని అంటుంటాడు. విమర్శన చేసి చూస్తే, వెలుగు లేకుండా మన కళ్ళతో దేనినీ చూడలేము. భూమికి గురుత్వాకర్షణ శక్తి లేకుండా మనం దానిపై నడువలేము, వాయువు లేకుండా శ్వాసించలేము, నీరు లేకుండా బ్రతుకలేము, ఆకాశం లేకుండా అవకాశం లేదు, పరమాత్మ లేకుండా మనకు చైతన్యమే లేదు. కనుక సర్వమూ, ఆ పరమాత్మ మన శరీరాలయందు వుండి చేయిస్తూ వున్నాడు. కనుక ఆ పరమాత్మ సత్తా చేతనే మన శరీరం యందు వున్న ప్రత్యగాత్మను పలికిస్తే పలుకుతున్నాము, నవ్విస్తే నవ్వుతున్నాము, తలంచితే తలచుచున్నాము. అది నిశ్చలంగా వుంటే మనమూ నిశ్చలంగా వుంటున్నామని వేమన ఆత్మ తత్వమును చక్కగా వివరించుచున్నాడు.

శవం మాట్లాడలేదు. నవ్వలేదు. తలంచలేదు. ఎందుకు? దానిలో ఉన్న ఆత్మ ప్రాణ సత్తా కోల్పోయింది. ఆత్మ లేక ప్రాణానికి ఉనికి లేదు, శరీరం లేదు. కనుక అంతర్గతంగా ఆత్మ (చైతన్యం) వుంటేనే, దాని వల్లే ఈ శరీరం ద్వార సర్వక్రియలను చేస్తున్నాము. కనుక ఆత్మ అద్భుతమైనది. అదే సర్వమునకు ఆధారము. దీనినే గీతాచార్యుడు

'శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥'

అని వర్ణించెను. అనగా ఒకానొకడు ఈ ఆత్మను అద్భుతమైన దానిగా చూచుచున్నాడు. మరొకడు అద్భుతమైన దానిగా చెప్పుచున్నాడు. ఇంకొకడు అద్భుతమైన దానిగా వినుచున్నాడు. అయినా కూడా ఈ ఆత్మ తత్వమును సరిగ్గా తెలుసుకోలేక పోవుచున్నారు.

ఆ॥ మురియు వాడెవండు? మురియని దెవ్వండు
పాటు జేసి చూడ బట్టబయలు
సొరది జలఘటమున సూర్యుని చందంబు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 89

నీటికుండలో సూర్యుని ప్రతిబింబము కనిపించును. బింబరూపముగా వున్న సూర్యుడు ప్రకాశించుచున్నాడు. అందువల్ల కుండలోని నీటిలో నున్న ప్రతిబింబము కూడా ప్రకాశించుచున్నది. నిజానికి ప్రతిబింబము స్వయంగా ప్రకాశించునా? అని విచారించినచో, ప్రకాశించదు అని తెలియబడును. అలాగే ఈ మురికి దేహము మురుస్తూ వున్నట్టు అనిపించును. కాని విమర్శించి చూడగా, దీనిలో నున్న చైతన్యమే మురుస్తుంది అని తెలియబడును. ఈ దేహము తోలు బొమ్మలాంటిదే. దీనిని ఆడించువాడు ఈశ్వర స్వరూపముగా నున్న బ్రహ్మముగా తెలుసుకొమ్మని వేమన బోధించుచున్నాడు.

ఆ॥ అల్లుడయిన నేమి యన్యుడయిన నేమి
చెప్ప వలయు రీతి జెప్పినాము
హరుని యెరుక లేక యాకు నల్లాడునా?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 90

అద్వైత మతవాదులు సర్వక్రియలకు కారణం మాయ అని వెర్రివాదనలు చేశారు. ఇచట వేమన స్పష్టముగా హరుని యెరుక గూర్చి చెప్పుచున్నాడు. హరుడనగా శివుడు. శివుడనగా ఆత్మ. ఆత్మ యొక్క ఎరుక (సత్తా) లేక ఆకు కూడా కదలలేదు. కనుక సర్వక్రియలకు ఆత్మయే కారణమని వేమన చెప్పుచున్నాడు. ఈ రహస్యంను దాచకుండా; అల్లుడూ, అన్యుడు అని చూడకుండా చెప్పవలసిన రీతిన చెప్పినాము. ఇక మీ ఇష్టమైన మార్గమున నడుచుకోగలరని వేమన ప్రవచించుచున్నాడు.

కం॥ బయలున సర్వము పుట్టును
బయలందే లీనమగును బ్రహ్మంబనగా
బయలని మదిలో దెలసిన
బయలందే ముక్తి బట్టబయలగు వేమా ॥ 91

ఇచట బయలు అనగా బ్రహ్మము లేక ఆత్మ. బయలు యందే సర్వము పుట్టును. మళ్లీ దానియందే సర్వము లీన(లయ) మగుచున్నది. కనుక గురువును చేరి బ్రహ్మమనగా బయలేనని, దాని యొక్క స్థాన, స్వరూప, స్వభావములను పూర్తిగా తెలుసుకొన్నచో ఆ బ్రహ్మమునందే ముక్తి కలుగునని వేమన బోధించుచున్నాడు.

**ఆ॥ పండుచేత బుట్టె పరగ ప్రపంచంబు**
**పండు చేత బుట్టె పరగనిహము**
**పండుకాస పడిరి బ్రహ్మాది సురలెల్ల**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 92**

బ్రహ్మమే పండు. ఆ పండు వలననే ప్రపంచము పుట్టినది. ప్రపంచమునందు వున్న మనుజులే దాని యందు ఇహపరములను ఏర్పరచుకున్నారు. ఆ పండు కోసమే బ్రహ్మాది సురలు ఆశపడిరి అని వేమన ప్రవచించుచున్నాడు.

బ్రహ్మమును పండు అని ఏల చెప్పిరి? జీవుడు ఫలస్వరూపుడుగా చెప్పబడుచున్నాడు. విమర్శించినచో, ఆ జీవుడు బ్రహ్మమున కన్నా వేరు కాడు. కనుక ఆ బ్రహ్మముకూడా ఫల స్వరూపమని తెలియబడుచున్నది. ఆ ఫలమునందున్న బీజములే అనంతమైన వృక్షములకు కారణముగా వున్నవి. కనుక అనంతమైన వృక్షములు బీజములందు గర్భీకృతముగా వున్నాయని చెప్పవచ్చును. కనుకనే ఈ బ్రహ్మమనే పండు యందు సర్వలోకాలు నిక్షిప్తమై వున్నాయని వేమన ప్రవచించుచున్నాడు.

**ఆ॥ మేడి పండు జూడ మేలిమై యుండును**
**పొట్ట విచ్చి చూడ పురుగులుండు**
**బెరుకు వాని మదిని బింకెమీలాగురా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 93**

వేమన ఆ పండునే మేడిపండుతో పోల్చుచున్నాడు. బ్రహ్మతత్వమును తెలుసుకున్నవాడికి సర్వజీవులు అదృశ్యమై ఒకే రూపమగు బ్రహ్మమే కానవచ్చును. కాని దానిని విచ్చి చూడగా అనగా ఆ బ్రహ్మమే స్థూలమైనపుడు సర్వజీవులు కనిపించుచున్నవి. బెరుకు వాని మది కూడా ఇలానే వుండునని వేమన ప్రవచించుచున్నాడు.

**ఆ॥ తల్లి గర్భమందు దా బుట్టినప్పుడు**
**మొదల బట్టలేదు తుదను లేదు**
**నడుమ బట్ట గట్ట నగుబాటు గాదటో?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **94**

ఈ పద్యాన్ని ఆధారంగా తీసుకొని పరిశోధకులు, వేమన నగ్నంగా సంచరించాడని ఊహించారు. అలానే చిత్రకారులు వేమన ఉహా చిత్రాన్ని నగ్నంగా చిత్రీకరించారు. ఈ పద్యంలోని రెండవ పాదాన్ని తీసుకుంటే తల్లి గర్భం నుండి మొదట పుట్టినప్పుడు బట్ట లేదు. అంటే సరిపోతుంది. కాని తుదను లేదు. అంటే ఎలా లేదు? మనిషి చనిపోయినపుడు కొత్త బట్టలతో శవానికి దహన సంస్కారాలు చేస్తున్నారు. కాదా? లేక ఖననం చేస్తున్నారు కదా? కనుక ఈ పద్యానికి సూక్ష్మమైన అర్థం వుండి వున్నది. భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునికి శరీరమును గూర్చి

**'శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి।**
**తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥'**

అని బోధించెను. ఈ స్థూల శరీరమే బట్ట. తల్లి గర్భమందు తాను చేరక ముందు మరియు మరణించిన తర్వాత దేహికి బట్ట( ఈ స్థూల శరీరం) ఉండుట లేదు. మధ్యలో దేహి వివిధ రకాలైన బట్టలను(శరీరాలను) ధరిస్తుంది. దేహి తన కర్మ ఫలితాలను అనుభవించుటకై మానవ, పశు, పక్షి, క్రిమి, కీటక, వృక్షాది శరీరాలను ధరిస్తుంది. అనగా అనేక జన్మలు ఎత్తుతుంది. ఈ జనన మరణ ప్రవాహంలో వుండుటయే నరకం. ఇదే ఘోర సంసార సాగరము. కనుక ఈ వెర్రి వేషాలు వేయకుండ చేసుకోండని వేమన హితవు చెప్పుచున్నాడు.

వేమన సహజంగా వస్త్రధారియై వున్నాడు. వేమన మొదట్లో అన్ని రకాల యోగాలు చేశాడు. ఏదో ఒక సందర్భంలో యోగ నిద్రలో వున్నప్పుడు వస్త్రాలు వూడి పోయి వుండవచ్చును. అంతమాత్రాన వేమన నగ్నంగా జీవించాడనుకోవడం పొరపాటు. ఈ పద్యం పూర్తిగా తాత్విక సంబంధమైనది మాత్రమే.

కం॥ అమ్మ సుమీ యాలనగా
నమ్మనగా నాలు సుమ్మి యా యిద్దరినిన్
ఇమ్మహిలో పరమాత్ముని
నెమ్మదిలో తెలియ దానె నేర్పరి వేమా ॥ 95

'ప్రకృతి తల్లి, పరమాత్మ తండ్రి' - అని గీతావాక్యము. దీని స్థాన, స్వరూప, స్వభావములను తెలుసుకొనని వారికి ఈ పద్యము అత్యంత ప్రమాదకరమైనది. ఆలు(భార్య) అనగా అమ్మ సుమీ; అమ్మ అనగా భార్య సుమీ; ఆ ఇద్దరిని పరమాత్మ స్వరూపమునందు లెస్సగా తెలుసుకొన్నవాడే నేర్పరి సుమీ అని వేమన చెప్పుచున్నాడు.

ఈ పద్యము పూర్తిగా పారమార్థికమునకు మాత్రమే సంబంధించినది. శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతయందు

'శో॥ సర్వయోనిషు కౌంతేయ మూర్తయస్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజ ప్రదః పితా ॥ '

అని బోధించియున్నాడు. కనుక సకల యోనులయందు పుట్టు పలు విధములైన శరీరములకు ప్రకృతి తల్లి అనియూ, పరమేశ్వరుడనగు నేను గర్భాదాన కర్తయగు తండ్రిననియూ శ్రీకృష్ణుడు చెప్పియున్నాడు. కనుక సర్వజీవులకు ప్రకృతి తల్లి; పరమాత్మ తండ్రి.

కనుక పై పద్యంలో ఆలు అనగా ప్రకృతిగా అర్థము గ్రహించవలసివున్నది. జీవత్వమున వున్నవాడికి ప్రకృతి తల్లి అగును. పరమాత్మ తత్వమున వున్నవాడికి ఆ ప్రకృతియే భార్య అగునని వేమన ప్రకృతి తత్వమును ప్రబోధించుచున్నాడు. కనుక ఈ పద్యమును లోక వ్యవహారమునకు ఆపాదించుకున్న వాడు వెర్రి వాడే కాగలడు. లోక వ్యవహారమున అమ్మ ఆలు కాదు. ఆలు అమ్మ కాదు.

ఆ॥ తల్లి గర్భమందు తా జనియించియు
తనదు భోగ సతికి తానె పుట్ట
తల్లు లిర్వురయ్యె తను వొక్కటయ్యెరా
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 96

'తాను తల్లి గర్భము నుండి జనించును. తానే భార్య గర్భము నుండి బిడ్డగా ఉదయించును. కనుక మనుజునికి ఇరువురు తల్లులుంటారు. శరీరము ఒక్కటియే అయినను తల్లులు ఇరువురు అని వేమన తెలియజేయుచున్నాడు. బిడ్డగా తానే పుట్టినాడు గనుక భార్య ఆ తరువాత తల్లితో సమానము. ఆమెపై కామదృష్టి ప్రసరించకూడదు. బిడ్డ కలిగిన తరువాత భర్త భార్యను తల్లి వలె భావించాలి. మాతృదేవిగా మనస్సులో మననము చేసుకోవాలి' అని శ్రీ స్వామి సుందర చైతన్యానంద పై పద్యానికి తమ వేమన యోగి గ్రంథంలో వ్యాఖ్యానించుకున్నారు. పాఠకులే ఇది సమంజసమో ఆలోచించగలరు.

తల్లి( ప్రకృతి) నుండి సర్వజీవులు జనించినాయి. మళ్ళీ ఈ సర్వజీవులలో నున్న ఆడమగలు కలసి ప్రత్యుత్పత్తిని చేస్తున్నాయి. ఆ ఆడమగలకు పుట్టే జీవులు కూడా తానె( ఆత్మ). ఏలనన 'ఆత్మావై పుత్రనామాసి'. కనుక ఈ లోకంలో జనించిన ప్రతి జీవికి తల్లి వుంటుంది. కాని విచారించి చూడగా సర్వజీవులకు తల్లి ప్రకృతి. కనుక తల్లులు ఇరువురు. కాని తనువు ఒక్కటే అనగా అన్నింటి యందున్నది తన్మయ శరీరము ఒక్కటే అని వేమన ఆత్మతత్వమునూ, ప్రకృతి తత్వమునూ ప్రబోధించుచున్నాడు. కనుక లోకవ్యవహారములో తల్లి ఎల్లప్పుడూ తల్లియే, భార్య ఎల్లప్పుడూ భార్యయే. భార్య తల్లి కాదు. తల్లి భార్యకాదు.

**కం॥ సర్వము దానని తెలిసిన**
**నిర్వాణికి గాక ముక్తి నిలుపగ వశమా**
**యుర్వెల్ల దాను తిరిగిన**
**పర్వత బిల జలధులందు బడినను వేమా ॥ 97**

సర్వము బ్రహ్మమయమనియూ, ఆ బ్రహ్మమే తాననియూ తెలుసుకున్న నిర్వాణికి ముక్తి సులభ సాధ్యమని వేమన చెప్పుచున్నాడు. ఇలా తెలుసుకోక పర్వతముల వెంబడి, తీర్థ క్షేత్రముల వెంబడి తిరుగువానికి ముక్తి సాధ్యమా? అని వేమన ప్రశ్నించుచున్నాడు.

**సీ॥ తమ తలంపులలోన తత్వ శిఖామణి**
**దలచినవారెల్ల తత్వవిదులు**
**ఘనమైన నిబిడాంధకారంబులో జ్యోతి**
**ననువుతో జూచిన యతడె యోగి**
**శివునిలో జీవుని జీవునిలో శివు**

**నొనరదెల్సినవాడు యోగ దృక్కు**
**సాంఖ్య యోగంబున సర్వంబు శివుడని**
**నిశ్చయించిన వాడు నిర్మలుండు**

**ఆ॥ యిట్టి జాడగాక యందరైనను నేమి**
**గుట్టుగాను శివుని బట్టగలరె?**
**పొట్ట జీవు బాసి పోయి తా నుబ్బునా?**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 98**

'ప్రాగర్థంతు ప్రకృతీ దేహం, చరమార్థంతు ఆత్మయో'. కనుక తత్వమునకు చివరిదై, అన్నింటికి ప్రకాశము నిచ్చు మణిగా యున్నది ఆ ఆత్మయే. ఆ ఆత్మ తత్వమును తమ తలంపులలో తలచిన వారెల్లరూ తత్వవిదులే. ఆకాశమే ఘనమైన నిబిడాంధకారము. ఆ ఆకాశానికన్న సూక్ష్మంగా యున్నదే ఆత్మజ్యోతి. దానిని చూచినవాడే యోగి. ఆత్మయందు జీవుడిని, జీవుడియందు ఆత్మను గాంచినవాడే యోగ దృక్కు కలవాడు. ఇలా సర్వము ఆత్మమయమని సాంఖ్యయోగము ద్వారా నిర్ణయించినవాడే నిర్మలుడు. ఇట్టి రహస్యమును తెలిసికోక ఎవ్వరైననూ ఆ శివుని ( ఆత్మని) పట్టుకో గలరా? లేదు. (తెలిసికోలేరని భావము).

మరణించిన వాడి శరీరంనుండి ఆత్మ వెళ్ళిపోతుందని అందరూ అంటుంటారు. అది నిజంకాదని వేమన తెలియజేయుచున్నాడిక్కడ. ఒక వేళ ఆత్మ చైతన్యం శరీరం నుండి వెళ్ళి పోయినచో, శవం ఎలా ఉబ్బుతుంది? చైతన్యము లేక కదలికే లేదు. కనుక ఆత్మ ఎచ్చటికి వెళ్ళిపోదని వేమన భావము. కనుక శరీరమునందు ఆత్మ, ఆత్మయందు శరీరము విడిపోకనే యున్నవని వేమన బోధించుచున్నాడు.

**కం॥ నేనెవ్వడనని తలచడు**
**మానసమున పుడమిలోని మనుజుండకటా!**
**కానడు తన సకలంబును**
**మానుగ గనుగొనుట యెట్లు మహిలో వేమా॥ 99**

అయ్యో! మనుజుడు ఒక నిమిషమైననూ నేనెవరు? అని తన మనస్సులో ప్రశ్నించుకొని, ఆలోచించడు. మానవుడే ఎందుకు ఆలోచించవలెను? పశువులకు ఆ జ్ఞానం లేదు గనుక.

కనుక 'మానుషం దేహం దుర్లభం' అని అన్నారు. అనగా మానవుడుగా పుట్టుట సులభం కాదు. మానవుడై పుట్టిననూ వివేకం కలగటం చాలా కష్టము. అందుకే 'వివేకం అతి దుర్లభం' అని అన్నారు. కనుక మానవుడుగా పుట్టినందుకు సంతోషించి, వివేకాన్ని సంపాదించుటకు విమర్శనా జ్ఞానాన్ని పెంపొందించుకోమని వేమన మేలుకొలుపుచున్నాడు. అయితే నేనెవరు? నేనూ మరియు నా చుట్టూ వున్న సకలం ఏమిటి? అదే వృక్షము. అశ్వత్థ వృక్షమని, దానిని కనుగొనుమని వేమన ప్రవచించుచున్నాడు. ఈ అశ్వత్థ వృక్షము గూర్చి శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత యందు

**'శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం।**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ '**

అని ప్రబోధించినాడు. దేనికి వేదములు ఆకులుగా గలవో అట్టి అశ్వత్థ వృక్షమునకు వేర్లు పై భాగమున (సూక్ష్మముగ) ఉన్నవి. కొమ్మలు క్రింది భాగమున (స్థూలముగ) ఉన్నవి. అది అవ్యయమై ఉన్నది. అట్టి వృక్షమును ఎవడు కనుగొనునో వాడే వేదవిదుడు అని భగవానుడు బోధించి వున్నాడు. అయితే నేను ఈ చెట్టుకు ఎక్కడ ఉన్నాను? జీవుడు ఫలస్వరూపుడు. కనుక నేను ఆ చెట్టుకు కాచిన ఫలమే. ఈ విధంగా తనూ, తనతో నున్న సకలంను వృక్షముగా తెలుసుకోమని వేమన బోధించుచున్నాడు.

ఋగ్వేదము నందు కూడా విశ్వమే ఒక వృక్షముగా వర్ణించబడినది. 'బ్రహ్మ సవనం బ్రహ్మ సవృక్షమాసీత్ యతోద్యావా పృథ్వీ నిష్ట తక్షుః మనీషిణో మనసా విబ్రవీమివో, బ్రహ్మాధ్యతిష్ఠన్ భువనాని ధారయన్'- ఋగ్వేదము - వాజసనేయ సంహిత. అనగా బ్రహ్మయే ఆ వనము, ఆ వనమందలి వృక్షము కూడా బ్రహ్మమే. ఆ వృక్షము యొక్క కర్ర చేతనే ఈ దివీ భువీ చెక్కబడినవి. ఆ బ్రహ్మమే సమస్త భువనములను ధరించి భరించుచూ వున్నదని పండితులైన వారు తమ అతీంద్రియ శక్తులచే గుర్తించిరి. కనుక వేదములు కూడ తను, తన చుట్టూ వున్న సకలంను వృక్షముగా తెలుసుకొమ్మని చెప్పుచున్నాయి.

**కం॥ చెట్టందు విత్తు పుట్టెను**
**చెట్టును విత్తందె బుట్టె చెలిమి తలిర్పన్**
**చెట్టును విత్తును రెండును**
**బుట్టిన విధి దెలియవలయు భువిలో వేమా ॥ 100**

చెట్టుయందు విత్తు పుట్టు చున్నది. ఆ విత్తు నుండియే మళ్ళీ చెట్టు పుట్టు చున్నది. అయితే విత్తు, చెట్టులలో ఏది ముందు పుట్టినది? లేక విత్తు, చెట్టు రెండు వేర్వేరుగా భూమియందు పుట్టినవా? వీటి వివరము తెలుసుకోవలెనని శ్రీ వేమనయోగి చెప్పుచున్నాడు. ఇచట వేమనయోగి విత్తును ఆత్మతోను, చెట్టును దేహముతోను పోల్చుచున్నాడు. బ్రహ్మతత్వమును నెరిగినవానికి విత్తుయందు చెట్టు, చెట్టుయందు విత్తు విడదీయరాకుండా యున్నవని తెలిసియుండును. అంతియేగాక విత్తే చెట్టు, చెట్టే విత్తుగాయుండి ఒకదానినొకటి పరస్పరము సృజించుకుంటాయని బ్రహ్మజ్ఞాని మాత్రమే గుర్తించగలడు. కనుక చెట్టు, విత్తు ద్వంద్వైక ఏకరూపమని వేమన నిర్ణయం. అటులనే దేహాత్మలు రెండు ఒకే వస్తువు. అదే స్వయంభుః. అదే ఎరుకయని వేమనయోగి వేదాంతము. ఇచట విత్తు యొక్క స్థూలరూపమే చెట్టు, చెట్టు యొక్క సూక్ష్మరూపమే విత్తు అని గ్రహించవలెను.

**ఆ॥ ఆత్మ దేహమందు నతి సూక్ష్మముగ జూచి**
**దేహమాత్మ యందు దేట పరచి**
**యాత్మ నెందు జూచు నతడె పో బ్రహ్మంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** ।౧౦।

దేహమునందు ఆత్మ ఎచ్చట గలదని ఆత్మను తెలుసుకోగోరువారు అడుగుచూ వుంటారు. ఈ ఆత్మ దేహమునందు అతి సూక్ష్మరూపముగా వున్నదని వేమన వక్కాణిస్తున్నాడు. దేహము ఎంతవరకున్నదో అంతవరకు ఆత్మ ఉండియే వున్నది. ఈ ఆత్మ ఆపాదమస్తక పర్యంతము వుండి వున్నది. మరియు ఆ ఆత్మ లేకుండా ఈ దేహమునకు ఉనికి లేదు. కనుక ఆ ఆత్మయొక్క స్థూలరూపమే దేహము అని తేట తెల్లము కావించుకొని, ఇట్టి ఆత్మ ఎచ్చటెచ్చట గలదని ఆత్మ పరిశోధన కావించవలెను. ఇట్టి ఆత్మ పరిశోధకుడు ప్రతి వస్తువు ఆత్మ వస్తువే అని తెలుసుకొనును. ఇట్టి వాడే బ్రహ్మస్వరూపమును పొందునని వేమన బోధించుచున్నాడు.

అందుకే 'శ్లో॥ **మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః।**
**మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥** ' అని శ్రీకృష్ణ పరమాత్మ యొక్క గీతా వాక్యము.

మరి ఆ బ్రహ్మమునకు కారణమేమై యుండును? అని ప్రశ్నించుకొన్నచో, ఆ బ్రహ్మము 'స్వయంభుః' అని తెలియబడును. అది దానంతట అదే వచ్చియున్నది. దానికి వేరే మూలం

లేదు. కనుక ఆత్మ యొక్క స్థాన, స్వరూప, స్వభావములను విమర్శించి చూడగా ఆత్మయే లేకుండా అయి, ఎచ్చట చూచిననూ ఆత్మ కనిపించదు. ఇలా విమర్శించిన వాడికే బ్రహ్మతత్వము పూర్తిగా తెలియును. దీనినే 'అశూన్యం శూన్యభావం తు శూన్యాతీతం హృదిస్థితమ్' అని తేజోబిందు ఉపనిషత్తు తెలుపుతుంది. అనగా బ్రహ్మము శూన్యము కానిది. శూన్యమైనది. మరియు శూన్యాతీతమైనది. అదియే సమస్త ప్రాణుల హృదయము నందు అయివున్నది. దీనిని వివరిస్తూనే వేమన ఈ క్రింది పద్యాన్ని బోధించాడు.

**కం॥ తలచినను శూన్యతత్వము**
**తలచక నుండినను శూన్యతత్వం బదియౌ**
**తలచిన తలపీడేరును**
**తలచక నుండినను తానె తత్వము వేమా ॥ 102**

తలచి చూచిన వాడికి ఆత్మ తత్వము శూన్యమయినది. ఈ తత్వమును తలచక యున్ననూ శూన్యమే. తలచిన వాడి తలపులు బోడులైపోవును. తలచిన తదుపరి తలచక యుండుటే తత్వమని వేమన తెలియజేయుచున్నాడు.

**ఆ॥ ఎరుక యుండు వాని కెరుకయే యుండును**
**ఎరుక లేనివాని కెరుక లేదు**
**ఎరుక లేని ఎరుక నెరుగుట తత్వంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 103**

ఎరుక అనగా నేమి? సృష్టి, స్థితి, లయాలు చెందుచున్న ఈ చరాచర జగత్తుకు ఆధారభూతమైన బ్రహ్మమే ఎరుక. ఈ భూమికి అధోముఖంగా అజ్ఞానాంధకారంలో వున్న మానవునికి ఎరుక శాశ్వతమని నిర్ణయం. కనుక ఎరుకలో యుండు వానికి ఎరుక ఉన్నదనియే నిర్ణయం. కాని తత్వవిచారణ చేసి ఎరుక యొక్క స్థాన , స్వరూప, స్వభావములను నిశితముగా పరిశీలించిన వానికి, ఎరుక అశాశ్వతమైనదని, మాయా స్వరూపమైనదని తెలియబడి ఎరుకే లేదు అను నిర్ణయం చేసి ఉండును. కనుక ఎరుక(నేను అనే తెలివి)తో లేని ఎరుక(బ్రహ్మము)ను లెస్సగా విచారము చేయుటే తత్వము. అలా విచారము చేయని వాడు జ్ఞానము (ఎరుక) లేని వాడు. ఆతడు మరుపు(అజ్ఞాన) పద్ధతిలోనే వుంటాడని వేమన బోధించుచున్నాడు.

ఆ॥ ఎరుకమాలు జీవి యెంత గాలంబుండి
చచ్చి పుట్టు చుండు సహజముగను
యెరుక మరచు చోటు నెరుగుట బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 104

ఈ చరాచర జగత్తుకు మూలకారణమైన ఎరుకను తెలుసుకొనని జీవి ఎంతకాలం వుండినను చచ్చి , మళ్లీ పుట్టుచుండును. ఇది సహజము. ఎరుక మరుపులు ఏ వస్తువునకు ఉన్నవో అదే బ్రహ్మమని; దానిని వస్తు నిర్ణయ పద్ధతిన తెలుసుకొన్నచో చావుపుట్టుకలు ఉండవని వేమన బోధించుచున్నాడు.

ఆ॥ తిరిగి తిరిగి నరుడు మరలు కొనుటె గాక
నందు వలన నేమి యాస లేదు
అంతరాత్మ నిల్పు నతడె పో బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 105

కాశీ, రామేశ్వరం మొదలగు ఏ పుణ్యక్షేత్రములకు పోయిననూ, దైవదర్శనము తర్వాత ఇంటికి మరలి రావల్సిందే. ఇహలోకమందు పుణ్యకర్మలు ఆచరించి సాలోక్య, సామీప్య, సాయుజ్య, సారూప్య, సాష్టిత్వములను సాధించి ఏ పరలోకాలలో ఉన్ననూ, గీతలో శ్రీకృష్ణ పరమాత్మ చెప్పినటుల 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ' అను న్యాయమున పుణ్యము క్షీణించగానే తిరిగి మర్త్యలోకమునకు మరలు కొనక తప్పదు. కనుక ఎక్కడికో పోయి, ఏమో సాధిస్తాననుకోవడం వెర్రిపని. కనుక జిజ్ఞాసి తాను ఉన్నచోటనే ఉండి, గురువు ద్వారా ఆత్మవిచారము చేసి సర్వము ఆత్మమయమని తెలుసుకొన్నచో బ్రహ్మమునే పొందుచున్నాడని వేమన నుడువుచున్నాడు.

ఆ॥ ఇహము విడిచి ఫలము లింపుగ గలవని
మహిని బల్కు వారి మతము కల్ల
ఇహములోన బరము నెసగుట గానరో?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 106

ఈ లోకమును విడిచిన వారికి ఇంపైన ఫలములు కలుగుతాయని బోధిస్తుంటారు మతవాదులు. వారి మాటలు కల్లబొల్లి మాటలేనని వేమన వచించుచున్నాడు. ఎందుకు?

' ఆ బ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోర్జున' అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పియున్నాడు. కనుక బ్రహ్మలోకము పర్యంతముగల లోకములకు వెళ్ళిననూ వారందరూ తిరిగి పుట్టుచూనే వుందురు. కనుక ఏ లోకమునకు పోయిననూ శాశ్వత దుఃఖ నివారణ కలుగదు. అయిననూ ఆ లోకములన్నియూ పరము ( బ్రహ్మము)నకు అతీతంగా వున్నాయా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు. లేవు. ఇహము ( ఈ లోకము) లోనే పరము నెసగి వున్నది. కనుక జగత్తు మాయ అనెడి మతవాదులు వారిని వారే ప్రశ్నించుకోవలసి యున్నది. కనుక ఈ లోకమే బ్రహ్మమయమని తెలుసుకోక, వేరే లోకాలలోని ఫలాల గూర్చి ప్రయత్నించువాడు వెర్రి వాడని వేమన పరోక్షంగా ప్రబోధిస్తున్నాడు.

**ఆ॥ మాయ జగమటనుచు మరి పల్కుచుందురు**
**మాయ గాదు బ్రహ్మమయము గాని**
**మాయయైన పరము మరియెందు నున్నదో?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 107**

కనుక జగత్తు మాయ కాదు. జగత్తు బ్రహ్మమయమే. ఒకవేళ అద్వైతులు చెప్పినట్లు జగత్తే మాయ అయినచో, వారి పరము ఎచ్చటనున్నదో వారినే చూపించుమని అడుగుచున్నాడు వేమన. బ్రహ్మము, జగత్తు అనునవి రెండు ఓతప్రోతములై వున్నవి. కనుక ఇహపరములు రెండు ఎరుకయే అని వేమన నిర్ణయం. ఇచట వేమన శంకరాచార్యుల వారి మాయా వాదమును పూర్తిగా ఖండించాడని గ్రహించవలసి వున్నది. వేమన వేరే పద్యాలలో చెప్పిన మాయ అను పదము పరమాత్మ యొక్క ప్రకృత్యావరణమునో, ఈశ్వరుని యొక్క మాయావరణమునో, జీవుని యొక్క అజ్ఞానావరణమునో సూచించును గాని అది శంకరాచార్యులు చెప్పిన మాయ కాదని గుర్తించవలసివున్నది.

**ఆ॥ చెప్పులోని రాయి చెవిలోని జోరీగ**
**కంటిలోని నలుసు కాలి ముల్లు**
**ఇంటిలోని పోరు ఇంతింత గాదయా!**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 108**

చెప్పులో రాయి పడినప్పుడు నడక సులభంగా సాగదు. ఒకవేళ నడచినను ఆ బాధ వర్ణనాతీతం. రాయిని తీసివేసినచో నడక సులభమగును. కాని చెప్పువున్నంత వరకు మరొకసారి రాయి దానిలో పడి బాధించే అవకాశం వున్నది. అలాగే సుశబ్దములను వినే చెవిలో జోరీగ ప్రవేశించినచో, అది కలుగజేయు చెడు ధ్వని వల్ల మనిషికి బాధ కలుగును. కనుక చెవివున్నంతసేపు దానిలో దుశ్శబ్దములు ప్రవేశించి బాధ కలుగజేయు అవకాశం వున్నది. సుందర దృశ్యములనుగాంచు కన్నులలో నలుసు పడినచో, అందువల్ల కలిగే బాధచే కన్నులు లేకున్నను బాగుండుననుకొనును మానవుడు. కాని కన్నులున్నంత వరకు దానిలో నలుసు పడే అవకాశం వున్నది. అట్లాగే గమనముచేయు కాలుయందు ముల్లు గుచ్చుకొన్నచో, అందుచే కలిగే బాధ అధికం. ఒక్కొక్కసారి కాలే నరికి వేయబడవచ్చును. కనుక కాలు వున్నంత వరకు దానిలో ముల్లు దిగే సంభావ్యత వున్నది.

కనుక విచారించి చూడగా పాదము (చెప్పు), చెవి, కన్ను, కాలు లకు వివిధ రకాలైన బాధలు కలుగుచున్నవి. అయితే ఇవి అన్నియు శరీరమను ఇంటిలోనే వున్నవి. కనుక ఈ ఇంటిలోని పోరు ఇంత, అంత యని చెప్పుటకు వలను పడదు. ఇంకా విచారించి చూడగా శరీరము దానిలోని ఆత్మ చైతన్యము వేరుగా లేవనియు, కనుక ఆ బాధలన్నియు శరీరాత్మలు ఏకస్వరూపముగానున్న ఎరుకవే ననియు వేమనయోగి బోధించుచున్నాడు. ఎరుకయందు వున్న శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల వల్ల సుఖ దుఃఖములు ఆ ఎరుకకే కలుగుచున్నవని గుర్తించి గురువును చేరి, సేవించి ఎరుక యొక్క సంపూర్ణ స్వరూపమును గాంచవలయునని వేమన యొక్క అభిప్రాయము.

**తే॥ స్వస్వరూపమున నెరుక హ్రస్వమగును**
**బిందు నాద కళాతీత భిన్న పరమ**
**తన్మయ శరీర మందుటే తత్త్వమగును**
**విశ్వదాభిరామ యిదియు వినుర వేమ ॥ ౧౦౨**

స్వస్వరూపమున ఎరుక (బ్రహ్మము) హ్రస్వమగును అనగా బ్రహ్మము పరిణామము చెందక పూర్వము సూక్ష్మంగా వుండును. దానినే 'అణోరణీయాన్' అని చెప్పబడినది. ఆ ఎరుకయే దీర్ఘమైనపుడు బిందువు, నాదము, కళ అనునవి కనిపించుచున్నవి. బిందువు అనగా సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాణువు. ఆ పరమాణు యందే అఖిల జగములు వుండును. నాదము అనగా ఓంకారము లేక ధ్వని. కళ అనగా ప్రకాశము. ఇవి మూడూ ఎరుక నుండే వస్తూవున్నవి. కాని

ఇవి మూడు బ్రహ్మము ( ఎరుక) యొక్క స్వస్వరూపమునందు ప్రాస్వమై కనిపించవు. కనుక బ్రహ్మము వీటికి అతీతమై వున్నది. ఆ బ్రహ్మమే నేను అను నిర్ణయమును 'అయమాత్మా బ్రహ్మ' ద్వారా తెలుసుకొని ఆ తన్మయ శరీరాన్ని పొందుటే తత్వమని వేమన ప్రవచించుచున్నాడు. తత్వం=తత్+త్వం. తత్, త్వం లు కలిసిన చోటే తత్వము. అదియే తన్మయ శరీరం.

**కం॥ అనిలంబున జనియించిన**
**యనలంబున సలిలమగును, యాకాశమునన్**
**గనిపించి పుట్టు దానే**
**జనకుడు లేనట్టి మాయ చరితము వేమా ॥ 110**

అనిలము అనగా వాయువు. అనలము అనగా అగ్ని. సలిలము అనగా జలము. అనిలమున అనలము జనియించినది. అనలమున సలిలము జనియించినది. ఇవి మూడు ఆకాశమున పుట్టి కనిపిస్తూవున్నవి. 'ఖం బ్రహ్మ'. కనుక విచారించి చూడగా ఇవన్నియు బ్రహ్మ (ఎరుక) స్వరూపమే. మరియు ఆ బ్రహ్మమునకు వేరే జనకుడు లేడనియూ, బ్రహ్మమే మాయ అనియూ వేమన బోధించుచున్నాడు.

**ఆ॥ సిగ్గు యేడ దాగు జీక టేడను దాగు**
**నాక లేడ దాగు నాత్మ లోన**
**దాగి యున్న నిద్ర దాగుట దెలియుడి**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 111**

సిగ్గు ఎచ్చటి దాగివుంది? సాధారణంగా మానవులకు సిగ్గు ఎప్పుడు కలుగుతుంది? శరీరానికి బట్టలు లేనప్పుడు. పిచ్చివాడు కూడా బట్టలు విప్పుకొని తిరుగుతాడు. అతనికి సిగ్గు లేదా? లేదు. ఎందుకు? అభిమానపడే (సిగ్గు పడే) అహంకారం అతనికి లేదు గనుక. పిచ్చివాడు అభిమానమును వదలియున్నాడు గనుక పైన బట్టలు ఉన్ననూ, లేకున్ననూ పట్టించుకోడు. కనుక అభిమానమే బట్ట. ఆ అభిమానం దేనివలన కలుగుతుంది? అహంకారము వలన కలుగుతుంది. కనుకనే 'అహం బ్రహ్మోస్మి' అనుకున్న అహము (ఆత్మ) లోనే సిగ్గు దాగి వున్నదని వేమన తెలియచేయుచున్నాడు.

చీకటి ఎచ్చుట దాగి వుంది? ఆకాశమే చీకటి. ఆత్మ నుండి ఆకాశము వచ్చినది. కనుక చీకటి ఆత్మయందే దాగివున్నది.

ఆకలి ఎచ్చుట దాగి వుంది?

**'శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥' (భగవద్గీత)**

నేను (ఆత్మ) వైశ్వానరుడను జఠరాగ్నినై సకల ప్రాణుల శరీరముల ఆశ్రయించి, ప్రాణాపాన వాయువులతో కూడి భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములను నాలుగు విధములైన ఆహారములను పచనము చేయుచున్నానని భగవానుడు భగవద్గీత యందు తెలిపియున్నాడు. కనుక ఆకలి ఆత్మ యందే దాగి యున్నదని నిర్ణయం.

నిద్ర ఎచ్చుట దాగి వుంది? నిద్ర ఎవరికి కలుగుతుంది? తమోగుణ సంబంధమైన నిద్ర నాకే కలుగుతుంది. తమోగుణాది త్రిగుణములు ఎవరి యందున్నవి?

**'శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చయే**
**మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥'**

అని భగవానుడు గీతయందు ప్రబోధించి వున్నాడు. ఏవి సాత్త్విక, రాజస, తామస స్వభావములు కలుగుచున్నవో, అవి అన్నియు నా ( ఆత్మ) వలన కలిగినవే అని ఎరుగుము. నేను( ఆత్మ) అయితే వాని యందు లేను. కాని అవి నా(ఆత్మ) యందు వున్నవి. కనుక తమోగుణ సంబంధమైన నిద్ర ఆత్మ యందే దాగి వున్నదని వేమన బోధించుచున్నాడు.

**ఆ॥ నీళ్లలోన మొసలి నిగిడి యేనుగు బట్టు**
**బైట కుక్క చేత భంగ పడును**
**స్థాన బలిమి గాని తన బల్మికాదయా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** ।।2

నీళ్లలోన యున్న మొసలి తనకన్నా ఎంతో బలవంతమైన యేనుగును బట్టి చంపివేయగలదు. కాని ఆ మొసలినే భూమి పై పడవేసినచో, అది తనకన్నా బలహీనమైన కుక్కచే భంగపడును. కనుక విచారించి చూడగా నీళ్లలోన యున్నప్పుడు మొసలికి స్థాన బలముండును. కావున అది సులభంగా ఏనుగునైననూ వధించగలదు. అదే దాని స్థానమును తప్పినచో, కుక్కచేత భంగపడుటకు అవకాశమున్నది. కనుక మొసలికైననూ, కుక్కకైననూ వాటి వాటి స్థానముల వలన బలము వచ్చుచున్నదేగాని, వాటికి స్వయంగా ఆ బలములేదని చెప్పుచున్నాడు వేమనయోగి.

అలానే ఈ జీవునికి స్వయంగా శక్తి లేదు. ఈ ఎరుకయనే బ్రహ్మమునందు వున్నందువల్లనే జీవునికి అనేక శక్తి సామర్థ్యములు కలుగుచున్నవి. కనుక బ్రహ్మము యున్నంత వరకు జీవోపాధులు నీళ్ల మీద ఓడ కదులుచున్నట్టు కదలిక కలిగి, పుట్టి చచ్చుచూనే యుండునని తెలుపుచు వేమనార్యుడీ పద్యంలో ఎరుక తత్వమును స్పష్టీకరించుచున్నాడు.

**ఆ॥ ఆత్మలోని నాదమాలించి యాలించి**
**యాశలందు జిక్కడాదియోగి**
**యాత్మలోని కళల నంటిన తత్వంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 113**

నాదము అనగా ఓంకారము(ధ్వని). ఓంకారము ఆత్మలోన వున్నది. ఆత్మలోని ఓంకార నాదమును తెలుసుకొన్న యోగి ఆశలందు చిక్కడు. కళ అనగా వెలుతురు. ఆ ఆత్మలోని కళలను తెలుసుకున్నవాడే తత్వమును ఎరిగినవాడని వేమన బోధించుచున్నాడు.

**కం॥ నిఖిలాకారుండాతడు**
**నిఖిలాత్ముడు సర్వసాక్షి నిజముగ తానై**
**నిఖిలంబు నందు జూడగ**
**నిఖిలంబయి యుండు నిచ్చ నిజముగ వేమా॥ 114**

ఆ బ్రహ్మమే ఈశ్వర రూపంబున సకల ఆకారములుగా మార్పు చెంది, సర్వమునందు ఆతడే వున్నాడు. అంతే గాక సర్వక్రియలకు సాక్షిగా ఆతడే వున్నాడు. అందుకే 'ఇతరు లెరుగ కున్న ఈశ్వరుండెరుగడా?' అని వేమన బోధించి వున్నాడు. విశ్వములో నున్న ప్రతీ పదార్థమును పరిశోధించగా, అంతయూ బ్రహ్మమేనని తెలియబడునని వేమన ప్రబోధించుచున్నాడు.

ఆ॥ కలుషమెల్ల దెలియ దలవంపులకు మూల
మరయ తత్వమెల్ల నాత్మ బుట్టు
తెలిసినందుకు మరి ధీరుండు గావలె
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 115

సర్వకలుషములకు (సర్వదోషాలకు), తలవంపులకు మూలమేమి? అని ప్రశ్నిస్తే దానికి సమాధానం ఒకటే. అదే ఆత్మ పుట్టుక అని వేమన వచించుచున్నాడు. ఒక ఆత్మ వుంటేనే, దానివల్లే ఈ సర్వజగత్తు సృష్ఠి అయి జీవులు ఏర్పడి, ఆ జీవులు అజ్ఞానాంధకారంలో బడి అనేక కలుషాత్మక పనులు చేస్తూ తలవంపులకు గురవుతున్నాయి. కనుక విమర్శిస్తే ఈ కలుషాలన్ని ఆత్మలోనే వున్నాయని వేమన చెపుతూ, 'ఆత్మ శుద్ధి లేకనంటునా మోక్షంబు!'; 'ఆత్మశుద్ధిలేని యాచారమదియేల?' అని నుడివి వున్నాడు. ఆత్మకు శుద్ధియేమని కొందరు ప్రబుద్ధులు అడుగవచ్చును. ఇదే వేమన రహస్యం. గురువు ద్వారా తెలుసుకోవలసినది. ఆత్మ యొక్క పుట్టుక తెలుసుకున్నచో, ఆత్మ శుద్ధి చేయబడి ధీరుడవుతాడని వేమన బోధించుచున్నాడు. కనుక ఆత్మ పుట్టుక తెలుసుకొని జననమరణ భ్రాంతి రహితం చేసుకొన్నవాడే ధీరుడు అని న్నిర్ణయం.

కం॥ యీ కపట నాటకంబును
యీ కపటపు చదువులన్ని యింపు దలిర్పన్
యే కపటాత్ముడు సేసెనొ
యీ కపటాత్మునకు మ్రొక్కి యలరుము వేమా ॥ 116

కోర్కెలను పెంచు ఈ కపట నాటకము, ఈ కపటపు చదువులన్నియు ఏ కపటాత్ముడు చేసినాడో; ఆ కపటాత్మునకు మ్రొక్కి అలరుమని వేమన ప్రవచించుచున్నాడు.

ఈ జగన్నాటకమునకు సూత్రధారి ఎవరు? ఈ చదువులన్నింటిని ఎవరు కనిపెట్టారు? ఆటగాడు తోలు బొమ్మలను ఎలా ఆడిస్తున్నాడో; అలానే ఆత్మ (ఈశ్వరుడు) సర్వభూతముల హృదయములందుండి శరీరములనె తోలు బొమ్మలను ఆడిస్తూ వున్నాడు. దీనినే గీత యందు

'శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥'

అని శ్రీకృష్ణభగవానుడు చెప్పియున్నాడు. కనుక ఈ జగన్నాటకమునకు సూత్రధారి ఆత్మయే అని అవగతమగుచున్నది. అయితే ఈ నాటకమును కపటనాటకమని వేమన ఎందుకు అనవలసి వచ్చెను? మానవుడు తానే ప్రతిదానిని చేస్తున్నానని భ్రమించుచున్నాడు. తాను ఆశించినది జరుగుటలేదని శోకించుచున్నాడు. కర్తను నేనని ఆపాదించుకొని, అహంకార విమూఢుడై అధోగతి పాలు అవుచున్నాడు. త్రిగుణములతో కూడుకొన్న ప్రపంచంనందు సంచరించుచు, తన సంచారమునకు మరియు ఈ జగన్నాటకమునకు ఆత్మయే కారణమని తెలుసుకోలేక పోవుచున్నాడు మానవుడు. కనుక ఈ నాటకమును కపటనాటకము అని వేమన చెప్పుచున్నాడు.

ఈ చదువులన్నింటిని ఎవరు సృష్టించారు? చదువులన్ని ఓంకారమునుండియే వచ్చినవి. ఓంకారము ఆత్మయందున్నది. కనుక సర్వ చదువులకు మూలము ఆత్మగా తెలియబడుచున్నది. చదువులన్నియు కపటముగా నున్నవి. ఎందుకు? చదువులతో శాశ్వత సత్యము తెలియబడుట లేదు. పైగా అశాశ్వత సుఖాలను సృష్టించుకొని, విషయాదులలో మునిగిపోవుచున్నాడు మానవుడు. కనుకనే వేమన ' చావులేని చదువు చదువవలయు 'నని సెలవిచ్చి యున్నారు. దీనినే గీతాచార్యుడు 'అధ్యాత్మ విద్యా విద్యానాం' – సకల విద్యలలో అధ్యాత్మ విద్యను నేనే నని చెప్పియున్నాడు. మిగతా చదువులన్నియు చావు కలవి. అనగా అశాశ్వతములు. మొదట సుఖముగా యున్నను చివరకు దుఃఖమును కలుగజేయును. భౌతిక శాస్త్రమునందు జూచిననూ, హైసన్ బర్గ్ అనిశ్చితత్వ నియమము ప్రకారం మనము నిర్ణయించు ప్రతి విషయం భ్రాంతులతో, కపటముతో కూడుకొని వున్నదే. కనుకనే వీటిని కపటపు చదువులని చెప్పుచున్నాడు. కనుక ఈ కపటపు చదువులను చేసిన ఆత్మకూడా కపటాత్మ అని తెలుసుకొని, ఆ కపటాత్మునికే (బ్రహ్మమునకే) మ్రొక్కి దానినుండి తరించే మార్గమును తెలుసుకొమ్మని వేమన ప్రవచించుచున్నాడు.

**ఆ॥ అంతరంగ మందు నద్వైతియై యుండు**
**బాహ్య మందు ద్వైత భావి యగును**
**నట్లు గాక తత్త్వ మలవడ నేరదు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 117**

ఆత్మ విచారము చేసినవాడు జగమంతా ఆత్మమయమని తెలిసికొని అంతరంగమున అద్వైత భావియైయుండును. ఆతడే బాహ్యమునందు అనగా వ్యవహారమునందు ద్వైత భావియగును.

లేనిచో వ్యవహారము చేయలేడు. అట్లుకానిచో తత్వము అలవడనేరదని వేమనయోగి బోధించుచున్నాడు. కనుక ఎరుకయే అద్వైతము, ద్వైతము, మరియు అనేకము.

నేడు కూడా అద్వైతులమని పేరుకు చెప్పుకొనుచు ద్వైత క్రియలనే చేయుచున్నారు. కనుక లోకమున చూడగా ద్వైత, విశిష్టాద్వైతములే కానవచ్చుచున్నవి.

ఇట్లు శ్రీవేమనయోగి ఎరుక(బ్రహ్మము)ను గూర్చి స్పష్టముగా తన పద్యాలలో తెలియజేసియున్నాడు. పై పద్యాల వలన వ్యాసుని యొక్క తెలివి, శ్రీ శంకరాచార్యుల యొక్క బ్రహ్మము, శ్రీరామానుజాచార్యుల యొక్క చిదచిద్విశిష్టమైన బ్రహ్మము, శ్రీమధ్వాచార్యుల యొక్క ద్విత్వము, బౌద్ధుల యొక్క శూన్యము మొదలగు సర్వమతాభిప్రాయములు ఎరుకయందే ఇమిడిపోవునని తెలియబడుచున్నది. ఈ ఎరుక యున్నంత వరకు జనన మరణములు తప్పవని వేమనయోగి వేదాంత నిర్ణయం.

ఏడవ అధ్యాయం

# ఎరుకను విడిచే విధానము

'అచల పరిపూర్ణ బ్రహ్మమునూ, ఎరుక(బ్రహ్మము)నూ ఎరిగి, ఎరుకను మానుట' అను ఒక్క వాక్యములో అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతం అంతయూ ఇమిడివుందని తెలిసికొంటిమి. ఇంతవరకు అచల పరిపూర్ణ బ్రహ్మమునూ, ఎరుకనూ సంగ్రహంగా తెలిసికొంటిమి. ఇక ఎరుకను మానుట ఎట్లు? అనగా ఎరుకను విడుచుట ఎట్లు? ఉన్నది పరిపూర్ణము, ఇక ఈ లేని ఎరుకను లేనే లేదనుకుంటే సరిపోతుందా? లేదు. ' ఏ సాధన నీకెందుకు వీసానికి పనికి రాదు' అని అచల పరిపూర్ణ భావజ్ఞులమనుకొనువారు కొందరు చెప్పుట ఖండించదగిన విషయము. ఈ వాక్యము ఎరుక స్వరూపమును లెస్సగా గుర్తెరిగిన వారి విషయంలో మాత్రమే చెప్పబడినది. ఇతరులు వస్తు నిర్ణయ పద్ధతిగా ఎరుక యొక్క స్థాన స్వరూప స్వభావములను గురువుతో గుర్తెరిగి, తనయందు సర్వమును, సర్వమునందు తనను గాంచి, యోగియై తనకు వేరుగా యున్న అచల పరిపూర్ణ బ్రహ్మమునందు తనకు మూలముగాని, స్థానముగాని లేదని తెలిసికొనవలెను. ఆ పిదప నేనే బ్రహ్మముననే భ్రాంతిని వదలి, ఆ బ్రహ్మము వలన కలుగుచున్న జ్ఞానకర్మలను కూడా అంటకుండా సర్వభోగములతో కర్తృత్వరహిత కర్మాచరణచేయుటయే ఎరుకను విడుచుట అని వేమనయోగి సిద్ధాంత నిర్ణయము. ఇందులకు ఎరుక యొక్క పూర్తి స్వరూపము తెలియు వరకు 'గురుశిష్య విచారణరూపమైన' సాధన అవసరం. తదనుగుణమైన త్రికరణశుద్ధియుత అధిష్ఠానరూప సమిష్ఠి కర్మాచరణ అనెడి 'అచలయోగము' ను అనుష్ఠించవలెను. ఇక అచలమును గాంచుటకు ఏ సాధన అవసరం లేదు. అద్దానిని వూరకనే యుండి గురు సూచన ద్వారా గాంచవలెను.

కొందరు ఎరుక ఏ సాధన వలన రహితమవుతుందని శ్రీ శివరామదీక్షితులవారిని ప్రశ్నించినారట. అందులకు వారు ' ఏ సాధన చేస్తే కలయందున్నవానికి కల రహితమగును?' అని ఎదురు ప్రశ్నవేశారు. కనుక కలలోని వానిని ఇంకొక కలగనువాడు మేల్కొల్ప లేడు. మేలుకలో యున్నవాడే కలగను వానిని మేల్కొల్ప గలడు. కనుక మేల్కొన్న పరిపూర్ణ గురువే, ఎరుకను కలలలో నున్న శిష్యుడిని మేల్కొల్పగలడు. కనుక పరిపూర్ణ గురుని జాడ ఆతని శిష్యుల వలన తెలిసికొని, వెదకి, చేరుకొని, సేవించి, పూజించి ' ఎరుకను కల' నుండి మేల్కొనవలెను.

నేను అనే ఎరుక వుంటేనే నాకు ఈ ప్రపంచం తోచును. నేను అనే ఎరుక లేకుంటే ఈ ప్రపంచం నాకు లేదు. కనుక నేను అనే ఎరుకను విడుచుటే ముక్తి అని వేమనయోగి వేదాంతము.

ఎరుకయందే వుండి, ప్రవర్తించుచు, ఎరుక నుండి విముక్తి ఎలా? ఎరుకనుండి విముక్తి కొరకు మానవుడు చిత్తశుద్ధి మరియు ఆత్మశుద్ధి చేసికోవలయును. చిత్తమే క్షేత్రము. ఆత్మయే క్షేత్రజ్ఞుడు. ఈ క్షేత్రక్షేత్రజ్ఞులే ద్వయదోషరూపమైన ఎరుక. క్షేత్రక్షేత్రజ్ఞులయందున్న దోషమును ఎలా శుద్ధిచేయుట? సర్వదోషములకు మూలకారణమైన ఈ క్షేత్రక్షేత్రజ్ఞులను శుద్ధిచేయునది ఒక్క అచల గురు బోధాగ్నియే. అచల గురుడు ఇచ్చు బోధాగ్నియందు సర్వదోషములు దగ్ధమై శిష్యుడు శుద్ధాంతకరణము కలవాడగును. ఇక ఆగామి కర్మయందు చిక్కక లోకమున నడుచుకొనుట ఎలా? నీటియందే పుట్టి, నీటియందే పెరిగి, తామరాకు నీటికి అంటక చలించునట్లు, రాజహంస మానస సరోవరమునందలి తామర తీగలయందు దైవికముగా తగులుకొన్ననూ ఎట్టులయితే తీగలను కొరికి వేసి ఆకాశవమునకు విహరించునట్లు యోగియైనవాడు త్రికరణశుద్ధియుత అధిష్ఠానరూప సమిష్ఠి కర్మాచరణ కర్తృత్వరహితముగా చేయుచు కర్మలకు అంటుకొనక సర్వభోగములతో ఎరుకయందే సంచరించి ముక్తిబడయును.

' ఒక వ్యక్తి ముక్తి పొందినచో, ఎరుకయందు ఏమైనా లోటు కలుగుతుందా?' అని కొందరు అడుగుచూవుంటారు. ఎరుక శూన్య స్వరూపమైనది, కనుక దాని నుండి శూన్య స్వరూపుడైన ఒక వ్యక్తిని తీసివేసినచో, ఎరుకకు ఏమీ లోటు లేదు. సున్నా నుండి సున్నాను తీసివేసినచో, సున్నాయే మిగులును. కనుక ఈ లేని ఎరుక లేకనే నిత్యముగా యుండును. ఎరుక అఖండముగా యున్నను, దీనియందు అనేకత్వమున్నది. కనుక ఎవరు తెలిసికొని, ఆచరిస్తే వారికే ముక్తిగాని అందరికి ముక్తిరాదు. అందుకే 'తనదు కాలు కోయ తన తమ్ముడేడ్చునా?' అని వేమనయోగి చెప్పియున్నాడు. కనుక అచల వేదాంతము ఏకజీవాత్మవాదమును ఖండించునని తెలియదగును. కనుక ఎవరి ఎరుకను కలను వారే అచల గురుని సూచనతో రహిత పరచుకొనవలెను.

ఇట్లుగాక క్షేత్రక్షేత్రజ్ఞులు వేర్వేరనియు, అందొకటి సత్యమనియు మరొకటి అసత్యమనియు చెప్పువారిని చాకలి కూడా నమ్మకపోయెననియు, మంగలి కూడా నమ్మకపోయెననియు శ్రీ శివరామదీక్షితులవారు చెప్పియున్నారు. ఎందుకనగా చాకలి ఎంత శుభ్రంగా బట్టలు ఉతికి తీసుకవచ్చినను, మళ్ళీ అవి మురికియై రేపు తన దగ్గరికి వచ్చునని చాకలికి తెలుసును. అలానే ఎంత నున్నగా గుండు గీసినను, మళ్ళీ తల వెంట్రుకలు వచ్చును. కనుక తన వద్దకు మళ్ళీ వస్తాడని

మంగళికి కూడా తెలుసును. కనుక క్షేత్రజ్ఞుడిని అలానే వుంచి, క్షేత్రమును ఎంత శుద్ధిచేసినను జన్మ రహితము కాదు. అందులకే 'డొక్క దోమి నంత దొరుకునా మోక్షంబు?', 'పుట్ట మీద గొట్ట భుజగంబు చచ్చునా?' అని వేమనయోగి చెప్పియున్నాడు. కనుక క్షేత్రక్షేత్రజ్ఞులను రహితము చేయుటే ఈ అచల బోధ లక్ష్యము. ఎలా? క్షేత్రక్షేత్రజ్ఞుల ఏకస్వరూపమైన పురుషోత్తమ ప్రాప్తి యోగమును మోక్షమును పొంది, ఆ మోక్షమును కూడా సన్యసించుటే 'మోక్ష సన్యాస యోగము' అనెడి అస్పర్శయోగము(అచలయోగము లేక రాజయోగము). కనుక ఈ మార్గము బ్రహ్మత్వమూ కాదు, దాసత్వమూ కాదు. ఈ విధానమే ఎరుకను విడుచు విధానము. దీనినే వేమనయోగి తన పద్యాలలో ఏ విధముగా వివరించాడో తెలియజేయుటే ఈ ఏడవ అధ్యాయం యొక్క ఆశయం.

**ఆ॥ రాక పోక లణచు రాజమార్గము పూని**
**నాక మనెడు గురుతు వీక నెరిగి**
**సోకి మించ బయలు సూత్రంబు గాదొకో?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 118**

రాకపోకలను రహితపరచు మార్గమే రాజమార్గము. ఆ మార్గమును అనుసరిస్తూ గురుతు రూపంగా వున్న ఎరుకను ఎరిగి, ఆ గురుతును గురు కృపతో రహితము చేసుకున్నవారికి పరిపూర్ణబ్రహ్మము సులభంగా తెలియబడునని వేమన ప్రబోధించుచున్నాడు.

నాక మనెడు గురుతును స్పష్టముగా ఎరుగుట అంత సులువుకాదు. గురుతు అనగా నేమిటి? మనము మాట్లాడే మాటలను రికార్డు చేయాలనుకున్నప్పుడు మనము టేప్‌రికార్డర్‌ను ఉపయోగిస్తాం. అప్పుడు మన మాటలన్ని క్యాసెట్టులో రికార్డు అవుతాయి. అలానే మనం మన ఇంద్రియాల ద్వారా చేసే పనులన్ని ఆయా ఇంద్రియ అధిష్ఠాన దేవతలను చేరుకొని అక్కడ రికార్డు అవుతాయి. ఆ ఇంద్రియ అధిష్ఠాన దేవతలు అక్షర పురుషునికి ఇంద్రియములై వున్నవి. కనుక మనము చేసే ప్రతీ పనీ వాటి ఫలాఫలాలు అక్షర పురుషుని యందు రికార్డ్ అయి అనగా గురుతు రూపంగా వుంటూ పునర్జన్మకు కారణమవుతుంది. కనుక అక్షర పురుషుని నుండి తప్పించుకోవడం అంత సులువైన పనికాదు. ఈ అక్షర పురుషునికి ఆధారంగా వున్న పురుషోత్తమున్ని గురుముఖాన తెలుసుకొని, ఆతనికి అతీతంగా వున్న బయలు(పరిపూర్ణ బ్రహ్మము) అను సూత్రమును సూచనగా తెలుసుకొన్నవారు క్షరాక్షరపురుషోత్తమరూపమైన గురుతును పెకిలించి వేయగలరని వేమనాచార్యుడు బోధించుచున్నాడు.

కం॥ **మాయావిద్యల జూడకె**
**మాయల కిరవైన ఎరుక మర్మము గనకే**
**మాయావిద్యల జాలము**
**ఛాయలె జీవేశ్వరునకు జాతము వేమా ॥** 119

మాయ, అవిద్యలు అనగానేమి? వీటికి కారణమైన ఎరుక యొక్క రహస్యమేమిటి? అని తెలిసికోకుండా మానవునికి ముక్తి లేదు.

జీవోపాధులు అన్నియు అజ్ఞానావరణములో వున్నాయి. ఈ అజ్ఞానావరణమునే అవిద్యావరణము అంటారు. ఈ ఆవరణములో వున్న మానవుడు, దేహమే తాననుకొని దేహాత్మ భావమును పొందియుండును. కనుక జీవునికి అవిద్యావరణము అని నిర్ణయము. ఇక ఈశ్వరుడు మాయావరణము( విద్యావరణము)లో వున్నాడు. కనుక తత్వ విచారణ చేసి తానే దేవుడనని, ఈశ్వర స్వరూపుడనని నిర్ణయంలో వున్నవాడికి మాయ ఆవరించియుండును. దీనినే శ్రీ కృష్ణ భగవానుడు గీతలో

**'శ్లో॥ ఈశ్వరస్సర్వభూతాని హృద్దేశేఽర్జున తిష్ఠతి।**
**భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥'**

అని వచించియున్నాడు.

కనుక జీవునిగా వున్నప్పుడు ఇనుప సంకెళ్ళు, ఈశ్వరునిగా వున్నప్పుడు బంగారు సంకెళ్ళు తప్పవు. విచారించి చూడగా ఈ జీవేశ్వరులకు మూలము ఎరుకేనని తెలియబడును. 'సర్వం ఖల్విదం బ్రహ్మ'. కనుక ఎరుకను విడిచినప్పుడే బంధమూ లేదు, మోక్షమూ లేదు అని వేమనయోగి ప్రవచించుచున్నాడు.

దీనినే శుకరహస్యోపనిషత్తుయందు

**'శ్లో॥ కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః।**
**కార్య కారణతాం హిత్వా పూర్ణ బోధోవశిష్యతే॥'**

అని చెప్పబడివుంది. కనుక కార్యోపాధి అనగా జీవుడు(క్షరుడు), కారణోపాధి అనగా ఈశ్వరుడు(అక్షరుడు). ఈ క్షరాక్షరోపాధి ద్వయ దోష రహితమునందు శేషించునది ఆ పరిపూర్ణ బ్రహ్మమేనని అర్థము.

**కం॥ భేదాభేదంబులకును**
**వాదంబైజనము చూడ వర్తించును నా**
**భేదాభేదము లుడిగిన**
**వేదాంత ధ్యాని యగుచు వెలుగుర వేమా॥ 120**

ఎరుకయే స్థూలరూపముగా మారినప్పుడు, దానియందు అనేక భేదములు కనిపించుచున్నవి. అదే సూక్ష్మ రూపముగా తిరోభావము చెందినప్పుడు అభేదముగా కనిపించుచున్నది. ఇది వాద ప్రతివాదులకు విషయమై యున్నది. ఏకమే అనేకముగా మరియు అనేకమే ఏకముగా మారుచున్న ఎరుకయే భేదాభేదములకు కారణమని వేమన చెప్పుచున్నాడు. ఆ భేదాభేదములకు కారణమైన ఎరుకను విడిచినవాడే వేదాంతము (పరిపూర్ణ బ్రహ్మము)ను తెలిసికొన్నవాడై ప్రపంచమునందు ప్రవర్తించుచుండును.

**ఆ॥ మనసు వాక్కు కర్మ మరియేమి లేకను**
**రాకపోకగాని రాజవీధి**
**పరగ హాని గలదె పరతత్వ యోగికి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 121**

రాజయోగ మార్గమే రాజవీధి. ఈ వీధిలో పయనించు వానికి రాకపోకలు వుండవు. ఈతని స్థితి మనోవాక్కాయ కర్మములకు అతీతమై వున్నందున, ఈతనికి ఏ హానీ కలుగదు. మనస్సు, వాక్కు మరియు కర్మలు ఇంద్రియ సముదాయంతో కూడుకొని వున్నందున విషయలోలత్వంను కలుగ చేస్తాయి. చిక్కులను కొని తెస్తాయి. హానినీ తలపెడ్తాయి. చివరకు విషయ వాంఛా పంకిలమైన మనసు మరో జన్మకు ద్వారమవుతుంది. కనుక మనసు ఏ ఏ పదార్థాల లేక విషయాలపై మరలిననూ, ఆయా పదార్థాలు లేక విషయాలు పరమాత్మకు అన్యం కావని, సర్వత్రా సమదర్శనం చేయువాడే యోగి.

'శ్లో॥ యత్ర యత్ర మనోయాతి తత్ర తత్ర పరం పదం
తత్ర తత్ర పరంబ్రహ్మ సర్వత్ర సమవస్థితం॥' (ఉత్తర గీత)

ఇది తెలిసినవాడే తత్వయోగి. ఇక పరతత్వ యోగి ఎవరు? విమర్శించి చూడగా, పరమాత్మ స్వరూపంగా ఉన్న బ్రహ్మమునందే ఈ మనస్సు, వాక్కు, కర్మలు ఒకదానికొకటి తగులుకొని వున్నవి. దీనిలోవున్నంత సేపు వీటితో తిప్పలు తప్పవు. ఈ తత్వమునకు అన్యంగా ఉన్నదే పరతత్వము. ఈ బ్రహ్మమునకు అన్యంగా వున్నదే పరిపూర్ణ పరబ్రహ్మము. ఈ పరిపూర్ణ పరబ్రహ్మమునందు మనస్సుగాని, వాక్కుగాని, కర్మగాని మరియు ఇంకేమియు లేవు. అది తప్ప ఇంకేమియూ లేదు. ఇదే పరతత్వము. ఇదే రాకపోకలు లేని రాజమార్గం. ఇది తెలుసుకున్న వాడే పరతత్వయోగి. ఇక ఈ యోగికి జననమరణాలనే హాని వుంటుందా? లేదు. అందుకే 'యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ' అని ఉపనిషద్వాక్యము చెప్పబడినది.

కం॥ తలచిన తత్వం బగునా?
తలపక తా నూరకున్న తత్వం బగునా?
తలపును దలపమి రెండును
తలపమితో నుండెనేని తత్వము వేమా ॥ 122

ఆత్మ తత్వమును తరచి తరచి ఒక నిర్ణయంలో వుండుట తత్వము కాదు. అట్లుగాక అసలు ఆత్మ తత్వమును తెలిసికోక పోవడం కూడా తత్వము కాదు. మరి ఏమిటి వేమన వెర్రి తత్వము అంటారా? అదే రహస్యం. మొదట ఆత్మ తత్వమును తెలిసికొని, ఆ ఆత్మ తత్వమునందే సృష్టి కారణము వుందని తెలిసికొని, తలంపులన్నియు ఆత్మ నుండియే వచ్చుచున్నవని తెలిసికొనవలెను. ఆ తలంపులన్నింటిని బోడులు చేసుకోవాలంటే, ఆ ఆత్మనే తలంచకుండా వుండాలంటున్నాడు. అనగా ఆత్మకు అతీతంగా వుండమంటున్నాడు వేమన. తలపు-తలపమి, సుఖం-దుఃఖం, వెలుగు-నీడ, నేను-మేను మొదలగు సర్వ ద్వంద్వములు ఆత్మయందే వున్నవి. కనుక తలచకుండా వుండుటే తత్వము అని వేమన ప్రవచించుచున్నాడు.

ఆ॥ పగలు రేయి మరచి భావంబు మరచియు
తాను నేన నియెడు తలపు మరచి
యుండు వాని నెంచు నుత్తమ యోగిరా
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 123

పరిపూర్ణ బ్రహ్మమునందు పగలు-రేయి అను భావము లేదు. తాను - నేను, జీవుడు - ఈశ్వరుడు, ఆత్మ - ప్రత్యగాత్మ అను ద్వంద్వ నిర్ణయం ఆ పరిపూర్ణ బ్రహ్మమునందు లేదు. కనుక అట్టి పరిపూర్ణ బ్రహ్మము నెరిగినవాడు సర్వద్వంద్వరూపమైన ఎరుకను అతిక్రమించును. అట్టి వాడే ఉత్తమ యోగి అని వేమనార్యుడు బోధించుచున్నాడు.

ఆ॥ తారుమారు గాక తత్వదర్శన మూని
మేరు శిఖర మెక్కి మెలగు వాడు
కేరు నెరుక లోనె కీటణగించురా
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 124

ప్రపంచములో ఉన్న వివిధ రకాలైన బోధల ద్వారా సత్యము అవగతం కావడం లేదు. విషయం తారుమారు అవుతుంది. అలాకాక సరియైన సాంప్రదాయక గురువును చేరి తత్వదర్శనము చేసినవాడు బ్రహ్మమనే మేరు శిఖరము నెక్కి సంచరిస్తూ వుంటాడు. ఆ బ్రహ్మమే ఎరుక. ఆతడు ఆ ఎరుకలోనే కేరుచూ (అటూ ఇటూ తిరుగూచూ) దానివల్ల వచ్చే కీడును వినాశనం చేస్తాడు అని వేమన ప్రబోధించుచున్నాడు.

ఆ॥ రూపడగక జీవరూపంబు గనరాదు
యట్టి రూప మడగ నలవి గాదు
బ్రహ్మమడగకున్న బ్రహ్మంబు గనరాదు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 125

ఈ స్థూల దేహమే మనిషికి రూపం. ఈ స్థూల శరీరంను ఆశ్రయించి ఉన్న జీవమును ఎలా చూడవచ్చును? ఈ కన్నులతో దానిని చూడలేము. అనగా ఈ స్థూల శరీరం(రూపము)తో దానిని చూడలేము. కనుక ఈ రూపమును అణచిన వాడికే; జ్ఞాన దృష్టిచే జీవరూపము

తెలియబడును. ఈ జీవరూపమును కూడా అణచి వేచి బ్రహ్మరూపమును చూడటం సమాన్యమా? కాదు. ఒక వేళ ఆ జీవ రూపమును అణచి బ్రహ్మరూపమును చూచిననూ, అది కనరాదు. ఎందుకు? నేను(జీవము) ఆ బ్రహ్మము కన్నా వేరుగా వున్నచో ఆ బ్రహ్మరూపమును చూడగలను. కాని 'జీవో బ్రహ్మైవ నాపరః'. కనుక ఆ బ్రహ్మమును నేను అను భావమును, దానిని నేను చూస్తాను అనే భావమును కూడా త్యజించినవాడే; బ్రహ్మమును చూచిన వాడు కాగలడు అని వేమన ప్రబోధించుచున్నాడు.

ఎరుక(బ్రహ్మము)ను అణచివేసినవాడికే పరిపూర్ణ బ్రహ్మము కనిపించునని వేమన పరోక్షంగా ప్రబోధించుచున్నాడు.

**కం॥ కాయము విడిచెడు వేళను**
**న్యాయంబుగ బుద్ధి నొక్కి నమ్రత తోడన్**
**జ్ఞేయంబగు పరిపూర్ణము**
**ఛాయను గని పరిణమించు జయ్యున వేమా ॥ 126**

కాయం అనగా శరీరము. ఈ శరీరము స్థూలరూపమైనది. కనుక స్థూలమును వదలి సూక్ష్మశరీరంతో సూక్ష్మదృష్టిచే గురుశిష్య న్యాయము ద్వారా బుద్ధిని నొక్కి జ్ఞానముచే తత్త్వవిచారణ చేసిన వాడికి ఆ జ్ఞానమే బ్రహ్మమని తెలియబడును. 'ప్రజ్ఞానం బ్రహ్మ'. అట్టి బ్రహ్మమునకు అతీతంగా వున్నదే పరిపూర్ణము(పరిపూర్ణ బ్రహ్మము). అదే జ్ఞేయం. ఈ జ్ఞానమనే బ్రహ్మముతో ఆ జ్ఞేయము అగు పరిపూర్ణ బ్రహ్మమును చూసి లేకుండా పోవుటే ఆ జ్ఞానమనే బ్రహ్మమునకు ముక్తి. ఈ భావమునే ఈ క్రింది భ్రాంతి రహిత శ్లోకము తెలుపుచున్నది.

**'శ్లో॥ ఉల్కా హస్తో యథా కశ్చిత్ ద్రవ్యమాలోక్యతాం త్యజేత్ ।**
**జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్ ॥'**

అయితే ఇచట ఒక ముఖ్య విషయము ఉన్నది. పరిపూర్ణమును, లేని ఎరుక(బ్రహ్మము)ను ఎరిగి, ఎరుకను విడువలెనని వేమన సిద్ధాంతము. జ్ఞానము అనగా ఎరుక. ఎరుక అనగా ఎరిగేటిది. జ్ఞేయము అనగానేమి? జ్ఞేయమనగా ఎరుగబడేది. 'పరిపూర్ణమును, లేని ఎరుకను ఎరిగి' అన్నచో; పరిపూర్ణము, ఎరుక రెండూ జ్ఞేయ వస్తువులే అని చెప్పవలసి వస్తుంది. కాని పరిపూర్ణము జ్ఞేయవస్తువు

అని చెప్పవచ్చునా? చెప్పకూడదు. ఎందుకు? జ్ఞాన జ్ఞేయములు రెండూ కూడా ఎరుకే. సర్వలక్షణ విలక్షణమైన పరిపూర్ణము జ్ఞానమూ కాదు, జ్ఞేయమూ కాదు. కనుక శిష్య బోధార్థం వేమన పరిపూర్ణమును జ్ఞేయం అని చెప్పిరి అని తెలియవలెను.

**కం॥ పగ యుడుగు కోపముడిగిన**
**పగ యుడుగన్ గోర్కులుడుగు పరి జన్మంబుల్**
**తగు లుడుగు భేదముడిగిన**
**త్రిగుణములుడుగంగ ముక్తి స్థిరమగు వేమా ॥ । 27**

కోపము పోతే పగపోవును. పగపోతే కోర్కెలు పోవును. కోర్కెలు పోతే జన్మలు ఉండవు. భేదము పోతే కొట్లాటలు పోవును. త్రిగుణములు పోతే ముక్తి స్థిరము.

కోపము, పగ, కోర్కెలు, భేదభావములు, అనేక జన్మములు వేటివలన కలుగుచున్నవి? త్రిగుణముల వలన. త్రిగుణములు ఏవి? అవి సత్వగుణము, రజోగుణము, మరియు తమోగుణము. అవి దేని యందున్నవి? అవి ఆత్మ యందున్నవి?

**'శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చయే ।**
**మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ '**

అని భగవానుడు గీతలో బోధించి ఉన్నాడు. ఆ గుణాలలో నేను లేను. ఆ గుణాలే నాయందు దాగి వున్నవని పరమాత్ముడు చెప్పినాడు. కనుక త్రిగుణములు పోవుట ఎలా? సర్వ సంఘములకు మూలమైన బ్రహ్మమే (ఎరుకే) త్రిగుణాత్మకమైనది. కనుక బ్రహ్మము ఉన్నంతకాలం త్రిగుణాలు పోవు. కనుక అఖండము, ఏకము అగు బ్రహ్మము (ఎరుక)ను తెలుసుకొనిన వాడు మోక్షమును పొందియుండును. మళ్ళీ ఆ మోక్షము కూడా స్థిరము కాదు. ఎందుకనగా ఆ బ్రహ్మమునకు మార్పుచెందే త్రిగుణాలున్నాయి గనుక. కనుక ఆ మోక్షమును కూడా విడువవలయును. అనగా ఆ బ్రహ్మము(ఎరుక)ను విడిచినపుడే సర్వభ్రాంతి రహితము కాగలదు. దీనినే భగవానుడు గీతలో మోక్ష సన్న్యాస యోగంలో చెప్పియున్నాడు. కనుక త్రిగుణాలుడుగుట అనగా తాను లేకుండా పోవుటయే అని వేమన ప్రవచించుచున్నాడు.

**కం॥ వంచన చేసెడి యెరుకను**
**మించిన పరతత్త్వ మమరు మేలిమిగా నా**
**శించును గన్గొని యుండిన**
**సంచారము లేని బయలు సతమగు వేమా ॥ 128**

సకల వంచనలకు ఎవరు కారణం? ఎరుక(బ్రహ్మము)యే. మంచీ చెడు, రెండూ కూడ ఆ ఎరుకయే చేయిస్తుంది. అట్టి ఎరుకకు అతీతంగా వున్నది ఏది? అదే పరతత్త్వము. తత్త్వం=తత్+త్వం =బ్రహ్మము. కనుక పరతత్త్వము అనగా బ్రహ్మమునకు అతీతముగా వున్న పరిపూర్ణబ్రహ్మము. ఈ పరిపూర్ణ బ్రహ్మము దేనికీ కర్త కాదు. అది దేనినీ చేయించదు. అట్టి పరతత్త్వము ఎరుకను మించి ఆలోచించినవాడికి అమరుతుంది. అప్పుడే ఎరుక నశించి ఏవిధమైన సంచారములు లేని బయలు(పరిపూర్ణ బ్రహ్మము) ప్రత్యక్షమగునని వేమన ప్రబోధించుచున్నాడు.

**తే॥ నీవు నెరిగిన లోకంబు నీకు దోచు**
**నీవు మఱిగిన తోడన నెందు బోయె?**
**ననెడి యెరుకను విడనాడు డయ్య యోగి**
**విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య ॥ 129**

నీవు వుంటే ఈ ప్రపంచం తోచుచున్నది నీకు. నీవు లేకుంటే ఈ ప్రపంచం నీకు లేదు. కనుక నీవు లేని చోటున ఈ చిత్రవిచిత్రమైన జగము నిలువలేదు. కనుక ఎరుక కలిగినపుడు ప్రపంచం వుంది. మరుపు కలిగినపుడు అదే ప్రపంచం లేదు. విచారించి చూడగా ఎరుక మరుపులు ఆ బ్రహ్మమున(ఎరుక)కే వున్నవి. కావున ఆ ఎరుకను విడుచుటే యోగి కర్తవ్యమని వేమన బోధించుచున్నాడు.

**ఆ॥ సిగ్గు విడువకున్న శివసౌఖ్యమును లేదు**
**తగ్గి మొగ్గకున్న సిగ్గు విడదు**
**సిగ్గు విడుచువాడు చిరకాల జీవిరా!**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 130**

సిగ్గు అనగా అభిమానము. అభిమానము అహంకారము వలన కలుగుతుంది. అహంకారము దేని వలన కలుగును? ఆ అహంకారము బ్రహ్మము వల్లనే కలుగుచున్నది. కనుక సిగ్గు విడుచుట

అనగా ఆ బ్రహ్మము (ఎరుక)ను విడుచుటే. అలా సిగ్గు విడువని వానికి ఆత్మ (శివ) సౌఖ్యము లేదు. ఎందుకు? ఆ బ్రహ్మము తన భ్రాంతుల యందే మనుజున్ని త్రిప్పును. ఆ భ్రాంతి రూపమైన బ్రహ్మమును విడిచిన వాడికి ఆ భ్రాంతి యందే సౌఖ్యము అను భ్రాంతి కలుగును. అహంకారాన్ని వదలని వాడికి సిగ్గు విడదు. సిగ్గు విడువని వాడు భ్రాంతులందే గిరగిర తిరుగుచూ వుంటాడు.

అయితే సిగ్గు విడిచిన వాడు ఏమవుతాడు? చిరకాల జీవి అవుతాడు. ఏల? సిగ్గు విడుచుట అనగా అహంకారమును(కర్తృత్వమును) విడుచుట. అలా అహం త్యాగము చేసినవాడికి మరణమే లేదు. కనుక అట్టి వాడు చిరకాల జీవి అని వేమన బోధించుచున్నాడు.

**కం॥ బైలున బంధము గలపక**
**వాలెను పరమాత్మునకును వాంఛితమొప్పన్**
**బైలున బంధము గలపిన**
**కైలాసము జేరి ముక్తి గాంచుర వేమా ॥ । 3 ।**

బైలు(బ్రహ్మము)ను బంధము అని తెలుసుకోలేక, ఈశ్వరుని(పరమాత్ముని) ఇచ్ఛమేరకు జీవుడు భూలోకంలో వాలెను. బంధము(జీవుడు)ను ఆ బైలు (బ్రహ్మము)లో కలిపిన అనగా ఆ రెండూ ఏకమని తెలుసుకొనినవాడు, ఆ తర్వాత ఆ ఏకమును కూడా వర్జించవలెను. అట్టివాడే విలాసములు లేని కైలాసమును(పరిపూర్ణ బ్రహ్మమును) గాంచగలడని వేమనార్యుడు ప్రవచించుచున్నాడు.

**కం॥ బయలున బంధము గప్పను**
**బయలున బరమాత్మునకు బంధము మెలగున్**
**బయలున బంధము లూడిన**
**నయ వర్త్మను ముక్తి గాంచు నరుడటు వేమా ॥ । 32**

బయలు (బ్రహ్మము)న బంధము ఉన్నది గనుక బయలున పరమాత్మునకు కూడా బంధము కలదు. జీవుడుగా వున్నప్పుడు ఇనుప సంకెళ్ళు, పరమాత్మునిగా వున్నప్పుడు బంగారు సంకెళ్ళు తప్పవు. క్షర రూపుడైన జీవునికి అవిద్యావరణము అనే బంధము, పరమాత్మ స్వరూపుడైన

పురుషోత్తమునికి ప్రకృత్యావరణము అనే బంధములు వున్నవి. ఈ రెండు బంధములు క్రమముగ వూడిన వాడికి ముక్తి సులభము.

అయితే బంధములను వూడగొట్టుట ఎలా? జీవుడు, అవిద్యావరణము రెండూ కలసియే వున్నవి. పరమాత్ముడు, ప్రకృత్యావరణము రెండూ కలసియే వున్నవి. ఆ రెండూ కలసియున్న ఏక తత్వము అయిన బ్రహ్మమును తెలుసుకొని దానిని వర్జించిన వాడే బంధములను వర్జించినవాడు అని వేమన వక్కాణించుచున్నాడు.

**కం॥ తా నొకటి దెలసి నేనును**
**తా నంటది లేక నెల్ల తావులు తానై**
**తా నెరిగి పరిణమించిన**
**మానవునకు ముక్తి గలదు మహిలో వేమా ॥ 133**

బ్రహ్మము (ఎరుక)ను తెలిసికొని; నేను (జీవుడు), తాను (బ్రహ్మము) అను భావము లేక ఎల్లతావులు తానై (ఎరుకైనిలచి) యుండవలెను. అయిననూ జనన మరణములు తన యందే వున్నవని గ్రహించి, తానే లేకుండా పోవుటయే ముక్తియని వేమన ప్రవచించుచున్నాడు.

**ఆ॥ గురుతు జూపు నట్టి గురువెవ్వడును లేడు**
**గురుతు గన్న శిష్య వరుడు లేడు**
**గురుడు శిష్య వరుడు కుందేటి కొమ్మయా?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 134**

ఇచట గురుతు అనగా పరిపూర్ణ బ్రహ్మముగా అర్థము గ్రహించవలెను. పరిపూర్ణ బ్రహ్మమును చూపునట్టి గురువు, చూసినట్టి శిష్యుడు ఎవ్వరునూ లేరు. ఎందుకనగా ఈ గురుశిష్యులే (పరమాత్మజీవులే) మిథ్య. అంతటా నిండియున్న పరిపూర్ణమును చూడబోయి, గురుశిష్యులు ఏకమై లేకుండా పోవుచున్నారని వేమనయోగి చెప్పుచున్నాడు. ఇక గురుశిష్యులు కుందేటి కొమ్మువలె తోచుచున్నారే తప్ప, లేరని అర్థము. ఇదే గురుశిష్యోభయ రహితము. ఇక శేషించునది ఆ అచల పరిపూర్ణ బ్రహ్మమే.

ఆ॥ తాను నేననియెడు తప్పులో బెడిదంబు
మాని కడు వివేక మహిమ దనరి
యూరకున్నవాడు యుత్తమోత్తముడురా
విశ్వదాభిరామ వినుర వేమ॥ । 35

తాను అనగా బ్రహ్మము. నేను అనగా జీవుడు. పరిపూర్ణ బ్రహ్మమునందు జీవుడూ లేడు, బ్రహ్మమూ లేదు. జీవబ్రహ్మల రహితమునందే పరిపూర్ణబ్రహ్మము స్వతఃసిద్ధము. ఆ పరిపూర్ణ బ్రహ్మమును దర్శించినవాడు తాను బ్రహ్మమునిగానీ, తాను జీవుడనని గానీ తలచక, వ్యవహారమునందు విచక్షణ జ్ఞానమును ఉపయోగిస్తూ తప్పుచేయక ప్రవర్తించుచుంటాడు. అట్టివాడు నేను బ్రహ్మమునని గానీ, జీవుడనని గానీ అనుకోక యూరకనే యుండును. అట్టి వాడే ఉత్తమోత్తముడని నిర్ణయం.

ఎందుకంటే పరిపూర్ణ బ్రహ్మము దృష్ట్యా వేరే దానికి ఉనికి లేదు. అందువల్ల నేను బ్రహ్మమునో, జీవుడనో ఉద్దేశ్యము కలిగియుండుట తప్పులో పడటమే. కనుక జీవబ్రహ్మలు ఎరుకేనని, ఆ ఎరుకనే త్యజించి ఊరక యున్నవాడే ఉత్తముడని శ్రీ వేమనయోగి ప్రవచించుచున్నాడు.

కం॥ అనిచి పురుషుండు యొక్కడు
విను నిత్య మనిత్యమనక విధమిట్టి దగున్
తన సంకల్పమె బంధము
తన సంకల్ప క్షయంబె తత్వము వేమా ॥ । 36

పరిపూర్ణ బ్రహ్మము నిత్యమూ కాదు, అనిత్యమూ కాదు. బ్రహ్మము (ఎరుక) యే నిత్యమూ, అనిత్యమూ. దేహము అనిత్యము, దేహి నిత్యము. దేహీ దేహములు రెండూ ఎరుకయే. అయితే బంధమునకు కారణమేమి? సంకల్పము.

'అనాద్యవిద్యా వాసనయా జాతోఽహమిత్యాది సంకల్పో బంధః, పితృ మాతృ సహోదర దారా పత్య గృహారామక్షేత్రాది మమతా సంసారావరణ సంకల్పో బంధః, అణిమాద్యష్టైశ్వర్యాశా సిద్ధ సంకల్పో బంధః, సంకల్పమాత్ర సంభవో బంధః' (నిరాలంబోపనిషత్)– అనాది అగు

అజ్ఞానము యొక్క వాసనచే 'నేను జన్మించిన వాడను' అను మొదలగు సంకల్పములు కలిగి యుండుటే బంధము.

తల్లి దండ్రులు, సోదరులు, భార్య, బిడ్డలు, గృహము, ఉద్యానవనము, పొలము మొదలైన వాటియందు మమత కలిగి యుండి సంసారము యొక్క ఆవరణమును గూర్చిన సంకల్పము కలిగి వుండుటయే బంధము. కర్తృత్వాదులు, అహంకారము – వీటిని గూర్చిన సంకల్పమే బంధము. అణిమాది అష్టైశ్వర్యములను గూర్చిన ఆశ, వాటిని గూర్చి చేసెటి సంకల్పమే బంధము. కనుక కేవలము సంకల్పము మాత్రముచే బంధము కలుగును.

కనుక బంధము వీడవలెనన్న సంకల్పము క్షయము కావలెను. సంకల్పము క్షయము ఎట్టులగును?

'నిత్యానిత్య వస్తు విచార దనిత్య సంసార సుఖదుఃఖ విషయ సమస్త క్షేత్ర మమతా బంధక్షయో మోక్షః' (నిరాలంబోపనిషత్).

అనగా నిత్యానిత్య వస్తువిచారణచే అనిత్యములైన సంసార సుఖ దుఃఖ విషయములగు సమస్త వస్తువులయందు మమకారము నశించుటయే మోక్షము. కనుక బ్రహ్మము(ఎరుక)ను స్థాన, స్వరూప, స్వభావ నిర్ణయంగా తెలుసుకున్నవాడికి, ఎరుకయే నిత్యముగానూ, అనిత్యముగానూ కనపడుచున్నదనియూ దాని వలననే సుఖ దుఃఖ రూపమైన సంసారము కలుగుచున్నదనియూ తెలియబడును. అట్టివానికి సమస్త విషయములందు గల మమత నశించి అనగా సమస్త సంకల్పములు క్షయించి, మోక్షము కలుగును. కనుక సంకల్ప క్షయమే తత్వము అని వేమన వక్కాణించుచున్నాడు. కాని సమస్త సంకల్పములకు ఆ ఎరుకే మూలము. కనుక ఎరుకను విడిచిన వాడికే బంధమూ లేదు, మోక్షమూ లేదు అని సిద్ధాంత నిర్ణయం.

**కం॥ బట్ట బయలైన బ్రహ్మము**
**గుట్టును మదినెంచి లోన గుణపడినంతన్**
**దిట్టముగ జగము గిట్టును**
**దిట్టరివై తెలివి మరచి తిరుగుము వేమా ॥ 137**

బట్టబయలైన బ్రహ్మము(పరిపూర్ణ బ్రహ్మము) యొక్క గుట్టును మదిలో నెంచి, తన గుణములను సరియగు మార్గములో పెట్టవలెను. అట్టివానికి బ్రహ్మమయమైన జగము భ్రాంతియని తెలిసి గిట్టును. అటుపై ఏ జ్ఞానముతో బట్టబయలైన బ్రహ్మమును తెలుసుకొన్నావో, ఆ జ్ఞానము(ఎరుక)ను కూడా పారవేసి ప్రవర్తించుము అని వేమనయోగి ప్రబోధించుచున్నాడు.

**కం॥ భావాభావము లంటక**
**సేవించెడు బట్టబయలు స్థిరమతిలోనన్**
**కేవల శివ పరధ్యానము**
**తావరమును గన్నవాడె ధన్యుడు వేమా ॥ । 38**

భావము, అభావములను అంటక వున్నది ఏది? బట్టబయలు(పరిపూర్ణ బ్రహ్మము). కేవల శివ, పరధ్యానము, తావరము ఏది? ఆ పరిపూర్ణ బ్రహ్మమే. దానిని స్థిరమతితో కన్నవాడే ధన్యుడు. ఆ ధన్యుని నడక ఎలా వుండాలి. భావాభావములంటక సేవించవలెను. భావ శబ్దమునకు అభావము వ్యతిరేక శబ్దము. భావము అనగా తలంపు, ఆలోచన అని సామాన్య అర్థము. వేదాంత పరిభాషలో భావమనగా నేమి? సత్త, అస్తిత్వము(వునికి) కలిగి వున్నది. అభావమనగా వునికి లేనిదని అర్థము. కనుక భావాభావములనగా అస్తినాస్తులు అని గ్రహించవలెను. తత్వము తెలియని వాడికి లేని ఎరుక ఉనికి కలిగియున్నట్లు కనబడుతుంది. ఇది భావము. ఇక తత్వ విచారణ చేసినవాడికి ఎరుకకు ఉనికి లేదని తెలియును. ఇది అభావము. కనుక భావాభావములు ఎవరికి వున్నవి? ఎరుకకే. కనుక భావాభావములంటక సేవించవలెను. అనగా ఎరుకకు అంటక సేవించవలెను (ఎరుకలేక సేవించవలెను). అనగా ఎరుకను విడిచి ప్రవర్తించవలెను అని వేమన బోధించుచున్నాడు. దీని అంతరార్థమేమి? తామరాకు నీటి యందే పుట్టీ, పెరిగీ, నీటిని అంటక యుండును. అటులనే ఎరుకలోనే పుట్టీ, పెరిగీ, ఎరుక తత్వమును పూర్తిగ తెలుసుకొని, దానికి అంటకుండా తిరిగినప్పుడే దానిలోనే ముక్తి. ఎరుకకు అంటకుండా ఎలా నడుచుకొనుట? నేను కర్తను అనుకొని కర్మలను ఆచరిస్తే, ఆ కర్మ ఫలాలను అనుభవించుటకు మళ్ళీ జన్మించాల్సి ఉంటుంది. కనుక ఆ పరిపూర్ణ బ్రహ్మము నందు నేనే లేనని, త్రికరణశుద్ధియుత కర్తృత్వ రహిత కర్మాచరణ చేయుటయే ఎరుకకు అంటక నడుచుకొనుట అగును. అదియే ఎరుకను విడిచిన విధానము. ఈ విధానంలో నడచిన వాడికి బంధమూ లేదు, మోక్షమూ లేదు. ఆతడు ధన్యుడని వేమన ప్రవచించుచున్నాడు.

ఆ॥ నీటిలోని వ్రాత నిలువక యున్నట్లు
పాటి జగతి లేదు పరము లేదు
మాట మాట కెల్ల మనసు గోరుచునుండు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 139

నీటిలోన వ్రాసిన వ్రాత నిలుచునా? నిలువదు. అటులనే జగత్తు మరియు పరము( బ్రహ్మము) లేదు. ఉన్నట్టు భ్రమ మాత్రమే. ఉన్నది ఒక్కటే. అదియే పరిపూర్ణబ్రహ్మము. కల్లు త్రాగిన కోతికి తేలు కుట్టినచో అది ఎలా వుంటుందో, మనిషి మనసు అలానే వుంటుంది. ఎవరు ఏమి చెప్పినా మనసు ఆ వైపు మళ్ళుతుంది. వివిధ శాస్త్రాలవైపు పరుగులు పెడుతుంది. నాట్యాలాడుతుంది. కనుక అటుల మనసును పోనీయక ఈ విషయాన్ని దృఢ పరచుకో అని వేమన వచించుచున్నాడు.

ఆ॥ ఆశల దెగ గోసి యనలంబు చల్లార్చి
గోచి బిగియ బెట్టి కోప మడచి
గుట్టు మీరువాడు గురువుకు గురువురా
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 140

ఆశ నెరవేరనప్పుడు ఆ ఆశయే క్రోధమగును. అదే అనలము. కనుక ఆశను కోసివేసినప్పుడే ఆ అనలము చల్లారును. గోచి అనేదే అభిమానము. అభిమానమును నిగ్రహించినపుడే కోపము అణగి పోవును. ఆ అభిమానము అహంకారము వల్లనే కలుగుచున్నది. ఆశలు, అహంకారము బ్రహ్మము వల్లనే కలుగుచున్నవి. కనుక ఆశలకు, అభిమానమునకు మూలమైనది, ఆశయ స్థానమైనది ఆ బ్రహ్మమే (గురువే) నని తెలిసికొని దానిని మీరువాడే గురువుకు గురువని వేమనయోగి ప్రవచించుచున్నాడు.

ఆ॥ ఇందు నెరుకవాని కిహ పరములు లేవు
ప్రాణహాని లేదు ప్రళయమునకు
ప్రళయ కాలమైన పరమాత్ము గలయురా
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 141

ఎరుక తత్త్వమును పూర్తిగా తెలిసికొన్నవానికి ఇహమూ లేదు, పరమూ లేదు. వున్నది పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే. తానే లేననే విషయం తెలిసికొని వుండును గనుక వాని ప్రాణమునకు ప్రళయమునందైనను హాని వుండదు. ఇది తెలియని వాడు ఏ సాధనలు లేకుండానే ప్రళయ కాలమందు పరమాత్మనే కలియగలడని వేమనార్యుడు బోధించుచున్నాడు.

**కం॥ కర్మము జ్ఞానికి దవ్వగు**
**కర్మమునకు జ్ఞాని దవ్వు కలియుగమందున్**
**కర్మ జ్ఞానములను విడు**
**నిర్మలునకు గలుగు ముక్తి నిజముగ వేమా॥ 142**

జ్ఞాన కర్మములు రెండు ఒకదానొకటి విడువకనే యున్నాయి. రెండూ ఏక స్వరూపమే. జ్ఞానేంద్రియముల ద్వారా విషయాదులను గ్రహించి మానవుడు కర్మేంద్రియముల ద్వారా కర్మ చేయుచున్నాడు. జ్ఞానమునుసరించి కర్మ, కర్మననుసరించి జ్ఞానము వున్నాయి. జ్ఞానము లేక కర్మలేదు. కర్మ లేక జ్ఞానము లేదు. జ్ఞానమే కర్మ, కర్మమే జ్ఞానము. ఈ రెంటి వల్లనే సమస్త విశ్వమేర్పడినది. ఈ జ్ఞాన కర్మముల ముడియే ఎరుక. ఈ ఎరుక యున్నంత వరకు చావు పుట్టుకలు తప్పవు. కనుక అంతటా నిండి వున్న పరిపూర్ణ బ్రహ్మమునందు ఎరుక లేమిని తెలిసికొని, దానిని విడిచిన నిర్మలునికే ముక్తి కలుగునని వేమన యోగి బోధించుచున్నాడు.

**ఆ॥ ఒక్క ఘటములోన బెక్కు రూపులు నిల్చు**
**యెన్ని యెన్ని రూపు లెసగు చుండు**
**నదియు దొలగెనేని యన్నియు బయలౌను**
**యాత్మ తత్త్వ మిట్టు లవుర వేమ ॥ 143**

నీటికుండలో ఎన్నెన్నో ప్రతిబింబాలు కనిపిస్తూ ఉంటాయి. ఈ ప్రతిబింబములు ఎంతవరకు కనిపిస్తూ ఉంటాయి? నీటి కుండ వున్నంత సేపు దానిలో ప్రతిబింబములు కనిపించుటకు అవకాశము కలదు. ఆ నీటికుండే లేకుండా పోయినచో ఆ ప్రతిరూపాలన్నియూ శూన్యమౌను (బయలౌను). అటులనే ఆత్మ వున్నంతసేపు అనేక రకాలైన ప్రతిబింబములతో కూడిన జగత్తు కనిపిస్తూనే యుండును. ఎప్పుడైతే ఆత్మయే లేకుండా శూన్యమై పోతుందో, అప్పుడే జగత్తు లేదు, ఆత్మయూ లేదు. ఉండేది, ఆ పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే అని వేమన ఆత్మతత్త్వమును సోదాహరణముగా వచించుచున్నాడు.

ఆ॥ కుక్క దిన్న వాడు గురులింగ జంగంబు
పంది దిన్న వాడు పరమ యోగి
యేన్గు దిన్న వాడు యెంత సుజ్ఞానిరా!
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 144

కుక్క ముఖ్యంగా మాంసమును ఇష్టంగా తినును. కనుక కుక్కకు రజోగుణము వున్నదని నిర్ణయం. కనుక కుక్కదిన్న వాడు అనగా రజోగుణాన్ని తిన్నవాడు అనగా రజోగుణాన్ని అతిక్రమించిన వాడు గురులింగ జంగము. పంది మలిన పదార్థాలను తినును. కనుక పందికి తమోగుణము వున్నదని నిర్ణయం. కనుక పందిని తిన్నవాడు అనగా తమోగుణాన్ని అతిక్రమించినవాడు పరమయోగి. యేనుగు ఆకులలములను తినును. మాంసమును తినదు. కనుక యేనుగుకు సత్వగుణము వున్నదని నిర్ణయం. కనుక యేనుగును తిన్నవాడు అనగా సత్వగుణంను అతిక్రమించిన వాడు సుజ్ఞాని అని వేమన ప్రబోధిస్తున్నాడు. ఇచట త్రిగుణములను అతిక్రమించుమని వేమన పరోక్షంగా ప్రవచించుచున్నాడు.

దీనినే శ్రీకృష్ణభగవానుడు ' త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున' అని తెలియజేసెను. వేదములు త్రిగుణములతో కూడుకొని వున్నవి. కనుక త్రిగుణములను అతిక్రమించుమని అర్జునునికి శ్రీకృష్ణపరమాత్మ బోధించి యున్నాడు. కనుకనే ' త్రిగుణంబులుడుగంగ ముక్తి గదరా వేమ' అని వేమన కూడా తెలిపి వున్నాడు.

త్రిగుణములకు కారణమైనదే అహంకారము(బ్రహ్మము). అహంకారమే ఊర పంది అని శ్రీశివరామదీక్షితులు బోధించి ఉన్నారు. కనుక అహంకారము ( ఎరుక)ను రహితము చేసుకొనిన వాడే పరమయోగి అని సిద్ధాంత నిర్ణయం.

ఆ॥ కాశి యాత్రజేసి గాసి జెందగనేల?
రోసి గుణ వికార రూపడంచి
మోసపోక ఎరుక మూలంబు గనువాడు
గాసి జెంద బోడు ఘనుడు వేమ ॥ 145

కాశీ రామేశ్వరాది పుణ్యక్షేత్రములను దర్శించుటకు పోయి మానవుడు అనేక కష్టములను అనుభవించుట ఏల? అందువలన సత్య విషయం బోధ పడదు. ముక్తి లభించదు. కనుక యాత్రలను రోసి అనగా చీదరించుకొని వదలి పెట్టవలెను. యాత్రలు అనునవి గుణరూపములతో కూడుకొని వున్నవి.

కనుకనే శ్రీకృష్ణ భగవానుడు గీతలో

**'శ్లో॥ త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగ క్షేమ ఆత్మవాన్ ॥ '**

అని బోధించాడు. కనుక సత్వరజస్తమో గుణముల మూడింటిని ఏకరూపముచేసి, అదే ఎరుక మూలముగా గాంచిన వాడు సర్వద్వంద్వములకు, యోగక్షేమములకు ఈ త్రిగుణాలే కారణమని యెంచి త్రిగుణాలను అతిక్రమించును. అట్టివాడే ఆత్మను చక్కగా తెలిసికొన్నవాడు కాగలడు. ఆతడే త్రిగుణాలకు, సర్వ ద్వంద్వములకు మరియు యోగక్షేమములకు అతీతమై నిత్యమై సత్యమై యున్న పరిపూర్ణ బ్రహ్మమును దర్శించగలడు. అట్టి వానికి మరల జన్మ ఉండదు. ఆతడే ఘనుడని వేదాతీతుడైన వేమన ఉద్ఘాటించుచున్నాడు.

'గుణరూప విహీనత్వా గురురిత్యభిదీయతే' (గురు గీతలు) – గుణరూపములను అణచివేయువాడే గురువు. కనుక సద్గురువును చేరి గుణరూపములను అణచివేసి, ఎరుక మహిమలకు మోసపోక, ఎరుక మూలమును కనుగొనుమని వేమన చెప్పుచున్నాడు.

**ఆ॥ వ్రతము లెన్నియైన వట్టి చిక్కులె కాని**
**యాత్మ చిక్కు గాన నలవి గాదు**
**ఆత్మ చిక్కు బాపు నతడె పో ఘనయోగి!**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **146**

అనేక దేవతా వ్రతములు ఎన్ని చేసినప్పటికినీ వాటి ద్వారా ఆత్మ స్వరూపము తెలియబడదు. పైగా అవి వట్టి చిక్కులే కాగలవని వేమన బోధించుచున్నాడు. ఆత్మ చిక్కు వ్రతాల ద్వారా తొలగించబడదు. ఆత్మ ఎలా చిక్కు? అని ప్రశ్నవస్తుంది. 'బీజం మాం సర్వభూతానాం' – ఆత్మయే సర్వభూతములకు బీజము.

ఉదాహరణకు ఒక విత్తనమును తీసుకుని, ఆ విత్తనమును భూమిలో విత్తిన తర్వాత అదియే వృక్షమై, శాఖోపశాఖలుగ, ఆకులతో, పువ్వులతో, ఫలములతో వర్ధిల్లుతుంది. విమర్శించి చూడగా ఈ శాఖోపశాఖలు, ఆకులు, పువ్వులు, కాయలు, ఫలములు వేర్వేరుగా వృక్షరూపముగా వున్నప్పుడు తెలియబడుచున్నవి. కాని అవన్నియు బీజము నుండియే వచ్చినవి. కనుక ఆ బీజమునందు వీటిని చూడబోయినచో అక్కడ అవి చిక్కుగా తెలియబడును. కాని వేర్వేరుగా స్పష్టముగా తెలియబడవు. అదే విధముగా సమస్తమునకు కారణమైన ఆత్మ చిక్కుగా వున్నది. ఆ చిక్కును బాపుట సాధారణ మానవులకు సాధ్యముకాదు. అది బీర పీచుల చిక్కులాంటిది. కనుక ఆ చిక్కును బోధాగ్నిచే బాపువాడే ఘనయోగియని వేమన ఢంకా మ్రోగించి పలుకుచున్నాడు.

**ఆ॥ ఉప్పు కప్పురంబు నొక్క పోలికె నుండు**
**చూడ జూడ రుచుల జాడ వేరు**
**పురుషులందు పుణ్యపురుషులు వేరయా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** 147

ఉప్పు, కప్పురము రెండూ చూడటానికి ఒకే రకంగా కనిపించును. అయితే వీటికి భేదము ఎక్కడ తెలియబడును? కప్పురమునకు అగ్ని అంటించినచో వెంటనే అంటుకొని కాలి(వెలిగి) పోయి కర్పూరమే లేకుండా పోతుంది. బూడిద కూడా మిగలదు. కాని ఉప్పు అలాకాదు. అగ్ని దానికి అంటుకొనినను, అది వెలుగదు. చిటపట మని మాడి మసి అగును.

ఎందుచేతననగా, కర్పూరము శుద్ధిచేయబడివుంటుంది. కనుక సులభంగా అగ్నికి ఆహుతై పోతుంది. ఉప్పు అలాకాక పోవటానికి కారణం శుద్ధిగా లేకపోవటం, మలిన పదార్థాలతో కూడుకొని వుండటం.

అలాగే పురుషులలో పుణ్యపురుషులు వేరు అని వేమన చెప్పుచున్నాడు. ఎలా? త్రికరణశుద్ధిగా నడుచుకొనుచున్న పురుషుల అంతఃకరణములు విషయాదులతో మలినముగాక శుద్ధిగా వుంటాయి. వీరే పుణ్యపురుషులు. ఈ పుణ్యపురుషులు పూర్ణ గురువైన వేమన ఇచ్చు బోధాగ్ని యందు పూర్తిగా దగ్ధమై తామే లేకుండా బోవుదురు. అట్టివారే ఆత్మశుద్ధిని మరియు చిత్తశుద్ధిని పొందగలరు.

కనుక వారికి జనన మరణము లుండవు. కనుక వేమనను ఆశ్రయించిన పుణ్యపురుషులకు ఇహమున భుక్తి, పరమున ముక్తి కలుగును.

**ఆ॥ ఎరుక బ్రహ్మమనియె యిల శంకరార్యులు**
**తెలివి బ్రహ్మమనుచు తెలిపె వ్యాసు**
**లెరుక తెలివి రెంటి నెరుగడు వేమన**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 148**

( అచల సాంప్రదాయకుల నోటనున్న వేమన పద్యము)

సర్వ సృష్టికి మూలమై, బ్రహ్మజగత్తులుగా, జీవేశ్వరులుగా, సగుణ నిర్గుణాలుగా, సదసత్తులుగా, విద్యావిద్యలుగా, ప్రకాశాప్రకాశాలుగా మొదలగు సర్వ ద్వంద్వములుగా కనిపించుచున్న ఎరుకనే 'బ్రహ్మము' అని శంకరాచార్యులు చెప్పియున్నారు. జ్ఞానమే 'బ్రహ్మము' అని వ్యాసులవారు చెప్పియున్నారు. 'సత్వాత్సంజాయతే జ్ఞానం' అని వున్నది. కనుక ఎరుక అనే తెలివి వున్నంత వరకు జనన మరణములుండియే వున్నవి. 'కర్మ బ్రహ్మోద్భం విద్ధి' అని వున్నది. కనుక బ్రహ్మమున్నంత వరకు కర్మ శరీరం యుండియే యుండును. కనుకనే వేమన ఈ ఎరుక, తెలివి అనే రెండింటిని విడిచి వున్నాని చెప్పుచున్నాడు.

**ఆ॥ విత్తులేని యట్టి వృక్ష మొక్కటి బుట్టె**
**ఫలము పువ్వు మొగడ పత్రి లేదు**
**స్వాదు లేదు చూడ సాపాటుకును లెస్స**
**దీని భావమేమి తెల్పు వేమ ॥ 149**

'విత్తనమే పరమాత్మ, వృక్షమే ప్రకృతి' అని గీతా వాక్యము. విత్తనం లేని వృక్షము ఒక్కటి పుట్టెను. దానికి మొగ్గ, పువ్వు, పత్రి, ఫలములు ఏమియూ లేవు. లెస్సగా విచారించి చూడగా వృక్షమే లేదు. దీని భావమేమి? వృక్షమనగా ఏ వృక్షము? ఆ వృక్షమునకు బీజమేది? క్షేత్రమేదీ? అని విచారించవలెను.

ఋగ్వేదమునందు విశ్వమే ఒక వృక్షముగా చెప్పబడినది. బ్రహ్మవనమందలి బ్రహ్మయను వృక్షము యొక్క కర్రతో ఈ పృథ్వీ ఆకాశములు చెక్కబడినవి. గీతయందు కూడ ఈ వృక్షమునే

అశ్వత్థవృక్షం అని చెప్పబడివుంది. కనుక బ్రహ్మమే బీజముగా వున్న ఈ వృక్షమునే సంసార వృక్షమని తెలియవలెను. 'తస్మాద్వా ఏతస్మాదాత్మనః ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృథ్వీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోన్నమ్ అన్నాత్పురుషః' అను తైత్తిరీయ శ్రుతి యొక్క సృష్టి క్రమమునను సరించి బ్రహ్మమును బీజముగా, బ్రహ్మాండమును వృక్షముగా తెలియవలెను. పాలపుంతలు, నక్షత్రాలు, గ్రహాలు ఆ చెట్టుకు కాండము, శాఖలు, ఉపశాఖలు. భూమిలాంటి గ్రహాలే దాని పుష్పాలు. భూమిపై నున్న **84** లక్షల జీవోపాధులే ఆ వృక్షమునకు కాచిన ఫలములు. జీవోపాధుల జనన మరణ రూప సంసార మంతయూ ఈ వృక్షమునందే జరుగుచుండుటచే దీనినే సంసార వృక్షమనిరి. దీనికి నిమిత్త ఉపాదాన కారణములు, క్షేత్ర బీజములు అన్నీ ఆ బ్రహ్మమే. కనుకనే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని నిర్ణయం.

'బీజం మాం సర్వభూతానాం' = సకల భూతములకు బీజమును నేనని భగవానుడు భగవద్గీతలో బోధించియున్నాడు. కనుక సర్వభూతములకు అనగా సర్వసృష్టికి ఆత్మయే బీజము. అయితే ఈ సంసార వృక్షానికి బీజం లేదనుట ఎలా?

పిల్లకు కారణం తల్లి. ఆ తల్లికి కారణం ఆమె తల్లి. ఆమె తల్లికి కారణం మరొక తల్లి వుండి తీరాల్సిందే. కనుక ఈ విధంగా కార్య కారణ పరంపర అనంతంగా సాగిపోతుంది. కనుక తృణాది బ్రహ్మ పర్యంతము కార్యకారణములను చెప్పుచూ పోవచ్చును. కాని ఆ బ్రహ్మమునకు కారణము కానరాదు. కనుక దానికి మూలము లేదని చెప్పారు. సత్యమైనది, నిత్యమైనది ఏది కలదో; అది దేనికి కారణమూ కాదు, కార్యమూ కాదు. అదే పరిపూర్ణ బ్రహ్మము. సర్వలక్షణ విలక్షణమైనది. కనుక సర్వమునకు కార్యకారణ రూపముగా వున్న బ్రహ్మము (ఎరుక) అన్నింటికీ బీజస్వరూపముగా వున్నది. అట్టి బీజరూపముగా వున్న బ్రహ్మమునకు మూలం లేదు, కనుక దానికి బీజం లేదు.

కారణకార్యములు సత్యమైన, నిత్యమైన దాని యందు వుండవు. కనుక కారణకార్యరూపంగా వున్న బ్రహ్మము సత్యము కాజాలదు. అది మిథ్యా స్వరూపమైనది. కనుక మిథ్యా స్వరూపమైన బ్రహ్మమునుండి తయారైన సంసార వృక్షము కూడా మిథ్యయే అగును. కనుక కార్యరూపముగా సంసారవృక్షమునందు కనపడే తరు కాండ శాఖా ఫలపుష్పాదులు అన్నియూ మిథ్యయే అగును. ఈ భావమునే వేమన పై పద్యంలో ఇమిడ్చి వున్నాడు. ఈ భావమునే

'శ్లో॥ అబీజం వృక్ష సంపన్నం శాఖా పల్లవ వర్జితం।
పుష్పం నాస్తి ఫలం నాస్తి సంపూర్ణం వృక్ష వర్జితం ॥ '

అను భ్రాంతి రహిత శ్లోకము తెలుపుచున్నది.

ఆ॥ ఆత్మశుద్ధిలేని యాచార మదియేల?
భాండశుద్ధిలేని పాకమేల?
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 150

భాండశుద్ధిలేని పాకము ఆరోగ్యానికి హానికరం. అలానే ఆత్మశుద్ధి మరియు చిత్తశుద్ధి లేని ఆచారాలు, పూజలు జన్మకు కారణం.

చిత్తమే క్షేత్రము. ఆత్మయే క్షేత్రజ్ఞుడు. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల వల్లనే సమస్త విశ్వము ఏర్పడినది. విశ్వమునందు వున్న సర్వదోషములకు క్షేత్ర క్షేత్రజ్ఞులయందున్న దోషములే కారణము. జననమరణ భ్రాంతికి మూలకారణము కూడా ఈ క్షేత్రక్షేత్రజ్ఞులే. కనుకనే అచలయోగులు క్షేత్రక్షేత్రజ్ఞ ద్వయదోషరహితమైన అచల పరిపూర్ణ బ్రహ్మమును ఎరిగి, క్షేత్ర క్షేత్రజ్ఞ ద్వయదోషరూపమైన ఎరుకను వదలుటకు ఆత్మ శుద్ధి మరియు చిత్త శుద్ధి సాధించవలెనని, అందుకొరకు శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, అహంకార అభిమాన శూన్యములైన ఇంద్రియములచేతను అధిష్ఠానరూప సమిష్ఠి కర్మాచరణ యందుండి త్రికరణశుద్ధిగా కర్మలను లోక కళ్యాణము గూర్చి చేయుచున్నారని శ్రీ వేమనయోగి ప్రబోధించుచున్నాడు. దీనినే గీతాచార్యుడు

'శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మ శుద్ధయే॥'

అని చెప్పియున్నాడు.

ఆ॥ మొనసి యింద్రియముల మొదట నిల్పగలేక
సమసి పోవు వేళ సన్యసించు
యాత్మశుద్ధి లేక నంటునా మోక్షంబు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 151

మానవుడు తన ఇంద్రియములను మొదట స్వాధీనములో వుంచుకోలేక అనేక చెడు కర్మలను ఆచరించును. జీవిత చరమ దశలో దేవుడిని తెలిసికోవాలనో, ముక్తిని పొందాలనో మానవుడు సన్యసించుచున్నాడు. అందువల్ల ప్రయోజనంలేదని వేమన తెలుపుచున్నాడు. ఆత్మశుద్ధి లేక మానవుడు మోక్షమును పొందలేడని వేమనయోగి వచించుచున్నాడు.

**తే॥ రజ్జు సర్పంబుగా దోచు రక్తిగాను**
**స్థాణు పురుషుడు గా దోచు సందునెరిగి**
**లోన నెరుకను జయమందబూనవలెను**
**విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య ॥ 152**

ఎరుకయే మిథ్యా స్వరూపమైనది. కనుక ఎరుకలేదని అచల సిద్ధాంతము. ఎరుక భ్రాంతి రూపముగా యుండి తోచుచున్నదే గానీ, ఎరుకనే వస్తువుకు ఉనికి లేదు. ఎందుకనగా సర్వత్రా నిండి నిబిడీకృతమైన పరిపూర్ణ బ్రహ్మమునందు ఎరుకకు స్థానమూలేదు, మూలమూలేదు. కనుక ఎరుకయును, దాని కార్యరూపమైన సమస్త విశ్వమును కూడా ఈ పరిపూర్ణ బ్రహ్మమునందు తోచియుండ వలెను. కనుక పరిపూర్ణ బ్రహ్మము ఎరుకకు ఆధారమూ, అధిష్ఠానమూ కాదా? అని అనుమానం రావచ్చును. అది నిజము కాదు. ఎరుకే ఎరుకకు ఆధారమూ, అధిష్ఠానమూ అయివున్నది. రజ్జు సర్పము, స్థాణు పురుషుడు వలె ఎరుక తనంతట తానే తనయందే, తాను తోచుచున్నది. (పరిపూర్ణ బ్రహ్మమునందు ఎరుక లేకనే). కాని పరిపూర్ణ బ్రహ్మము ఈ లేనెరుకకు వివర్తోపాదాన కారణము కాదు. ఎందుకనగా పరిపూర్ణ బ్రహ్మము సర్వ లక్షణ విలక్షణమైనది. అది ఏమియూ కానిది. దానియందు ఎటువంటి సాదృశ్య, సారూప్యాది దోషములు లేవు. కనుక పరిపూర్ణ బ్రహ్మము ఏ విధంగానూ వివర్త రూపం చెంద జాలదు. కనుక ఎరుకకు ఈ పరిపూర్ణ బ్రహ్మము అధిష్ఠానమూ కాదు, ఆధారమూ కాదు. పరిపూర్ణ బ్రహ్మమునకు, ఎరుకకు ఎలాంటి సంబంధము లేదు. రెండింటికి అత్యంత విభిన్నత్వం వుంది. ఎరుకయే వివిధ నామరూపాత్మక జగత్తుగా మారి, అనేక వస్తువులుగా భాసించుచున్నది. కనుక అందులో నొక దానిని చూచి మరొక దానిగా భ్రాంతిపడుటకు అవకాశమున్నది. కనుక భ్రాంతి పొందింప చేయు అధిష్ఠాన వస్తువు, భ్రాంతి జన్యవస్తువు రెండూ కూడా ఎరుకలోనివే. అందొకటి నిత్యమగు బ్రహ్మము, మరొకటి అనిత్యమగు జగత్తు కావు. ఎరుకయే సదసత్తులు, నేను మేనులు,

జీవేశ్వరులు, జ్ఞానాజ్ఞానములు, అధిష్ఠాన అవ్యక్తములు మొదలగు ద్వంద్వ స్వరూపములుగా నుండి, ఆ ద్వంద్వ స్వరూపంలో ఒకటి మరొక దానికి ఆధారముగానో లేక అధిష్ఠానముగానో వున్నది. ఒకటి కారణముగానూ, రెండవది కార్యరూపముగానూ వున్నాయి. ఈ రెండింటి మధ్య వున్న సందునెరిగి, మాయాస్వరూపమైన ఎరుకను జయించ పూనవలెనని అచలర్షి వేమనయోగి బోధించుచున్నాడు.

**ఆ॥ తానె తత్వమనుచు దన్నెరుంగగ లేక**
**మాయ తత్వమనుచు మరుగుచుండు**
**ధర్మకర్మములను తగరోయ తత్వమౌ**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 153**

తానే తత్వమనుచు(మాయయనుచు) తన్ను తెలుసుకోలేక మాయ జగమనుచు(తత్వమనుచు) కొందరు చెప్పుచుందురు. ధర్మకర్మములను తగరోయ తత్వమౌ అని వేమన తన పరిపూర్ణ సిద్ధాంతమును ఈ పద్యములో ఇమిడ్చి ఉన్నాడు.

విశేషార్థము :- తత్వం = తత్ + త్వం
తత్ = బ్రహ్మము, త్వం = జీవుడు

జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడు అని తెలుసుకొనుటే తత్వము. సర్వ ప్రపంచము బ్రహ్మమేనని తత్వనిర్ణయం. అలాగాక కొందరు ఈ ప్రపంచం ఎలా వచ్చినది? అంటే మాయ వలన అనిరి. అది నిజం కాదని వేమన చెప్పుచున్నాడు. ఆత్మానాత్మలు, ప్రకృతి పురుషులు, ఆకార నిరాకారములు, సదసత్తులు, నేను మేనులు, జీవేశ్వరులు, ఇహ పరములు మొదలగు సర్వద్వంద్వములన్నియూ బ్రహ్మమే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ'. అయితే అట్టి బ్రహ్మమునుండి ముక్తి ఎలా?

ధర్మకర్మములను విడుచుటే ముక్తి. ఇదే వేమన పరమ సిద్ధాంతము. ధర్మము అనగా నేమి? 'ధార్యతే ఇతి ధర్మః'. ఏది ధరించి భరించునో అదియే ధర్మము. ఈ అనంత కోటి బ్రహ్మాండములను ధరించి, భరించునది ఏది? సర్వశక్తులు గల ఆ బ్రహ్మమే(ఎరుకే). కర్మము అనగా నేమి? కర్మము అనగా పని. అయితే కర్మము ఎలా కలిగినది?

'శో॥ కర్మబ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం।
తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥' (భగవద్గీత)

కర్మము బ్రహ్మము (ఎరుక) నుండియే కలిగినది. కనుక ధర్మము, కర్మము రెండూ ఆ బ్రహ్మమే (ఎరుకే). కనుక ఆ ఎరుకను విడుచుటే జననమరణ భ్రాంతి రాహిత్యమునకు ఏకైక మార్గము.

కనుకనే శ్రీ కృష్ణపరమాత్మ గీతయందు

'శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వాం సర్వ పాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః ॥'

అని బోధించి యున్నాడు.

ఈ శ్లోకము త్యాగమును గూర్చి చెప్పుచున్నది. తాను తన వద్దగల వస్తువులను త్యజించుట త్యాగమని సామాన్య అర్థము. కాని అది త్యాగమునకు సంపూర్ణ అర్థము కాదు. ఏల? తాను ఉన్నప్పుడు మళ్ళీ తాను త్యజించిన వస్తువులను గ్రహించుటకు అవకాశం కలదు. కనుక సర్వమును త్యజించిననూ కూడా మిగిలిన వున్న తన్ను తాను కూడా త్యజించుటే త్యాగానికి సంపూర్ణార్థం. కనుక ధర్మకర్మములను విడుచుట అనగా తన్ను తాను తెలిసికొని తానే ఎరుకయను మాయయని త్యాగము చేసుకొనుటే. అనగా ఎరుక(బ్రహ్మము)ను విడుచుటే ముక్తి అని వేమన ప్రబోధించుచున్నాడు.

ఆ॥ మాయలోక మన్న మర్మంబు దెలియక
మాయ జిక్కి యంత మాయబడిరి
మాయ దెలియ దివ్యమాయరా జన్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ ।54

ఇహపరములు ఒక్కటిగా నున్న లోకమే 'మాయ' అను మర్మమును తెలిసికోలేక, మానవులందరు ఈ ఎరుక(బ్రహ్మము) అనే మాయయందే చిక్కుకొని మాయమై యున్నారు. ఇది ఎలా వుంది అంటే, పట్టు పురుగు తన నుండియే దారము తీసికొని, తన చుట్టే అల్లుకొని,

తానే తనయందు బంధించుకొన్నట్లుగా, ఈ ఎరుకయనే మాయనే సర్వమును తన నుండియే సృజించుకొని, తానే ఎరుకయను మాయయందు జిక్కుకొని వున్నది. ఈ మాయను గురువు ద్వారా తెలిసికొన్నవాని జన్మము ధన్యమౌనని వేమన వక్కాణించుచున్నాడు.

**ఆ॥ సతులు సుతులు మాయ సంసారములు మాయ**
**ధనము ఘనము మాయ తనువు మాయ**
**మాయ గెల్చువాడు మర్మజ్ఞుడగు యోగి**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 155**

ఈ ఎరుకయనే మాయయే భార్యా బిడ్డలు. సంసారములు కూడా ఈ ఎరుకయనే మాయయే. ధనము మరియు కీర్తి ప్రతిష్ఠలు కూడా ఈ ఎరుకయనే మాయయే. శరీరము కూడా ఈ ఎరుకయనే మాయయే. ఒక్కటేమిటి? ఆ అచల పరిపూర్ణ బ్రహ్మము తప్ప సర్వము మాయయే. మాయ యనగా ఏదైతే లేనిదో అదియే మాయ. 'యామా సా మాయ'. కనుక ఎరుక తత్వమును గురువు ద్వారా గుర్తెరిగి ఎరుకై నిలిచి, ఆ ఎరుకయే మాయయను మర్మమును తెలిసికొని, ఆ ఎరుకను విడిచి వర్తించు వాడే ఎరుకను గెల్చిన మర్మజ్ఞుడగు యోగి యని అచలయోగి వేమన ప్రవచించుచున్నాడు.

**ఆ॥ బ్రతుకు టెల్ల మాయ భవబంధములు మాయ**
**తెలివి మాయ తన్ను దెలియ మాయ**
**మాయ దెలియువాడు మర్మజ్ఞుడగు యోగి**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥ 156**

ఎరుకయనే మాయకు ఉనికిలేదు. కనుక నేను బ్రతికివున్నాని తలంచుట కూడా మాయయే. ఆ అచల పరిపూర్ణ బ్రహ్మమునందు నేననే ఎరుక లేనే లేదు. కనుక భవము(పుట్టుక) కూడా లేనే లేదు. నేనే లేను కనుక ఇక బంధమూ లేదు, మోక్షమూ లేదు. ఇది తెలిసికోలేక, కొందరు మత వాదులు తెలివి (జ్ఞానము)నే బ్రహ్మమని నిలిపారు. కాని విచారించి చూడగా, 'సత్వాత్సంజాయతే జ్ఞానం' అని వున్నది. కనుక జ్ఞానమునకు కూడా పుట్టుక వున్నదని తెలియబడును. కనుక దానికి గిట్టుక కూడా వుండును. అందుచేత పుట్టి గిట్టే జ్ఞానము

మాయయేకాని అన్యము కాదు. ఇక ఆ జ్ఞానము నేను వేరు కాదు. కనుక నేనెవరోయని విచారించి చూడగా, నేను కూడా ఎరుకయనే మాయయే నని తెలిసికొని ఈ ఎరుకయనే మాయకు అంటక తిరుగువాడే మర్మజ్ఞుడగు యోగి యని వేమనయోగి బోధించుచున్నాడు.

కం॥ తామర యందున నీర్వలె
వేమన జరియించుచుండె వెదకుచు శివునిన్
ఈ మాయ నమ్మగా రా
దీ మనమున తెలియరాదు ఈశుని వేమా ॥ 157

తన గురువగు శివయోగిని అనుసరిస్తూ, తామరాకుయందు నీరు అంటకయుండునట్లు వేమన ఎరుకయందే తిరుగుచు, దానిని అంటక వర్తించుచున్నాడు. ఎరుకయనే మాయను నమ్మరాదని తెలుపుచున్నాడు వేమన. అనగా ఎరుక వున్నదని నమ్ముకునే వాడు ఎరుకయందే తిరుగును. ఈశ్వరుని రూపముగానున్న ఎరుక యొక్క మాయా శక్తి స్వయంగా మనస్సుచే తెలియరాదని వేమన చెప్పుచున్నాడు. కనుక గురువుని చేరి ఎరుకయను మాయను తెలిసికొని, ఎరుకను విడిచి, ఎరుకను అంటక, ఎరుకయందే ప్రవర్తించుమని వేమన బోధించుచున్నాడు.

ఆ॥ హంస మానసోద మంటక దిరిగిన
యట్లు కర్మచయము నంటకుండు
యోగి తిరుగు సకల భోగంబుతోడను
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 158

రాజహంస ఎట్టులనైతే మానసోదకము(మానస సరోవరము) నందు సంచరించుచు దైవికముగా తామర తీగలందు చిక్కుకొనియున్నను, నోటిచేత వాటిని కొరికి వేయుచు భయరహితమైన ఆకాశమునకు ఎగిరి విహరించునో, అట్టులనే రాజయోగియైనవాడు జనన మరణ భ్రాంతి రహిత అంతఃకరణ వృత్తి కలిగి, కర్మలయందు చిక్కుబడక సకల భోగముల తోడ ఎరుకయందు ప్రవర్తించుచున్నాడని వేమన యోగి ప్రవచించుచున్నాడు. దీనినే 'అస్పర్శ యోగము' అని శ్రీ దయానంద పొన్నాల రాజయోగీశ్వరుల వారు రచించిన భగవద్గీత వ్యాఖ్యానములో తెలియజేశారు.

తే॥ శ్రీకరంబుగ వేమన జెప్పినట్టి
పద్యముల నెవ్వడేనియు పఠనసేయు
నట్టి పురుషుడు మనమున నిట్టిదనుచు
జెప్పరానట్టి వస్తువు జేరు వేమ ॥ 159

స్వయం ప్రకాశ అధిష్ఠాన చేతన బ్రహ్మమును నిర్ణయించు వేమన చెప్పిన పద్యములను ఎవ్వరైతే చదివి, వాటియందు వున్న గూఢార్థమును గ్రహించుదురో, వారు ఇట్టిదట్టిదని మనస్సుచే ఊహించలేని, నోటితో చెప్పరాని అచల పరిపూర్ణ బ్రహ్మమును గాంచి ఇహమున సిరులు, పరమున ముక్తి బడయగలుగుదురని వేమనార్యుడు బోధించుచున్నాడు.

తే॥ అవును వేమన్న జెప్పిన యాత్మబుద్ధి
దెలియ లేనట్టి యజ్ఞాని దేబె లెల్ల
తలకు బాసిన వెంట్రుక వలెను జూడ
భుక్తి ముక్తులు హీనమై పోవు వేమ ॥ 160

ఈ విధంగా వేమన చెప్పిన ఆత్మ ( ఎరుక) తత్వమును తెలిసికోలేనట్టి అజ్ఞానులు తలనుండి బాసిపోయిన వెంట్రుక వలె భుక్తి ముక్తులు పొందలేక హీనమైన ఈ సంసార సాగరమునందే కొట్టు మిట్టాడుచుంటారని వేమన యోగి వేదాంత నిర్ణయం.

ఎనిమిదవ అధ్యాయం

# గురు ద్వయ మంత్రార్థ నిర్ణయం

వేమన యోగి గురు సాంప్రదాయం నందు రెండు మంత్రములు గురుపరంపరగా ఉపదేశించబడుచున్నవి. ఆ మంత్రములే వేమనయోగి అచల సాంప్రదాయకుడని చెప్పుటకు ప్రబల నిదర్శనములు. అవి 1) ద్వాదశాక్షరి మహామంత్రము, 2) షోడశాక్షరి మహామంత్రము వీటిని గూర్చి వేమనయోగి స్పష్టముగా చెప్పియున్నాడు.

**ద్వాదశాక్షరి మహామంత్రము:**

**తే॥ ద్వాదశాక్షరి మంత్రంబు జాడదెలిసి**
**యీ శరీరంబునకు మూలమెన్నరాని**
**సరణి మరిగిన నిత్యమౌ పరము గల్గు**
**విమల గుణ రాజయోగీంద్ర వేమనార్య ॥ । 6 ।**

| | ఏతత్ | మిథ్యా | శుద్ధ | వియత్ | కించి | న్నాస్తి |
|---|---|---|---|---|---|---|
| = | ఈ | వుత్త | బట్ట | బయలు | ఏమి | లేదు |

ఇదియే ద్వాదశాక్షరి మహామంత్రము.

సర్వమునకు మూలకారణమైన, స్వయం ప్రకాశస్వరూపమైన ఎరుకనే బట్ట బయలు అని మతవాదులు నిర్ణయము చేసియున్నారు. కాని ఎరుకయే మిథ్యా స్వరూపమైనది. కనుక అచల సిద్ధాంతులు ఆ బట్టబయలు వుత్తది అని బట్ట బయలుకు వుత్త అని పైన చేర్చినారు. అచల పరిపూర్ణ బ్రహ్మము నందు ఎరుక శూన్యము. కావున ' ఈ వుత్త బట్టబయలు ఏమి లేదు' అని సిద్ధాంత నిర్ణయం. ఇక వున్నది ఆ పరిపూర్ణ బ్రహ్మమేనని ఈ మహా మంత్రము పరోక్షంగా చెప్పుచున్నది. ఈ విధంగా ద్వాదశాక్షరి మహామంత్రము యొక్క జాడ తెలిసికొని, ఈ గుర్తెరిగే శరీరమునకు మూలము గానీ, స్థానముగానీ కాని ఆ అచల పరిపూర్ణ బ్రహ్మము యొక్క స్థితిని తెలిసికొనిన వానికి నిత్యమైన పరము కలుగునని వేమనార్యుడు బోధించుచున్నాడు.

షోడశాక్షరి మహామంత్రము:

ఆ॥ షోడశాక్షరముల శోధించి మదినెంచి
గూఢ భావమూని కుదియ బట్టి
వేడు కలర ముక్తి విన్నంది చూడరా!
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 162

| | నిర్మూల | మే | తథా | జ్ఞాన | శ్శరీరం | నాస్తి | కేవలం |
|---|---|---|---|---|---|---|---|
| = | మూలం | లేని | ఈ | గుర్తెరిగే | శరీరం | ఏమి | లేదు |

ఇదియే షోడశాక్షరి మహామంత్రము.

క్షేత్రక్షేత్రజ్ఞుల కలయికే ఈ గుర్తెరిగే శరీరం. ఇది వున్నట్లు భ్రమమాత్రమే కానీ, వస్తువు నిజంగా లేదు. సర్వత్రా వున్నది ఆ అచల పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే. ఈ గుర్తెరిగే శరీరమునకు మూలం లేదు. మరియు శూన్యమైనది. కనుక 'మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమి లేదు' అని వేమన యోగి సిద్ధాంత నిర్ణయం. దీనినే పై పద్యములో వేమన విస్పష్టముగా చెప్పియున్నాడు. ఈ షోడశాక్షరి మంత్రంచే ఎరుకను శోధించి, జ్ఞానమే శరీరమని మదినెంచి, ఈ గుర్తెరిగే జ్ఞాన శరీరమునకు మూలంలేదని, శూన్య స్వరూపమైనదని గూఢ భావమును గ్రహించి, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమిలేదని కుదియ బట్టి, వేడుకతో ఇదంతా కలయేనని తలచి, అచలయోగి ముక్తిని పొందియుంటాడని విశ్వదాభిరాముడైన వేమనయోగీంద్రుడు ప్రవచించుచున్నాడు.

సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు